# చతుర

సంపుటి : 3 మార్చి 1980 సంచిక : 2

## ఈ నెల సమగ్ర నవల

మనిషిలోని రాక్షసుణ్ని తట్టి లేపేది పగ, ప్రతీకారం. ఆ రెండూ మనిషిని బానిసగా చేసుకున్నప్పుడు జరిగే అనర్థాలు లెక్కలేనన్ని. రెండు వర్గాల మధ్య తరతరాలుగా చెలరేగుతున్న ఘర్షణల్నీ, ద్వేషాగ్ని జ్వాలల్నీ చల్లార్చడానికి ప్రయత్నించకపోగా స్వలాభంకోసం ఆ మంటల్లో మరింత ఆజ్యంపోసే మధ్యవర్తులున్నంత వరకూ ఏ మలయ మారుతాలూ, హిమపాతాలూ, కల కంఠి కన్నీటి ధారలూ పని చెయ్యవు. అంతవరకూ ఆ దారుణ మారణ

# మానవహోమం

లో అందరూ శలభాల్లా మాడిపోవలసిందే! రాయలసీమ గ్రామీణ ముఠా తగాదాలు మరో కురుక్షేత్రంలా ఎలా పరిణమించాయో తెలియచేసే



# చతుర

కవర్ ఫోటో : కె. కె. అగర్వాల్

2వ కవరు : సూరజ్ యస్. శర్మ

3వ కవరు : టి. సూర్యనారాయణ

# మానవహోమం

ఈ నవల 'మానవ హోమం' ఈనాటి రాయలసీమ గ్రామీణ ముఠా రాజకీయ వాతావరణానికి దర్పణం. ఇందులోని సంఘటనలు ఎక్కడైన జరిగి ఉండవచ్చు. కానీ ఈ నవలలో మాత్రం ప్రత్యేకంగా ఏ ఒక్క గ్రామాన్నిగానీ, ఏ కొందరో వ్యక్తులను గానీ దృష్టిలో పెట్టుకుని చిత్రణ జరగలేదని మనవి.

చతుర
ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# విపుల జీవన వైవిధ్యం

ఈ విశాల విశ్వంలో గల విభిన్న ప్రాంతాలలో కనుపించే జీవన సరళిలోని వైవిధ్యం అనంతం. ఆ వైవిధ్యాన్ని కళాత్మకంగా చిత్రించిన వివిధ ప్రాంతాల, వివిధ భాషల ఉత్తమ కథా సాహిత్యానికి వేదిక 'విపుల'. మీరు ఎక్కడికీ వెళ్ళనవసరం లేకుండానే ప్రపంచాన్నంతా మీ ముందు పరుస్తుంది విపుల. వైవిధ్యం వెల్లివిరిసే కళాత్మక సాహిత్య సుమ సౌరభాన్ని వెదజల్లే 'విపుల' చదవటం ఒక గొప్ప అనుభవం.

'విపుల' కథా పఠనం మీలో రేకెత్తించే అనుభూతి అపూర్వం. ఎందరెందరి జీవితానుభవాల్నో స్వంతం చేసుకోగలగటం అందరికీ సాధ్యం కాదు. దాన్ని సుసాధ్యం చేస్తుంది 'విపుల'.

కథలకు తోడు ఉల్లాసాన్నిచ్చే కార్టూన్లు, జోకులు, విచిత్ర విశ్వ పరిచయం, ప్రతి కథకూ రెండు రంగుల్లో ఆకర్షణీయ చిత్రాలు 'విపుల' ప్రత్యేకతలు. రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో 132 పేజీలు 125 పైసలే.



# బూమరేంగ్

1967లో అమెరికాలోని వుడ్‌స్టాక్‌లో ఒక సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటు చేశారు. కాని వర్షం వల్ల ఆ కార్యక్రమం జరగలేదు. కార్యక్రమ నిర్వాహకుడు ముందుగానే ఆ కార్యక్రమాన్ని మూడు రోజులకు ఉదయం పది గంటలనుండి రాత్రి పదిగంటలవరకూ రెండువేల నాలుగు వందల డాలర్ల నుంచి ఏడువేల రెండు వందల డాలర్ల వరకూ ఇన్స్యూర్ చేయించాడు. అందువల్ల కంపెనీ నుండి నష్టపరిహారం కోరాడు. ఆ కంపెనీ వాళ్ళు వాల్డర్ జెల్డ్‌మన్ దగ్గరికెళ్ళి మొరపెట్టు



కున్నారు తమకేసు చేపట్టమని. అతను వివరంగా పరిశీలించి, ఇన్స్యూర్ చేసిన సమయంలో భారీవర్షం కురవలేదనీ, చేయనిసమయంలో మాత్రమే కురిసిందని ఋజువు చేశాడు. అందువల్ల ఇన్స్యూర్ చేసిన సమయంలో కార్యక్రమం జరగనంత భారీగా వర్షం కురవలేదు కనుక కంపెనీ నష్టపరిహారం యివ్వానవసరం లేదని తేలింది.

# హిరణ్య పురాణం

మూడు ప్రమోషన్లొచ్చినా మొగుడు రవ్వల ముక్కుపుడక చేయించలేదని మీనాక్షి అలిగిందిట. నిజమే! బంగారం ధర ఆకాశాన్నంటుతున్నా ప్రజలకి దాని మీద మోజు 'గింజెత్తు' కూడా తగ్గలేదు. బంగారం భారతీయుల ఆరోప్రాణం. సగటున భారతీయులుకొన్ని వేలకోట్ల రూపాయల ఖరీదు చేసేబంగారాన్ని కొంటున్నారు. ఏటా ఆరు కోట్ల తొంభైలక్షలు కేవలం నగలకోసమే వినియోగిస్తున్నారు. దీన్నిబట్టి ఏ అభివృద్ధి కార్యక్రమాలకీ పనికిరాకుండా నగలుఆభరణాల రూపంలో ఎంత బంగారం నిరుపయోగంగా పడివుందీ తెలుస్తోంది. నిజానికీ బంగారంతో భారీ ప్రాజెక్టులను నిర్మించవచ్చు. చాలావరకు మనదేశంలో బంగారం హిందూదేవాలయాల్లోనూ, ట్రస్టీల్లోనూ నిక్షిప్తమైవుంది. వైభవంలో తిరుపతి వెంకటేశ్వరస్వామి దేవాలయాన్ని రోమ్‌లోని వేటికన్ పోప్‌తో పోల్చవచ్చు. ఒకటన్ను బంగారు ఆభరణాలు, 600 కిలోల మేలిమి బంగారం వున్నాయి స్వామివారికి. జాతీయ సంపదనిలా భక్తి పేరుతో మురగబెడుతున్న మనవారి మూఢ విశ్వాసాలకి తలవంచి మొక్కాల్సిందే.

బంగారాన్ని తవ్వితీయడం పాతపద్ధతి. కాని యంత్రాల సహాయంతో బంగారాన్ని వెలికితీయడం 200 సంవత్సరాల క్రింద ప్రారంభమైంది. ప్రపంచం మొత్తంలో సంవత్సరానికి 1,450 టన్నుల





బంగారం ఉత్పత్తి అవుతోంది. మొత్తం ఉత్పత్తిలో 80 శాతం రష్యా, దక్షిణ ఆఫ్రికాదేశాల అదుపులో వుంది. రష్యా బంగారాన్ని గురించిన లెక్కలు ఎంత రహస్యంగావుంచినా, పాశ్చాత్య అంచనాల ప్రకారం సైబీరియాలో సంవత్సరానికి 400 టన్నుల బంగారం ఉత్పత్తి అవుతుందని తెలుస్తోంది. 1975లో దక్షిణాఫ్రికా బంగారు వుత్పత్తి 700 టన్నులు. అయినా ప్రతి సంవత్సరం ఉత్పత్తి తగ్గుతూ వుంటుంది.

మనదేశంలో 1888లో కోలారు గనులనుండి బంగారం ఉత్పత్తి ప్రారంభమైంది. ప్రస్తుతం ఉత్పత్తి మూడు వేలకిలో గ్రాములు. 13 వేల మంది పని వాళ్ళతోను, 200 మంది అధికారులతోను పనిచేస్తున్న కోలారు గనుల్లో రోజురోజుకీ లాభాలకంటే నష్టాలే ఎక్కువగా కనిపిస్తున్నాయి.

మత పరంగా, సాంఘికంగా, ఆర్థికంగా ఎన్నో కారణాలవల్ల బంగారం గిరాకీ పెరుగుతోంది. స్త్రీలకున్న బంగారం వ్యామోహాన్ని గురించి వెరేచెప్పక్కర్లేదు.

మనదేశంలో 1970లో 240 టన్నుల బంగారం కేవలం నగలు చేయించుకోడానికి మాత్రమే కొనుగోలు చేయబడింది. దాని ఖరీదు పన్నెండు వందలకోట్ల రూపాయలు. ప్రపంచం మొత్తం మీద ఐదు వేల ఐదు వందల కోట్ల రూపాయలు బంగారు ఆభరణాల కోసం వెచ్చిస్తున్నారు.

ఆభరణాల కోసమేగాక, కంప్యూటర్లు, దూరదర్శిన్‌ల తయారీలో కూడా బంగారాన్ని విస్తృతంగా వాడుతారు.

ఇంగ్లండు, నెదర్‌లాండ్స్, ఇతర స్కాండినేవియన్ దేశాల్లో బంగారం కొనడానికి పర్మిట్ కావాలంటే ఆశ్చర్యపడతారు. 24 కారెట్ల బంగారం అక్కడి సామాన్య పౌరులెవరూ కొనలేరు. ఎందుకంటే ప్రభుత్వంనుండి పర్మిట్‌గానీ, లైసెన్స్‌గానీ వుంటేనేగాని వ్యక్తిగతంగా బంగారం కొనడానికి వీల్లేదు.



దుబాయ్ స్మగ్లర్ల పాలిటి భూతల స్వర్గం. పూర్తిగా స్మగ్లింగ్ మీదే ఆధారపడి లక్షలు గడించిన వాళ్ళున్నారు.

ఎంతో అభివృద్ధి చెందిన నౌకాదళం, వైమానిక దళం వున్న భారతదేశం బంగారు స్మగ్లింగ్‌ను నిరోధించలేకపోవడం చాలా శోచనీయం.

# నిజం నిజం

ఈ మధ్య బ్రిటన్‌లో ఏ చిన్న అబద్ధం చెప్పినా, కట్టుకథలల్లినా ఇట్టే పట్టేసే సాధనాలు రెండు మార్కెట్‌లో కొచ్చాయట. కాస్త నోటి దురద వున్న వాళ్ళకి ఇవి మాటిమాటికీ వార్నింగ్ ఇస్తుంటాయట చెవిలో జోరీగలాగ. ఈ

రెండు సాధనాల్లో ఒకటి చేతిగడియారంలో అమర్చుకొనేది, మరోటి ఫోన్‌లో అమర్చేది. అసలే ఈ రోజుల్లో అబద్ధాలు చెప్పకుండా రోజు గడవదు మామూలు మనిషి నుంచి వ్యాపారస్తునిదాకా. వ్యాపారస్తులు కస్టమర్ల చేత సరుకులు కొన్పించడానికి ఆడే అబద్ధాలు అన్నీ ఇన్నీ కావు. భార్యాభర్తలు, స్నేహితులు ఎవరైనాసరే ముఖప్రీతి కోసం మాట్లాడితేచాలు ఎర్ర దీపం వెలిగించేస్తుందట ఈ సాధనం.

గడియారంలో అమర్చే సాధనంలో ఒక సిలికాన్ ముక్క వుంటుంది. స్వరంలోని స్వల్పమైన ఒత్తిడులను కూడా ఇది కనిపెట్టేస్తుంది. టెలిఫోన్ డిటెక్టర్ సబ్బుపౌడి పాకెట్ పరిమాణంలో వుంటుంది. అబద్ధం చెప్పగానే ఫోన్ మీదున్న ఎర్ర దీపం వెలిగించేస్తుందిట ఇది. కనుక అందరూ తగు జాగ్రత్తలో వుంటున్నారట ఏది మాట్లాడితే ఏం ముంచుకొస్తుందోనని.

# ప్రాక్టికల్ జోక్

తమిళనాడులోని పళని అనే ఓ చిన్న పట్టణంలో ఇటీవల ఓ విచిత్ర సంఘటన జరిగింది. అక్కడి స్థానిక పోలీస్ స్టేషన్లో పోలీసాఫీసరుగా పని చేస్తున్న 'బాలు' భార్య సీత ఓరోజు మధ్యాహ్నం వీధి గుమ్మంలో నిలబడి పక్కింటి వాళ్ళతో పిచ్చాపాటీ మాట్లాడుతోంది. ఇంతలో ఉత్తరం ముక్కయినా లేకుండా తన ఆడపడుచు బంధుబలగంతో రావడం చూసి ఆశ్చర్యపోయింది. అంతా కలిసి యాభై మంది దాకా వున్నారు. అసలే నెలాఖరు రోజులు. ఇంట్లో సరుకులు అన్నీ ఇంచుమించుగా నిండుకున్నట్టే!



పోనీ బజారునుంచి తెప్పిద్దామన్నా చేతిలో డబ్బుల్లేవు. అంతమందికి కనీసం కాఫీ ఇవ్వాలన్నా కష్టమే. ఏంచేయాలో తోచని స్థితిలో పడిపోయింది సీత. కానీ వచ్చిన వాళ్ళెవరి ముఖంలోనూ సంతోషఛాయలు లేవు. అయినా నవ్వు మొహంతో "రండి రండి ఆయన ఇపుడే భోంచేసి పోలీసు స్టేషనుకు వెళ్ళారు. తొందరగానే వచ్చేస్తారని" చెప్పింది. అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఇంతలో బాలు రానే వచ్చాడు. చెల్లెల్ని, బంధువుల్ని క్షేమ సమాచారాలు అడిగాడు. నవ్వుతూ, తుళ్ళుతూ కళ్ళెదుట సజీవంగా నిలబడి వున్న బాలునిచూసి అందరూ అవాక్కయి పోయారు. కొంచెం సేపటికి తెప్పరిల్లి "బాలు కూతురు మాల బాలు చనిపోయాడని ఇచ్చిన టెలిగ్రాం అందుకుని కనీసం శవాన్నయినా చూద్దామని వచ్చామన్నా" రంతా.

ఆమధ్య తమిళనాడు పోలీసు ఉద్యమం జరిగినప్పటి సమ్మెలో బాలు పాల్గొన





లేదు. దాంతో అతనంటే గిట్టనివాళ్ళు ఈ విధంగా అక్షరాల్లో అతన్ని చంపి కసి తీర్చుకున్నారు.

ఏదిఏమైనా అన్నగారు బతికున్నందుకు కోటి దేవుళ్ళకు కృతజ్ఞతలు చెప్పుకుంటూ, బంధువర్గంతో అత్తవారింటి దారి పట్టింది బాలు చెల్లెలు. టెలిగ్రాం విషయం ప్రస్తావిస్తూ తగిన చర్య తీసుకోవల్సిందిగా పై అధికారులకు అర్జీ పెట్టుకున్నాడు బాలు. నలభై ఎనిమిదేళ్ళ బాలు ఈ గొడవల వల్ల మనసు కలచినట్లయి మనశ్శాంతి కోసం కొన్నాళ్ళు సెలవు పెట్టి విశ్రాంతి తీసుకుంటున్నాడు.

## పారాహుషార్

న్యూయార్క్‌లోని భూగర్భ రైల్వే స్టేషన్ల దగ్గర మోసగాళ్ళను వెతికి ఓ పట్టు పట్టడానిగ్గాను కర్టిస్ స్లివా అనే అతను "రెడ్ ఏంజిల్'' అని పిలవబడే మనుషులతో కూడిన రాక్ బ్రిగేడ్ నేర్పాటు చేసినప్పటినుంచి ప్రయాణీకులు భయంపోయి గుండెమీద చెయ్యేసుకొని నిశ్చింతగా ఊపిరి పీల్చుకుంటున్నారట. 'ది రాక్' అన్న పేరుతో పిలవబడే కర్టిస్ కేవలం పదముగ్గురు చాకుల్లాంటి వ్యక్తులతో రాత్రి 8 గంటల నుండి ఉదయం 4 గంటల వరకూ కాపలా కాసే పని చేపట్టాడు. వీళ్ళ దగ్గర బొమ్మ పిస్తోలు కూడా వుండదు. ఎటొచ్చీ ఆరు నెలలు జూడో, కరాటేలో శిక్షణ పొందుతారంతే. ఆ స్టేషన్ దగ్గర వీళ్ళు పహారా ప్రారంభించినప్పటి నుంచి నేరాల సంఖ్య తగ్గిందని న్యూయార్క్ పోలీసు శాఖ వారు కూడా అంగీకరించారు. ఇప్పుడీ స్క్వాడ్‌లో ముప్ఫై ముగ్గురు సభ్యులున్నారు. నగర రక్షణ విషయంలో ఎంతో సేవ చేస్తున్నారని భావించే వ్యక్తులు,



సంస్థలు ఇచ్చే విరాళాలమీద ఈ స్క్వాడ్ నడుస్తోంది. స్క్వాడ్ నాయకుడు కర్టిస్ తన పదహారవ ఏటే మంటల్లో చిక్కుకున్న భవనం నుంచి ఐదుగురు సభ్యులున్న కుటుంబాన్ని రక్షించిన ఘనుడు.

## టెలిఫోన్లో సెక్స్-కంట్రోల్

ఫోను వున్నందువల్ల పనులు ఎంత త్వరగా జరుగుతాయో అంత తలనొప్పులు కూడా తెచ్చి పెడతాయని లండన్లోని కొన్ని ఉదంతాలవల్ల తెలుస్తోంది.

ఈ మధ్య లండన్లోని తంతి తపాలా శాఖాధికారులు టెలిఫోన్ డైరక్టరీలో వున్న పేర్లకి ముందున్న కుమారి, శ్రీ, శ్రీమతి లాంటి లింగ భేదాన్ని తెలియ

జేసే పదాల్ని తొలగించేశారు. ఆఁ దాందే ముంది! పేరుంటేచాలు ఆడో, మగో తెలుసుకోవడం ఎంతసేపని ఎగిరి గంతేసే



వాళ్ళ ఆట కట్టించేందుకు గాను ఆడవాళ్ళ పూర్తి పేరు రాయకుండా వారి ఇంటి పేరో లేక పొడి అక్షరాలో వేస్తున్నారు.

అసలీరభసంతా ఎందుకయ్యా వృధా ప్రయాస అనుకుంటే మీరు పప్పులో కాలేశారన్నమాటే. రానురాను ఈవ్ టీజింగ్ (ఆడ పిల్లల్ని ఏడిపించడం) ఎక్కువై పోయింది. ఆడ పిల్లలకి ఫోన్లు చేసి సెక్సీ జోక్స్ వేస్తూ వాళ్ళను ఏడిపించడం లండన్‌లో పెద్ద ఫ్యాషనై పోయింది. కొంతమంది అంతటితో ఆగక, 'రేప్' చేస్తామనికూడా బెదిరిస్తున్నారట.

అందంగా, సెక్సీగా వుండి మగవారి మనసుల్ని అయిస్కాంతంలా ఆకర్షించే అమ్మాయిలు నడుపుతున్న ఓ షాపు పేరును అసలు డైరక్టరీలోనే లేకుండా చేశారు. అన్నింటికంటే విచిత్రమేమిటంటే 'ఛైర్మన్' అన్న పేరును కూడా తీసేసి దానికి బదులు 'ఛైర్ పర్సన్' అని ముద్రించడం.

# తాబేలు రభస

మనుషుల్ని చూడగానే గునగునా నడుచుకుంటూ దూరంగా వెళ్ళిపోయే తాబేలునే చూశాం గాని మనుషుల వెంటపడే తాబేళ్ళను ఎవ్వరూ చూసివుండరు. కాని అలా మనుషుల్ని భయపెట్టే ఓ తాబేలు



హాలిఫాక్స్‌లోని వీట్ లే లో వుంది. ఆఖరికి షార్క్ చేపకూడా భయపడేంత బలమైన దవడలున్నాయట దీనికి. సరదాగా తిరుగుతూ తనకు నచ్చిన వాటినల్లా నోట వేసుకోవడం అలవాటట దీనికి. ముఖ్యంగా మనిషి వేళ్ళంటే మహా సరదా పడిపోతుందట. అందుకని దీని యజమాని ఇసోబెల్ కోటింగ్‌హామ్ కుక్కలున్నాయ్ జాగ్రత్తలాగ ఒక హెచ్చరిక బోర్డు తగిలించాట్ట తాబేలుంది జాగ్రత్త అని. టిమ్మి అనే ముద్దు పేరుగల ఈ తాబేలు ఓం ప్రథమంగా ఓ టెలిఫోన్ ఇంజనీర్ వేలుని కొరికి ప్రారంభోత్సవం చేసిందట. అత్యంత సాధారణమైన ఈ తాబేలు ఎవరన్నా నోటికి దొరికితే మాత్రం ఉడుం పట్టు పడుతుందట.





ఎప్పుడన్నా కొట్టింగ్‌హామ్స్ పిల్లల కాళ్ళుగాని దీనికి తగిలితే గదిచుట్టూ వాళ్ళని పరిగెత్తిస్తూ వెంటపడుతుందట. అడపా దడపా యజమాని, యజమానురాలిని కూడా కొరికి సత్కరిస్తుంటుందట. ఆఖరికి వాళ్ళింట్లో ఆల్సేషియన్‌కి కూడా టిమ్మీని చూడగానే ముచ్చెమటలు పోస్తాయట.

# సిరి తా వచ్చిన

**13**ఏళ్ళ సుందరం కారణాంతరాల వల్ల తల్లిదండ్రుల నుండి విడిపోయి మలేషియానుండి ఓడలో మద్రాసు వచ్చేశాడు. 'జేబులో వున్న మూడు రూపాయలతో ఎన్నాళ్ళు గడపాలా ?' అనుకుని ఓ గూడ్సు రైలు పట్టుకుని బొంబాయి చేరాడు. ఆగ్రా వెళ్ళి తాజ్‌మహల్ చూడాలని కోరిక. కానీ కాలే కడుపు, ఖాళీ జేబులు భవిష్యత్తంటే భయాన్ని కలిగించడంతో పెయింటింగ్‌లో తనకున్న నేర్పు గుర్తొచ్చింది. దేవాలయాలు, చర్చిలు వున్న జనసమ్మర్దమైన ప్రదేశాల్లో చాక్‌పీస్‌తో రోడ్లమీద బొమ్మలు వేసి, దారినపోయేవాళ్ళు దయతో రాల్చిన చిల్లర డబ్బుల్తో రోజులు గడుపుతున్నాడు. ఓ రోజు పార్కులో కూర్చుని రొట్టెముక్క నములూ భవిష్యత్తుగురించి ఆలోచిస్తుంటే తనబోటివాడే ఓ డెన్మార్క్ వ్యక్తి తారసపడ్డాడు. అతగాడికి కాస్త రొట్టెముక్కిచ్చి తన కథంతా వినిపించాడు. అతగాడు కూడా తనలాగే ఇంట్లోంచి పారిపోయిన వాడే. కాకపోతే వయసులో పెద్దవాడు. స్నేహానికి వయసుతో సంబంధం లేదన్నట్లు ఇద్దరూ కలిసి జాయింటుగా బొంబాయి వీధులన్నీ తమ చిత్రలేఖనా చాతుర్యంతో పావనం చేయడం మొదలెట్టారు. డెన్మార్క్ పెద్దమనిషి హస్త



వాసి మంచిదేమో ! ఒక్క రోజులోనే ఇద్దరూ 375 రూపాయలు సంపాదించారు. దాంట్లో కొంత సొమ్ము సుందరానికిచ్చి కరాచీవెళ్ళి అక్కణ్నించి తన స్వస్థలమైన ఇటలీకి వెళ్ళమన్నాడా పెద్దమనిషి.

కానీ దేముడు వరమిచ్చినా కస్టమ్స్ అధికారులు వరమీయలేదు సరికదా ఆదాయపు పన్ను తాలూకు క్లియరెన్స్ సర్టిఫికెట్ చూపించమన్నారు. తను ఆదాయం పన్ను కట్టేస్థితిలో లేననీ, పైసా ఆదాయం కూడా లేని వాణ్ణనీ బతిమాలి ఎలాగో నానాతంటాలూ పడి క్లియరెన్స్ సర్టిఫికెట్ బెడద వదిలించుకుని కరాచీ ఓడ ఎక్కాడు. కానీ అక్కడ కూడా విధి ఎదురు తిరిగింది.

జీవన్మరణ సమస్యలో చిక్కుకున్న సుందరాన్ని చూసి ఓ అమెరికా దేశస్థుడు జాలిపడి సరిపడ డబ్బిచ్చి రక్షణకోసం స్విట్జర్లాండు పంపించాడు.

అక్కడ హోటల్లో కొన్నాళ్ళు రిసెప్షనిష్టుగా పన్జేశాడు సుందరం. అప్పుడే బాగా డబ్బున్న ఓ ఇటలీ దేశస్థునితో పరిచయం కలిగింది. అతగాడు ఇతన్ని తన దేశం తీసుకెళ్ళి రబ్బరు ఫ్యాక్టరీలో మంచి ఉద్యోగం ఇప్పించాడు. రబ్బరు ఫ్యాక్టరీలో పనిచేస్తుండగానే టొరినా అనే ఓ ఇటలీ దేశస్థురాలిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. తర్వాత తనేస్వంతంగా రబ్బరు పరిశ్రమకు సంబంధించిన వ్యాపారాన్ని పెట్టుకుని మూడుపువ్వులు, ఆరుకాయలుగా దాన్ని విస్తరింపజేశాడు. చిత్రలేఖనం, ఫొటోగ్రఫీ, పాప్‌మ్యూజిక్, డాన్సింగ్‌లలో ప్రావీణ్యం సంపాదించాడు.

ఇటీవల సుందరం మద్రాసు వచ్చినపుడు సినిమాలో ఓ పాత్ర వేయమంటే సంతోషంగా వొప్పుకున్నాడు. తిండికోసం మొహం వాచిన గతంలో తనకి మార్గం చూపించిన డెన్మార్కు ఆగంతకుణ్ణి అతనెపుడూ స్మరించుకుంటూనే వుంటాడు

# షాక్..షాక్..

ఇటీవలి కొన్ని వార్తల వల్ల చాలా మంది శాస్త్రజ్ఞులకి షాక్ కొడుతోంది. ఎందుకంటే అన్నీ షాకింగ్ వార్తలే.

మిసోరి సిడిలియా బెర్లిన్‌లోని ఓ చిన్న పట్టణం. జెనీమోర్గన్ అనే అమ్మాయి రోజూలాగే ఆ రోజుకూడా బోరింగ్ పంపులో నీళ్ళతోడి ఒక బిందె నిండాక ఇంకో బిందెలోకి పోస్తుండగా వున్నట్టుండి తన చేతినుండి మెరుపు రవ్వలు రావడం గమనించి భయంతో గట్టిగా అరిచింది. అరుపులువిని పరుగెత్తుకుంటూ వచ్చిన వాళ్ళమ్మ జెనీని పట్టుకోగానే విద్యుద్ఘాతం తగిలి ఓ అడుగు



వెనక్కి పేసింది. అంటే జెనీ శరీరంలో విద్యుత్ ప్రవహిస్తోంవన్నమాట. ఎన్నో పరీక్షలు, పరిశోధనలు చేసినాగాని జెనీ శరీరంలోని విద్యుత్ సంగతి డాక్టర్లెవరికీ అంతుపట్టలేదు. ఇంతలో జెనీ ఆరోగ్యం బాగా పాడయిపోయింది. తన పని తను చేసుకోవడమే కష్టమై పోతోందామెకు. డాక్టర్లు, శాస్త్రజ్ఞులు ఆమెకు ఎన్నో విధాలైన చికిత్సలు చేసి చేసి విఫలులయ్యారు, కానీ కొద్ది రోజుల తర్వాత హఠాత్తుగా మంత్రం వేసినట్లు జెనీ స్వస్థురాలైంది. ఆమె శరీరంలోని విద్యుత్ మటుమాయమైపోయింది.

కెనడాకి చెందిన కెర్లిన్ క్లేయర్ కూడా సరిగ్గా ఇటువంటి అనుభవానికి లోనయింది. ఒకసారామెకు విపరీతమైన అనారోగ్యం వచ్చింది. ఆ తర్వాత ఆవిడ మామూలు స్థితికి రావడానికి రెండేళ్ళు పట్టింది. ఓరోజు మామూలుగా మార్నింగ్ వాక్‌కు వెళ్దామని లేస్తూ ఇనప కుర్చీని

పట్టుకుంది ఆసరాగా. అంతే! ఆమె చెయ్యి కుర్చీకి అతుక్కుపోయింది. అప్పట్నించీ ఆమె శరీరంలో విద్యుత్ ప్రవహించడం మొదలయింది. కొద్ది రోజులకి జెన్నీలాగే క్లేయర్ కూడా ఈ విద్యుత్ గొడవ నుండి అసుకోకుండా బైటపడింది.

ఐర్లండు వాస్తవ్యురాలు మిస్ స్మిత్‌కి కూడా ఇలాగే జరిగింది. వీటిని చూస్తుంటే మన శరీరంలో విద్యుత్ ఎంతో కొంత శాతం వుందని తెలుస్తోంది.

మనుషుల్లోనేగాక జంతువుల్లో కూడా ఈ విపరీతం వుంది. జంతువులు సాధారణంగా తమ ఆహారం సంపాదించుకోవడం కోసం ఈ విద్యుత్‌ను వినియోగిస్తాయి.

మన శరీరంలోని విద్యుత్తు యోగ సాధన చేసే సమయంలో ఎన్నో అద్భుతాలను చేయించగలదంటే నమ్ముతారు కదూ !

# చిచ్చర పిడుగు

ఆ మధ్య జర్మనీలో 15 ఏళ్ళ ఓ చిచ్చర పిడుగు కేవలం కుళ్ళిన మాంసం, వైరు ముక్కలతో అందరినీ హడలగొట్టి రెండు బ్యాంకు దొంగతనాలు చేసి హీరో అయ్యాడు. ఓ ఫైన్ మార్నింగ్ ఈ పిల్లవాడు ఫ్రాంక్‌ఫర్ట్‌లోని స్కిల్లర్ ష్ట్రాస్సెలోని డ్రెస్‌డన్ బ్యాంకులోకి ప్లగ్, కేబుల్‌తో అడుగుపెట్టి ప్లగ్‌ను సాకెట్‌లో పెట్టి ఖాళీగా వున్న వైరు చివర్లను ఓ కస్టమర్ మెడ దగ్గర పెట్టి— "డబ్బు బైటికి తియ్యి లేకపోతే ఇతను ఛస్తాడ"ని బెదిరించే సరికి, కేషియర్ హడలిపోయి మూడువేల పౌన్లను ప్లాస్టిక్ సంచిలో పెట్టి బుద్ధిగా చేతి కందించాడట.



ఆ సంచితో బాలవీరుడు వీధిన పడ్డాడు. బ్యాంకుకి ఓ 300 గజాల దూరంలో న్యూస్‌పేపర్లమ్మే పాకిస్తానీ వ్యక్తి ఈ పిల్లాడిని పట్టుకున్నాడు. వాళ్ళిద్దరి పోరాటంలో సంచి కాస్తా చిరిగి డబ్బు చెల్లా చెదురుగా పడిపోయింది. చుట్టు పక్కల వాళ్ళు పరుగు పరుగున వచ్చి, ఎవరి కందినంత వారు జేబులు నింపుకున్నారు. పోలీసు లొచ్చేలోపలే చాలా వరకూ డబ్బుల్తో సహా మనుషులందరూ మాయమయ్యారు. పిల్లాడిని మాత్రం అరెస్టుచేసి పట్టికెళ్ళారు పోలీసులు. అంత శ్రమపడినా పాపం పిల్లాడికి మాత్రం ఏమీ దక్కలేదు. ఇతను ముందొకసారి మార్బాక్ వెగ్‌లోని బ్యాంకులోకి కుళ్ళిపోయిన మాంసం, వాటర్ పిస్టోల్‌తో ప్రవేశించి మాంసాన్ని కేషియర్ ముక్కు దగ్గరపెట్టి డబ్బులిస్తావా దుర్వాసనకి ఛస్తావా అని బెదిరించేసరికి రెండువేల పౌన్లు సమర్పించేశాడట కేషియర్. అతన్ని చూసి అందరూ ముక్కున వేలేసుకున్నారట.



# మానవ హోమం

అది పైడిపల్లె.

పైడిపల్లె పేరు వింటేనే ప్రాణాలు గజగజ లాడుతాయంటే అబద్ధం గాదు. అది అన్ని గ్రామాల్లాంటిది కాదు. అందు నివసించే వ్యక్తులూ అంతే! హత్య జరగని సంవత్సరం లేదు; దొమ్మి జరగని నెల లేదు; కీచులాట లేని రోజు లేదు. చివరకు ప్రభుత్వానికి విసుగు పుట్టి, గ్రామంలో ప్రత్యేకంగా పోలీసు క్యాంపు పెట్టారు. కాని పోలీసుల ముందే పొడుచు కొని చస్తుంటే - పోలీసులు కూడా నోరు మూసుకొని గజగజ వణకి పోయారు.

రెండు కుటుంబాల మధ్య రాజుకున్న పగ రెండువేల జనాభాగల ఆ గ్రామానికి ప్రాకింది. సగం ఒకరివైపు, సగం మరొకరివైపు కత్తులు దూశారు. హత్యలు, దోపిడీలు, తలలు పగులకొట్టు కోవడం లాంటి సంఘటనలు నిత్యకృత్య మయ్యాయి. అందుకే - పైడిపల్లె పేరు వింటేనే ప్రాణాలు పోతాయనే సామెత వచ్చింది. పల్లె పసిడిదే! పంటలు పసిడి పంటలే! ఆ గ్రామంలో పండే పంట, సాధారణంగా ఆ ప్రాంత పల్లెలలో లేదు. ఆ గ్రామానికి వచ్చే ఆర్థిక రాబడి సగటున దేశంలో ఎక్కడా లేదు. కాని ఆ వచ్చే డబ్బు-హత్యలకు, కోర్టులకు, కోర్టు పక్షులకు స్వాహా అవుతోంది. గుండె లవిసేలా పనిచేసి పంటలు పండించడం; ఆ వచ్చిన డబ్బు ఈ విధంగా ఖర్చు పెట్టడం అలవాటయి పోయింది.

ఆ రోజు సంక్రాంతి!

తొలికోడి కూయక ముందే గృహిణులు లేచారు. కళ్లాపి చల్లి ముగ్గు పోస్తున్న వారు కొందరు; పిండివంటలు తయారు చేసేవారు మరి కొందరు.

కరకర ప్రొద్దు పొడుస్తున్నది. ఏ వీధిన చూసినా, రంగు రంగుల ముగ్గులు; గొబ్బిళ్ళు, రంగు రంగుల - గుడ్డలు కట్టి కన్నుల విందుగా తిరుగుతున్న పిల్లలు; అందరూ ఆనందోత్సాహాల్లో మునిగి ఉన్నారు.

కాని వారి ఆనందం ఎంతోసేపు నిలవలేదు. కనీసం పండుగ రోజయినా ఊరు సంతోషంగా ఉంటుందని ఆశించిన కొద్ది మందికి నిరాశే పుట్టింది. పిల్లలు బజార్ల లో గంతులేస్తూ తిరుగుతున్న సమయంలో, నెత్తురోడుతున్న గుడ్డలతో, వీధిన పరుగెత్తుతూ ఇద్దరు వచ్చారు. దానితో ఆ ఊరికి పండుగా అయి పోయింది. వారి ముఖాల మీదున్న ఆనందం ఆరిపోయింది. ఆ నెత్తురు బట్టల వారిని చూస్తూనే ఎవరికివారే ఇళ్ళలోకి పరుగు పెట్టారు. భయవిహ్వలులైన మహిళలు, పిల్లలను లోనికి తీసుకొని తలుపులు బలంగా బిగించారు. నెత్తురోడు తున్న వారి శరీరాలు గ్రామానికి ఏదో దాపురించిందనేందుకు సంకేతమే!

మరి కాసేపట్లో గ్రామంలో హాహా కారాలు, రోదనలు, హూంకరింపులు, కర్రల ఝళిపింపులు ఆరంభమయ్యాయి. వందలాదిమంది ఆగ్రహావేశాలతో ఊగి పోతూ, బజార్ల వెంట పరుగిడుతున్నారు.

మరి కాసేపట్లో ఊరంతా గుప్పు మంది. రైలు దిగి వస్తున్న చెంచురెడ్డిని నల్లాగు వద్ద చంపారు. ఆయన వెంట ఉన్న మిగిలిన ఇద్దరూ, ప్రాణాలతో తప్పించుకోగలిగారు గానీ, మంచి దెబ్బలే తగిలాయి. గ్రామంలోనికి పరుగిడుతూ వచ్చింది వారే! వారి రాక వల్లనే చెంచు రెడ్డిని చంపినట్లు వార్త అందింది. చెంచు




రెడ్డి ఇంటిలోనే కాదు, ఆయన అనుచరుల ఇళ్ళల్లోనూ హాహాకారాలు పుట్టాయి. గ్రామంలోని ఒక వర్గానికి నాయకుడు చెంచురెడ్డి. రెండు వందల యకరాల మోతుబరి ఆసామీ! ఒకప్పుడు అతని తండ్రిని ఆ గ్రామంలోనే నడివీధిలో నరికి చంపారు. ఆ తర్వాత నాయకత్వం అతని దయింది.

హత్య జరిగిన అరగంటలో పోలీసు పటాలం దిగింది. సర్కిల్ తన సిబ్బందికి చేయవలసిన పనులు పురమాయించాడు.

పైడిపల్లెకు రైలు స్టేషన్‌కు ఉన్న దూరం కేవలం మైలు మాత్రమే! మధ్యన 'నల్లాగు' అనే వాగు ఒకటి ఉంది. అది చాలా లోతుగానూ, ఇరుకుగానూ, ఉరవడిగానూ పారుతూ ఉంటుంది. ఆ వాగుపై పొలమంతా మాగాణి భూమి కావడం వల్ల ఎప్పుడూ ఊటనీరు పారుతూనే ఉంటుంది. దారివెంబడి అడవి తుమ్మచెట్లు క్రిక్కిరిసి అల్లుకున్నాయి. ఈ ఒడ్డున ఉన్నవారికి ఆ ఒడ్డున ఏముందో తెలియదు. అందువల్ల దాదాపు హత్యలన్నీ అక్కడే జరగడానికి ఆస్కారమేర్పడింది.

చెంచురెడ్డిని హత్య చేయించింది గురివిరెడ్డి వర్గమే! వారిద్దరి మధ్య పచ్చగడ్డి వేస్తే, భగ్గుమని మండే వైరముంది. ఇద్దరూ బావమరుదులే! అయినా తరతరాలుగా జీర్ణించుకుపోయిన వైరం, వారిలో ఏ మార్పూ తేలేక పోయింది. సంబంధాలు కలుపుకున్నా ఫలితంలేక యధావిధిగా దహనకాండ, హత్యకాండ జరుగుతూనే ఉంది.

వారి మధ్య కొంతకాలం నుండి సంధి సంప్రతింపులు జరుగుతున్నాయి. సమితి అధ్యక్షుడు, శాసనసభ్యుడు, తాలూకాకు చెందిన మరి ఇతర నాయకులు, వారి మధ్యనున్న వైరాన్ని పోగొట్టి, సఖ్యత ఏర్పరచాలని ప్రయత్నిస్తున్నారు. తత్ఫలితంగా కొంత ఆవేశం తగ్గింది. అందువల్లనే పట్నం నుంచి చెంచురెడ్డి, కేవలం ఇద్దరు మనుషులను వెంటబెట్టుకొని వస్తున్నాడు. సాధారణంగా పదుల సంఖ్యలో మారణాయుధాలతో వెంట వచ్చేవారు. కాని ఈ సారి తమ మధ్యనున్న ఉద్రిక్త వాతావరణం చల్లబడిందన్న ఉద్దేశంతో, మనుషులు ఎక్కువ లేకుండా రావడం జరిగింది. మొలలో పిస్తోలుంది. అందులో గుళ్లు నింపి ఉన్నాయి. అయినా లాభం లేక పోయింది. యాభై మంది మీద పడ్డారు. వాగులోనికి దిగేముందు- ముందు వైపు ఏమున్నదీ కన్పించదు. అక్కడే పొంచుకుని ఉన్న శత్రువర్గం హఠాత్తుగా మీది కురికింది... పిస్తోలు తీసే అవకాశం లేదు; పోరాడే అవకాశం అసలే లేదు. పారిపోవడానికి దారి లేదు. 'కోబలీ' అని లేచిన వారు గండ్రగొడ్డళ్ళతో మీద పడి నరికారు. నాయకుని చంపే చూపుతోనే అందరూ ఉండడం వల్ల మిగిలిన ఇద్దరూ పారిపోసాగారు. వారిని కూడా చంపాలని వెంటపడ్డారు; రాళ్లు వేశారు; రాళ్లు తగిలినా లెక్కచేయకుండా పరుగెత్తి, నాలుగు నిమిషాల్లోనే వారు గ్రామంలో పడ్డారు. గ్రామంలో వారి వెంట పడడం ప్రమాదమని ఊరిలోకి పోకుండానే హంతకవర్గం పారిపోయింది. ఆ ఇద్దరూ చెప్పిన వివరాలివి.

సర్కిల్ సావధానంగా విన్నాడు. హత్య చేయించింది గురివిరెడ్డి అనే విషయం సర్కిల్‌కే కాదు- అతని పై అధికారులకూ, వారి పై అధికారులకు కూడా తెలుసు. కాని, అతని మీద కేసు మోపడం

అంత సులభం కాదు. గురివిరెడ్డి ఆర్థిక స్తోమత లేనివాడు కాదు. మంత్రు లతో కూడా డబ్బుతో చాకిరీ చేయించుకో గల సమర్థుడు. తనవంటి సర్కిల్స్‌ను, కనీసం కూర్చోమని కూడా చెప్పడు. ఏదైనా మాట్లాడాలంటే ఆయన ముందు నిలబడి మాట్లాడాల్సిందే! అట్టి పలుకు బడి గలవారి మీద దుమికే సమర్థత గల వాడు కాదు సర్కిల్. జేబుదొంగను పట్టి చావబాదగలడు. కాని, తలుచుకుంటే తన ఉద్యోగం ఊడలాగించేయగల ఇటు వంటి వారి జోలికి పోలేడు.

శవ పంచాయితీ పూర్తయిన వెంటనే, శవాన్ని అతని బంధువులకు అప్పగిం చారు. గురివిరెడ్డి వర్గంలోని మొగవాళ్ళం దరూ ఊరు విడిచి పారిపోయారు. మిగిలి నది వారి పిల్లలూ, ఆడవారూ! వారు కూడా ఏ సమయంలో ఏం జరుగుతుందో అన్న భయంతో వణకుతూ, ఇండ్ల తలు పులు బిగించి కూర్చున్నారు. అన్నం సంగతి సరేసరి! చేసుకున్న పిండివంటలు కూడా తిన్న పాపాన పోలేదు. గ్రామ మంతా విషాదంలో మునిగింది.

చెంచురెడ్డి వర్గం ఆవేశంతో ఊగుతు న్నారు. రోదనలతో, కేకలతో తిరుగు తున్నారు. దాదాపు రెండువందల మంది కర్రలు, బల్లేలు పట్టి తిరుగుతుంటే; వారి ఆడవారు గోచి పోసుకుని, రాళ్లు చేతపట్టి తిరుగుతున్నారు. ఎవరి ముఖం చూసినా క్రౌర్యం, రోషం, బాధ, దుఃఖం నిండి ఉంది. ఏ సమయంలో ఏ అగ్నిగుండం ప్రేలుతుందో తెలియని స్థితి అది.

శవాన్ని పన్నెండు గంటలకు అప్ప గించగా, సాయంత్రం నాలుగు గంటల నుండి ఊరేగింపు ఆరంభమయింది. చెంచు





రెడ్డి రెండవ కొడుకు రాంరెడ్డి, మూడవ కొడుకు గోవర్థనరెడ్డి, తమ్ముడు మల్లా రెడ్డి, అతని కొడుకు శవాన్ని ఎత్తుకు న్నారు. చెంచురెడ్డి చిన్న కొడుకు పధ్నా లుగు సంవత్సరాల గోపిరెడ్డి- సిందు కడ వతో నీళ్లు భుజాన పెట్టుకున్నాడు. వంద లాది స్త్రీ, పురుషుల ఆక్రందనలు, రోద నలు, పెడబొబ్బల మధ్య శవాన్ని లేపారు. చుట్టుపట్ల గ్రామాలలో ఉన్న బంధువర్గం, అనుచర వర్గం వేల సంఖ్యలో హాజరయి, ఊరేగింపులో పాల్గొన్నారు. విషాద వాయిద్యాలతో, రోషం రేకె త్తించే తప్పెట వాయిద్యంతో. మూడు వందల మంది మారణాయుధాలు ధరించినవారూ వారి వెంట, వందల సంఖ్యలో ఆడవారూ శ్మశానానికి తరలారు. అక్కడ పేర్చబడ్డ చితిమీద చెంచురెడ్డి భౌతిక కాయం చేర్చారు. రెండవ కుమారుడు రాంరెడ్డి చితికి నిప్పంటించాడు. అందరూ ఘొల్లున ఏడుస్తూ ఒకరి మీదొకరు ఒరిగి విలపిస్తుం డగా భౌతికకాయం చుట్టూ మంటలు లేచాయి. ఆ దృశ్యం చూచి మల్లారెడ్డి అక్కడే మూర్ఛపోయాడు. అతన్ని భుజం మీద వేసుకుని ఇంటికి మరలారు.

ఇంకా ప్రొద్దుంది. స్వచ్ఛమైన వెలుగు ఉంది; కాని, గ్రామంలో ఆ వెలుగు కన్పించడంలేదు. చీకట్లు వారి గుండెల్ని ఆక్రమించుకున్నాయి. జరిగిందాన్ని గురించి కాదు బాధ! జరుగుబోయేదే బాధ కలిగించేది. చెంచురెడ్డి వర్గం చేతులు ముడుచుకుని కూర్చోరు. ఆయన వార సులు తను ప్రత్యర్థుల చంపడానికి వెను కంజ వేయరు. నాయకుల సంధి సంప్ర తింపులు సక్రమంగా జరిగి వారిద్దరి మధ్య రాజీ అయితే ఆ ఊరు బాగుపడి ఉండేది. కాని బాగుపరచడానికి కొందరు పూను కుంటే. దానిని నాశనం చేయడానికి

చూసేవారూ సహజంగానే ఉంటారు. అందువల్లనే సఖ్యత జరగడానికి ఆలస్యమయింది. ఫలితం చెంచురెడ్డి హత్య; భవిష్యత్తు తిరిగి అంధకారమయం. తిరిగి పైడిపల్లె బ్రతుకు భయం భయంగా పరిణమించింది.




సూర్యుడు ఉదయించాడు. సంక్రాంతి మంచు వణికిస్తున్నది. ఆ చలిలోనే మనుష్యులు పనిచేసుకుంటున్నారు. అయినా వారి వదనాలలో బెదురు, ఆందోళన స్పష్టంగా కనిపిస్తున్నది. ఏ సమయంలో ఏ మొచ్చి మీద పడుతుందో 'నన్న భయంతో, నిత్యకృత్యాలు తొందరగా ముగించి, ఇండ్లకు చేరాలనే ఉద్దేశంతో చకచకా పనులు చేసుకుంటున్నారు. నిన్నటి వాతావరణం సద్దుమణగలేదు.

చెంచురెడ్డి పెద్ద కుమారుడు శ్రీరెడ్డి ఝూన్సీ యూనివర్సిటీలో యం. ఏ. చదువుతున్నాడు. అతడిని రమ్మని నిన్ననే ట్రంకాల్ చేశారు; బయల్దేరుతున్నట్లు తెల్పాడు. ఉదయం తొమ్మిది గంటలకు రైలు స్టేషన్‌లో దిగుతాడు. అతడిని తీసుక రావడానికి సుమారు యాభై మంది దాకా మారణాయుధాలతో ప్రోగవ్వుతున్నారు. చెంచురెడ్డి తర్వాత ఆ ముఠాకు నాయకత్వం నెరిపేవాడు శ్రీరెడ్డి. అందువల్ల అతనిని కూడా చంపడానికి శత్రువు ప్రయత్నించవచ్చు. ముందుగానే స్టేషనులో సిద్ధంగా ఉండాలనే తాపత్రయంతో ఆ యాభై మంది బయలుదేరారు. స్టేషన్ చేరేవరకూ వారి కేకలు అట్టహాసంగా ఉన్నాయి. ఆ సమయంలో శత్రువు కనిపిస్తే ఏమవుతుందో అందరికీ తెలుసు.

వీరు స్టేషన్ చేరిన అర్ధగంటకు బండి వచ్చింది. శ్రీరెడ్డి దిగాడు. వీరు శ్రీరెడ్డి కన్పిస్తూనే కేకలేస్తూ అటు ఉరికారు. ఆ సమయంలో అది స్టేషన్ అని గానీ, జనం ఉన్నారని గానీ, తమ రణగొణ ధ్వని వారికి భీతి గొల్పుతుందని గానీ, వారు ఆలోచించడంలేదు. తమ నాయకుడు వచ్చాడు; తిరిగి శత్రువులమీద దాడి చేయడానికి తమకు బలం చేకూరింది. అదే వారి సంతోషం!

శ్రీరెడ్డి ఏడ్వడానికి సిగ్గుపడ్డాడేమో ఏడ్వడంలేదు. అయినా అది ఏడ్పు ముఖమే! భారంగా స్టేషన్ బయటకు అడుగులేశాడు. అతన్ని మిగిలిన వారు అనుసరించారు.

"అసలు ఎట్లా జరిగిందిది?" అన్నాడు తమ్మునితో. రాంరెడ్డి కంఠం పూడుకుపోయింది.

నాగడు అందుకున్నాడు. "పెద్దరెడ్డి గారు మొన్న ఉదయం కోర్టు పనిమీద కర్నూలు వెళ్ళాడు. ఆయన వెంట నరిశిగాడు, గోపాల్ ఉన్నారు. పరిస్థితి ప్రశాంతంగా ఉంది లెమ్మనీ, ఎవరూ రానవసరంలేదనీ చెప్పాడు. రాత్రిరాలేదు; కర్నూలుకు ఫోన్ చేస్తే అక్కడే ఉన్నాడని చెప్పారు. నిన్న ఉదయం రైల్లోవచ్చారు. జరిగిపోయింది" అన్నాడు పండ్లు కొరుకుతూ.

"నిన్నటినుండీ మన మనుషులు వారి

ఇండ్లమీద పడలేదా ?"

వీరడు కట్టె నేలకేసి కొట్టి గాండ్రించాడు. "దొంగ నా కొడుకులు. ఒక్కడు కూడా ఊరిలో లేకుండా పరారయ్యారు. ఒక్కడు మా చేతికి దొరికినా కీళ్ళు కీళ్లు విరిచి, పత్తి కంపలో వేసి కాల్చేవారం. ఇంట్లో ఉన్న పిల్లలమీదా, ఆడవారిమీదా చేయిచేసుకోవద్దని మీబాబాయి చెప్పాడు."

తర్వాత శ్రీరెడ్డి మాట్లాడలేదు. నెమ్మదిగా బాటవెంబడి నడువసాగాడు. వీరడు, నాగడు, శ్రీరెడ్డి ముందు నడుస్తున్నారు. అన్నకు ఎడమవైపు రాంరెడ్డి, కుడివైపు గోపిరెడ్డి నడుస్తున్నారు. వెనుక మిగిలిన మనుషులు దిక్కులు చూస్తూ నడుస్తున్నారు. ఏమాత్రం శత్రువు కనపడ్డా సర్వనాశనం చేయడానికి వారు సిద్ధంగా వున్నారు. వారి దగ్గర కర్రలే కాదు. ఈటెలు, గండ్రగొడ్డళ్ళు, పిస్తోళ్ళు, బాంబులు ఉన్నాయి. శ్రీరెడ్డి ఇవేం గమనించడం లేదు. ఇంటికి వెళ్లిన తరువాత చేయవలసిన పని గురించి ఆలోచిస్తున్నాడు.

పొలంమీద జొన్న కోసిగూడుఒడ్డారు. ధనియాలు, శనగపొలం పండ బారుతూ కన్పిస్తున్నది. విరబోసుకొని నిల్చిన కంది పిల్లగాలులకు ఊగుతున్నది. ఆ చిరుగాలికి జొన్న ఎండుటాకులు ఊగుతూ చప్పుడు చేస్తున్నాయి. పొలంమీద పడిన జొన్న కంకుల్ని ఏరుకు తినడానికి, పిట్టలు, పక్షులు, గుంపులు గుంపులుగా పొలంమీద వాలుతున్నాయి. కోసివేసిన పెసర కుప్పలు వేశారు. జొన్నకొయ్యలు నిటారుగా నిలబడి ఉన్నాయి. కొర్ర, మెట్టవరి, రాగి మొదలయిన లేత పైర్లు ఇంకా కోతపడలేదు. వడబారుతున్నాయి. ఆకాశంలోని రంగులు క్రిందికి ఒంగి కన్పిస్తున్నాయి.

ప్రకృతి రమణీయకతకు పుట్టినిల్లు పల్లెటూరు. పల్లెటూరిలో పుట్టి పెరిగిన వాడికి పట్నవాసం రుచించదు. రుచించినా పల్లె వాసన విడువలేడు. శ్రీరెడ్డిది ఇదే తత్వం. ఆ గ్రామంలో పదిహేనేండ్లు బ్రతికాడు. అక్కడ ఆడుకున్న ఆటలు, చేసిన చిలిపి పనులు అనేకం అతనికి గుర్తున్నాయి. వాటిని జీవితంలో మరవడం అసాధ్యం. నవంబరు, డిశంబరు మాసాలలో ఊరి బయటకు వచ్చి నిల్చుంటే - కన్పించే పచ్చటి పొలాలను చూస్తూ జీవితాంతం గడపాలనిపిస్తుంది. ఊరి చెరువులో ఈత కొట్టడం నుండి, హైస్కూలు చదువు పూర్తి చేయడం వరకూ అతనికి గుర్తే! ఆ చిన్న వయసులో ఈ ముఠా తగాదాలూ, పోట్లాటలు పట్టవు. పెద్దవాళ్ళు కూడా పిల్లలజోలికి రారు. అందరూ కలిసి ఆడుకోవడం; శత్రువా?శత్రువు పుత్రుడా? అన్న ఆలోచన లేకపోవడం; కేరింతలు కొడుతూ జీవించడం అలవాటు.

ఆలోచిస్తూ నెమ్మదిగా నడుస్తున్న శ్రీరెడ్డి తటాలున ఆగాడు. అదే నల్లవాగు. క్రొత్తవారికి భయంకరంగా కన్పించి, బెదరగొట్టే నల్లాగు. అది అనేక హత్యలను చూసింది; అనేక పోట్లాటలూ చూసింది. అయినా అలాగే ప్రాకుతూ తన నిత్య కృత్యం సాగిస్తున్నది.

శ్రీరెడ్డి నిల్చున్నచోట నెత్తురు మరకలున్నాయి. మట్టిమీద ఎండి, ఎండకు మిల మిల మెరుస్తున్నాయి. అక్కడక్కడ మట్టి ఎత్తినట్లున్నది. ఆ ఎత్తినమట్టి పోలీసులు పరీక్షకు తీసుకెళ్ళినది! ఆ ప్రాంతం చూస్తూనే అతని గుండె కరిగిపోయింది.

అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేసిన తండ్రి; ఆ రక్తపు చుక్కలమీద అతనికి కన్పిస్తున్నాడు. అక్కడ కూలబడి వల వలా ఏడ్చాడు. అతని తమ్ములూ, మిగి లినవారు కూడా, ఏడుస్తూ నిలబడ్డారు. శ్రీరెడ్డి మనస్సు వికలమయింది. తండ్రినే చంపిన శత్రువులు తమను కూడా బ్రతుక నివ్వరు శత్రువు సామాన్యుడు కాదు. అతనికున్న బలం అపారమైనది. అయితే గ్రామస్థాయిలో అతనికి బలంలేక దొంగ దెబ్బ తీస్తూ తిరుగుతున్నాడు. అటువంటి శత్రువుతో రంధికంటే సంధి మేలని తన తండ్రి ఆశించి, అందుకు ప్రయత్నం చేశాడు. కాని, ఆ లోపలే ఆయన నశించాడు.

శ్రీరెడ్డి లేచాడు. అతని కండ్లనుండి కారిన నీరు, చెంపలమీద మెరుస్తోంది. పండ్లు రాపాడుతున్నాయి; పిడికిళ్లు బిగుసు కుంటున్నాయి. వడివడిగా అడుగులు ముందుకు వేశాడు. అతనివెంట మిగిలిన వారు నడువసాగారు.

పోలేరమ్మ గుడి దగ్గరకు వచ్చేసరికి మరికొందరు ఎదురు వచ్చారు. వందకు పైగా ఉన్నారు. కేకలు, ఈలలు, వేస్తూ, బూతులు తిడుతూ చెంచురెడ్డి ఇంటివైపు నడుస్తున్నారు. వారి తిట్లకూ, కేరింతలకూ ముందుగానే శత్రువుల ఇళ్ల తలుపులు మూతలుపడ్డాయి. అనుచరుల ఇళ్ళుతెరుచు కొని ఆడవాళ్ళు, పిల్లలు శ్రీరెడ్డిని చూడ డానికి తలుపు వద్ద నిలుచున్నారు. శ్రీరెడ్డి ఇదేమీ గమనించకుండా ముందుకు సాగి పోతున్నాడు. ఆ సమయంలో శ్రీరెడ్డి చెయ్యి ఊపితే ఊరు నాశనమవుతుంది. అగ్గిలో బుగ్గిలా తయారవుతుంది. శ్రీరెడ్డి ఆ పని చేయలేదు. అన్నిటికంటే ముందు తన తల్లిని చూసి ఓదార్చాలి. ఆమెకు చిచ్చు కలిగించిన వారిని గురించి చర్చిం చాలి. ఈలోగా ఎట్టి దౌర్జన్యం జరుగ కూడదు.

అతని రాకను విషాదంతో ఆహ్వా నిస్తున్నట్లు, ఆవరణలోని ఎద్దులు, ఆవులు, బర్రెలు మోరలెత్తి చూస్తున్నాయి. అరుగు మీదున్న కుక్క తలెత్తిచూసి, చెంగున దుమికి, శ్రీరెడ్డివద్దకు వచ్చి పాదాలు నాకు తున్నది. ఆ ఆవరణ అంతా మనుషులతో విషాదంగా ఉంది. ఎవరినీ చూడకుండానే తలవంచుకొని లోనికి నడిచాడు శ్రీరెడ్డి. మిగిలిన వారంతా బయటే నిలబడ్డారు. రాంరెడ్డి, గోపి కూడా లోనికి వెళ్ళారు.

లోపల పడకగదిలో చెంచురెడ్డి భార్య అన్నపూర్ణమ్మ మంచమీద ఒకవైపుకుఒరిగి పడుకునిఉన్నది. వ్రేలితోభూమిమీద గీతలు గీస్తున్నది. తలుపు దగ్గర చప్పుడయ్యే టప్పటికి తల త్రిప్పిచూచి లేచింది. అంత వరకూ అణచుకున్న ఆమెశోకం కొడుకుని చూస్తూనే బయల్పడింది. వెక్కి వెక్కి ఏడుస్తూ మంచం మీద పడిపోయింది. శ్రీరెడ్డి తల్లి దగ్గరగా కూర్చున్నాడు. అతని కంఠం వెక్కిళ్ళతో నిండిపోయింది. తల్లిని ఓదార్చడ మటుంచి, తన్నుతాను ఓదార్చుకోలేని స్థితి. ఆ స్థితిలో కన్న తల్లిని ఇంతవరకూ చూడలేదు. గ్రామంలో భీషణమైన పోరాటాలూ, హత్యలూ జరిగి నప్పుడు గూడా, ఆమె చెక్కు చెదరలేదు. నవ్వుతూనే తన మనుషులతో సంభాషిం చేది; వారికి కావలసిన తిండి ఏర్పాట్లు చేసేది. ఎవరు ఏ పని చేయాలో చెప్పి చేయించేది.

కాని, నాటి అన్నపూర్ణమ్మకూ నేటి అన్నపూర్ణమ్మకూ తేడా ఉంది. ఈరోజు భర్త హత్యతో కుమిలిపోతు న్నది. తనవారనుకున్న వారిచేతనే తన



భర్త హత్య చేయబడడం ఆమెకు మరింత దుఃఖకారణ మయింది.

శ్రీరెడ్డి ఏడుస్తూ ఆమె కాళ్ళమీద పడ్డాడు. వారిని సముదాయించడానికి ఎవరూ రాలేదు. అక్కడ ఉన్న తమ్ముండ్లు కూడా ఆ స్థితిలోనే ఉన్నారు.

గంటకు పైగా గడిచి పోయింది.

శ్రీరెడ్డి తేరుకున్నాడు. అక్కడి నుండి బయటకు వచ్చాడు. తల్లితో ఇప్పుడు ఏం మాట్లాడినా ఆమె బాధను మరింత కెలికినట్లే అవుతుందని బయటకు వచ్చాడు.

"బాబాయ్" పిలిచాడు.

మల్లారెడ్డి మంచం దిగి వచ్చాడు.

''ఇప్పుడు ఏం చేద్దామంటావు?'' అన్నాడు శ్రీరెడ్డి. తను తొందరపడడం మంచిదికాదు. తండ్రి తర్వాత ఆ యింటి పెద్ద ఉన్నాడు.

"చేసేదేమీలేదు. వాళ్లు ఎవరూ ఇప్పట్లో దొరకరు. ఇండ్లమీదపడి ఆడవాళ్ళనూ, పిల్లలనూ కొట్టడం, చంపడం

బుద్ధిహీనత. కొంపలకూ, గడ్డివాములకూ అగ్గి పెట్టడం పిచ్చి వాళ్ళ పని. శత్రువును ముఖాముఖిగానే ఎదుర్కొని పోరాడాలి. ప్రతీకారం తీర్చాలి."

"అది సాధ్యమా? శత్రువు మన ముందుకు ఎన్నడూ రాడు."

బాధగా నవ్వాడు మల్లారెడ్డి. "శత్రువు మన ఎదురుగా రావాలనేదేమీ లేదురా! శత్రువు ఇంట్లో ఉన్నప్పుడు మనమే ఎదురు పోదాం! తేలాల్సిందేదో అప్పుడే తేలిపోతుంది."

అందరూ అతని వైపు చూస్తున్నారు.

మల్లారెడ్డి జ్ఞానికాడు. కాని, ఆ గ్రామ స్థాయిలో చెప్పుకోదగ్గ పెద్దమనిషి. చెంచురెడ్డికంటే కూడా పెద్దతరహాలోనే, ఆయనకు-ఆ గ్రామంలో గౌరవముంది. మంచివాడు, నెమ్మదస్తుడని పేరు తెచ్చుకున్నాడు.

శ్రీరెడ్డి మరేమీ మాట్లాడలేదు. అనవసరంగా మాట్లాడడం అతని పద్ధతికాదు.



3

ఆ సాయంత్రానికి రెండు జీపులు, ఒక కారు వచ్చి శ్రీరెడ్డి ఇంటి ముందు ఆగాయి. బయట వసారాలో కూర్చున్న వారందరూ అటు చూశారు. జీపునుండి సమితి అధ్యక్షుడు నారాయణ, స్థానిక శాసన సభ్యుడు సిద్ధారెడ్డి దిగి వస్తున్నారు. అక్కడున్న వారందరూ లేచి నిలబడ్డారు.

సిద్ధారెడ్డి శ్రీరెడ్డి భుజంమీద చెయ్యివేసి లోనికి తీసుకెళ్ళాడు. నారాయణ, అతని బృందం, మల్లారెడ్డి శ్రీరెడ్డి సోదరులు అందరూ లోనికి వెళ్ళారు.

"వీళ్ళెందుకొచ్చారోయ్?" అన్నాడు బయట ఉన్న శ్రీరెడ్డి మనిషి ఒకడు.

"ఇంకెందుకూ! సంధికై ఉంటుంది. మొదటి నుంచి పెద్దాయన సంధి కలపడానికి ప్రయత్నించింది!" అన్నాడు మరొకడు.

"ఇంత జరిగాక శ్రీరెడ్డి సంధికి ఒప్పుకుంటాడా?"

"ఒరేయ్! అవన్నీ మనం మాట్లాడకూడదు. తేల్చాల్సిందేదో పెద్దలే తేల్చేస్తారు. మీరంతా నోర్మూసుకొని కూర్చోండి" అన్నాడు నాగడు.

లోపల అందరూ మంచాల మీద కూర్చున్నారు. త్రాగడానికి కాఫీ పంపమని గోపితో చెప్పి పంపాడు శ్రీరెడ్డి.

"శ్రీరెడ్డీ! జరిగిపోయిన ఘోరం విన్న తర్వాత మేమెంత బాధపడ్డామో మీకు తెలియదు. గురివిరెడ్డికి, మీకూ సంధి ప్రయత్నం చేయడానికి రెండు నెలల నుండీ మేము ప్రయత్నం చేస్తున్నాము. గురివిరెడ్డి కూడా ఇందుకు మనఃపూర్వకంగా అంగీకరించాడు..."

"దేనికి? దొంగదెబ్బతీసి మమ్మల్ని చంపేదానికా?" నారాయణ మాటలకు మధ్యలో అడ్డు తగిలి అన్నాడు రాంరెడ్డి ఉక్రోషంగా!

శ్రీరెడ్డి అతన్ని వారించాడు, "పెద్దలు చెప్తున్నారు; వినండి. విన్న తర్వాత మాట్లాడుదాం" అన్నాడు. నారాయణ తలెత్తి అతనివైపు చూశాడు. "ఎవరా అబ్బాయి?" అన్నాడు.

"నా పెద్ద తమ్ముడు!" నారాయణ తలూపాడు.

"అసలు జరిగిన కథ మీ కర్థంకావడం లేదు శ్రీరెడ్డి! గురివిరెడ్డి ఎవరో మీకు తెలుసు. గురివిరెడ్డికీ, చెంచురెడ్డికీ ఉన్న సంబంధం కూడా అందరికీ తెలుసు. అయినా గురివిరెడ్డి చెంచురెడ్డిని చంపా డంటే మీరంతా ఎట్లా నమ్ముతున్నారో మా కర్థం కావడంలేదు. మీకూ మీకూ పగలున్నాయి. అది జన్మజన్మల వైరమే! అయినా ఇంత దారుణంగా చెంచురెడ్డిని చంపడానికి గురివిరెడ్డి సిద్ధం కావలసిన పనిలేదు. చెంచురెడ్డిని చంపాలనేదే గురివి రెడ్డి ఉద్దేశమయితే, అంతకు ముందు ఎన్నిసార్లు అవకాశం కలుగలేదు! మరి చంపడం సంగతటుంచి, కనీసం బెదిరించ నయినాలేదే! చెంచురెడ్డిని చంపవలసిన అవసరం గురివిరెడ్డికి ఉన్నా అతను అందుకు సిద్ధంగా లేడు! పైగా సంధికి తనే ముందు ప్రయత్నించాడు కాని, వారిద్దరూ చెలిమి చేసుకుంటే, గ్రామం లోని కొందరి నోట్లో మట్టి పడుతుంది. పనీ పాటా లేకుండా తేరగా తిని, కర్ర పట్టుకొని తిరిగే వారికీ, వీరిద్దరి తగాదా వల్ల సొమ్ము చేసుకొనే అవకాశం ఉన్న వారికీ నోట మట్టి పడుతుంది. తమ నోట్లో మట్టి పడకుండా ఉండాలంటే ఇద్దరిమధ్యా నిరంతరం అగ్ని రగలాలి. సంధి కాకుండా రంధి నడవాలి. సరిగ్గా ఇదే జరిగింది. సంధి కుదిరే అవకాశముందని తెలిసిన తరువాత, గురివిరెడ్డి వర్గంలోని కొందరు పంధి నడుపడానికే సిద్ధపడ్డారు. మాటల వల్ల గురివిరెడ్డిలో అగ్ని రగిల్చడం సాధ్యం కాదని నిశ్చయించుకొని, చేతలతో చేయాలను కున్నారు. తత్ఫలితమే చెంచు రెడ్డి హత్య! ఇది చేయించినది గురివిరెడ్డి అని మీ ఉద్దేశం! కాని, ఈ హత్యతో తన కెలాంటి సంబంధం లేదంటున్నాడు గురివి రెడ్డి. చెంచురెడ్డిని చంపాలనే ఆలోచన గత పాతిక సంవత్సరాలలో తనకు ఎన్నడూ కలుగ లేదని చెబుతున్నాడు. 'అతనికి నా చెల్లెల్నిచ్చాము. నా చెల్లెలిని ముండ మోయించాలన్న తలంపు నా కెన్నడూ కలుగలేదు' అంటున్నాడు. సహజంగా మేము నమ్మాము. అంతేకాదు. మిమ్మల్ని కూడా నమ్మమనిచెబుతున్నాము. ఈ గ్రామంలో శత్రుత్వం లేకుండా చేయా లనే తలంపుతోనే ముప్పైఏండ్ల క్రితం మీ తాతగారు వారితో వియ్యమందారు. జన్మ వైరులుగా నిలిచిన రెండు కుటుంబాలమధ్య సఖ్యత కొరకే మీ అమ్మగారు ఆ యింటి నుండి ఈ ఇంటికి వచ్చారు. కాని ఆ వైరం సమసిపోలేదు. ఆ తర్వాతకూడా హత్యలు జరుగుతూనే ఉన్నాయి. తిరిగి రెండు కుటుంబాల మధ్య వైరం యథాస్థితికి వచ్చింది. దాన్ని ఇటు మీ నాన్న - అటు మీ మామ కొనసాగించారు. విసుగుపుట్టి గురివిరెడ్డి ఏ విధంగా నయినాసరే సంధి చేసుకోదలిచాడు. కాని మధ్య మళ్ళీ విఘాతం కలిగింది." ఆగాడు నారాయణ - తన ఉపన్యాసం వారు వింటున్నారా? వింటుంటే వారి ముఖ కవళికలు ఎలాగున్నా యని బేరీజువేస్తూ!

చుట్టూ ఎందరో నిల్చున్నారు; వారందరి మధ్యా మంచాలమీద వీరు కూర్చున్నారు. అందరూ ఆశ్చర్యంగా నోర్లు తెరచి వింటు న్నారు. శ్రీరెడ్డి తల వంచుకొని వింటు న్నాడు. అతని ముఖంలోని భావాలేమిటో తెలియడం లేదు.

నారాయణ తిరిగి సాగించాడు "ఇప్పుడు మేము వచ్చింది సంధి ప్రసక్తికే! హత్య జరిగిన సమయంలో మీ మామ మా వద్దనే ఉన్నాడు. హత్యా వార్త మాకు తెలిసేటప్పటికి అతను నిలువెల్లా వణికి

పోయాడు. మా చేతులు పట్టుకొని ఇందులో తన ప్రమేయం ఏమీ లేదని బాధ పడుతూ చెప్పాడు. మేము నమ్మాము. అంతేకాదు మీ నాన్నను ఆ రోజు హత్య చేయించ దలిస్తే మీ ఊరి నల్లవాగువద్దనే చంపాల్సిన పని లేదు. కోర్టుకు వచ్చి రోడ్డున నడు స్తున్నప్పుడే చంపించవచ్చు. మీ గ్రామం దగ్గరలో అయితే మీ మనుషులు కన్పించ వచ్చు. పట్టణంలో అయితే ఆ బాధ లేదు. మరి ఎందుకు ఆ పని చేయలేక పోయాడు? అతనికా ఉద్దేశం లేదు గనుకనే. సరే-జరిగిందేదో జరిగి పోయింది. జరిగిన విష యం చిన్నదేమీ కాదు: మాటలతో ఆలోటు పూడ్చడం సాధ్యమూ కాదు. ఇంత ఘోరం జరిగిన తరువాత గురివిరెడ్డితో మీరు సంధికి ఇష్టపడతారా అనేది సందేహమే! అయినా మా ప్రయత్నం మేము కొనసా గించ దలచాము. ఈ సంధి కుదురుతుందని మాకు ఆశ ఉంది. ఎందుకంటే రెండు నెలల క్రిందట ఈ సంధికి ఏ వ్యక్తి తెర మరుగున ఉండి పని చేసిందో ఆ వ్యక్తి ఈ సంధికి తప్పకుండా ఒప్పుకుంటుందని మా ఉద్దేశం! ఆ నాడు ఆమె తెర మరుగున ఉన్నా, ఈ నాడు బయటకు వచ్చి సంధికి నిలబడు తుందని మేము ఆశిస్తున్నాము. ఆమె ఎవరో కాదు; మీ కన్న తల్లి! గురివిరెడ్డి చెల్లెలు."

శ్రీరెడ్డి తలెత్తి ఆశ్చర్యంగా చూశాడు. "మీరు విచిత్రంగా మాట్లాడుతున్నారు. ఇద్దరు భయంకర వ్యక్తుల మధ్య మా అమ్మ సంధి ప్రయత్నం చేసిందా? నేను నమ్మలేను. మా అమ్మ మా నాన్నమాట ఎన్నడూ జవదాటలేదు."

నారాయణ నవ్వాడు. "నీ తల్లిని గురించి నీకింతే తెలుసు. కాని, ఆమె గురివిరెడ్డికి చెల్లెలూ, చెంచురెడ్డికి భార్యా అన్న సంగతి మరచిపోకు. అటు, ఇటు కూడా మాట్లాడగల వ్యక్తి ఆమె! రెండు కుటుంబాలూ ఆమెవే! ఒకటి తను కన్న కుటుంబం! రెండవది తనను కన్న కుటుంబం! రెండు కుటుంబాలమీదా ఆమెకు ఆశ ఉంది. వారిద్దరినీ కలిపివేయడంవల్ల, భవిష్యత్తులో తమ కుటుంబాలు, ఊరు కూడా బాగు పడతాయని ఆమె ఆశ! సాధారణ పరిస్థితిలో గురివిరెడ్డితో సంధికి మీ నాన్న ఒప్పుకోక పోవచ్చు! కాని మీ తల్లి ప్రోద్బలం, కోరికవల్ల మీ నాన్న ఇందుకు యిష్టపడ్డాడు. ఆమెను ఏ కారణం చేత ఈ ఇంటికి తరలించారు? తరలించిన తర్వాత సంధి విఫలమయినా, పాతికేండ్ల తర్వాతయినా ఆ లక్ష్యం సాధించాలని ఆమె ఆశయం! దాని ఫలితమే సంధి ప్రస్తావన! ఇప్పుడు ఆమె తన భర్త చనిపోయినా, సంధికి ఒప్పుకుంటుందనే మేము ఆశిస్తున్నాము. తన పిల్లలను తిరిగి ఈ వివాదాల ఊబిలో దించదనే మా ఆశ."

"నారాయణగారూ! మీరు చెప్పేది బాగానే ఉంది. కాని, చూస్తూ చూస్తూ మేము మళ్ళీ సంధికిష్ట పడడమా? మా కొండ కూలిపోయింది. ఆ కొండ మీదున్న మేమంతా కూలి పడ్డాము. ఇంత వినాశ నానికి కారకుడయిన శత్రువుతోసంధియా? మా అన్న చావకముందే ఇది జరిగి ఉంటే ఏ విధంగా ఉండేదోగానీ, ఇప్పుడీ సంధి అసంభవం. మా వదిన ఇందుకు ఇష్టపడు తుందంటే నేను నమ్మను. గురివిరెడ్డి మా అన్నను చంపలేదని సాక్ష్యాలతో సహా చూపిస్తున్నారు. తనకు ఇందులో ఏమీ సంబంధం లేనప్పుడు, మీతోపాటు వచ్చి మాకు చెప్పుకోవచ్చు కదా! ఈ హత్య వెనుక ఉన్న వ్యక్తులను బయటపెట్టి వారిని ఉమ్మడిగా నాశనం చేయవచ్చు





కదా ? అతడు రాలేదు ! రాలేదంటే కారణం, అతనికి ఈ హత్యతో సంబంధం ఉండి తీరాలి !" అన్నాడు మల్లారెడ్డి ఆవేశంగా.

సిద్ధారెడ్డి అందుకున్నాడు. "నీవు చెప్పింది నిజమే మల్లారెడ్డీ ! తనంతకు తానుగా అతను వచ్చి చెప్పుకోవాలి. కాని, అతడిప్పుడు మీ యింటికి వచ్చే పరిస్థితి ఉందా ? అతనీ ప్రాంతంలో- మా వెంట ఉండి ఐనా సరే కనిపిస్తే, ఈ చుట్టుఉన్న మనుషలు గొర్రెను నరికినట్లు చంపరా ? అతను చెప్పేదంతా మీరు తీరికగా వింటూ కూర్చుంటారా? నీవు బాగా తెలిసిన వాడివి ! ఆలోచించు. చిచ్చు ఆర్పడానికి ప్రయత్నించండి. ఈ ఆవేశంమీద మీరు గురివిరెడ్డిని చంపడానికి ప్రయత్నించవచ్చు; చంపనూ వచ్చు. ఆ తర్వాత అతని కొడుకులు ఊరుకుంటారా? ఆ తర్వాత జరిగేదేమిటో మీకు మాత్రం తెలియదా ?"

"అయినా ఇప్పుడు ఈ ఇంటికి నాయకుడెవరూ లేరు ; ఇంకా ఏర్పడనూలేదు. నాయకురాలు మా అమ్మ. ఆమెతోనే ఈ విషయం మాట్లాడడం మంచిది. ఎందుకంటే చనిపోయిన వ్యక్తి ఆమె భర్త. చంపించిన వ్యక్తి ఆమె అన్న. రెండు వైపులా సంబంధంగల వ్యక్తి ఆమె ! ఆమె ఏం చెబితే అది మేము చేయక తప్పదు" అన్నాడు శ్రీరెడ్డి.

అందరూ ఆమె గదిలోనికి వెళ్ళారు. ఆ సమయంలో ఆమె భగవద్గీత ముందు పెట్టుకొని కూర్చున్నది. ఆమె ముఖంలో విషాదచ్ఛాయలు ఉన్నాయేగానీ, ఉదయమున్నంత ఆందోళనగా లేదు. బయట నడుస్తున్న మాటలు విన్పిస్తున్నాయి. వింటూ గీత ముందుపెట్టుకుని కూర్చున్నదేగానీ, ఆ పుస్తకం చదివే మనశ్శాంతి ఆమె కాసమయంలో లేదు. అందరూ ఆమె ముందుకు వచ్చి నిల్చున్నారు. నిల్చున్న వారందరినీ ఒక్కొక్కరిగా తన కళ్ళతో చూస్తున్నది. ఉదయానికీ, ఇప్పటికీ ఆమెలో వచ్చిన తేడా శ్రీరెడ్డి గుర్తిస్తున్నాడు. తన తల్లినే తదేకంగా చూస్తూ నిల్చున్నాడు. ఒకడు తెచ్చి వేసిన మంచంపై అందరూ కూర్చున్నారు.

అక్కడక్కడ తెగిన ఆ మంచం నులక కొస చేతికి తీసుకుని నలుస్తున్నాడు నారాయణ - ఉపోద్ఘాతం ఏ విధంగా ఆరంభించాలో ఆలోచిస్తూ. చాలా సేపు ఆ గదిలో నిశ్శబ్దం తాండవించింది. చివరకు సిద్ధారెడ్డి కంఠం సరి చేసుకున్నాడు-

"అక్కగారూ ! మీకు జరిగిన అన్యాయానికి మేమెంతో బాధపడుతున్నాం. ఆ లోటు పూడ్చడం మా చేత కాదు. నీవు అమాయకురాలివికాదు. అంతా తెలిసిన వ్యక్తివి. అటు-ఇటు రెండు కుటుంబాలూ నీవే! మరి నీ కుటుంబాలను గాలికి విడుస్తావో; పట్టి నిలబెడతావో అంతా నీ చేతిలో ఉంది" అన్నాడు నెమ్మదిగా.

ఆమె ముఖం విషాదంతో నిండిఉంది. నిన్నటి నుండీ ఏడుస్తూనే ఉన్న ఆమె ఇంక ఏడ్చే స్థితిలో కూడాలేదు. చాలా సేపు తలవంచుకుని కూర్చుంది. ఆమె నోటివెంట వచ్చే మాట కోసం అందరూ ఎదురు చూస్తున్నారు.

కొద్ది సేపటికి ఆమె అన్నది-"గురివిరెడ్డి చంపలేదని మీరంటున్నారు. కాని, చంపింది వాడి మనుషలే. మా మనుషలు గుర్తుపట్టారు కూడా ! మరి తన మను

షలను కట్టుదిట్టంలో పెట్టుకోలేనివాడు రేపు సంధి చేసుకుంటే మాత్రం ఏం చేస్తాడు? తన మనుషులు ఏదో చేస్తుంటే చూస్తుంటాడు. దాని ఫలితం మేము అను భవించాలా ?"

"ఇదంతా గురివిరెడ్డి చేతగానితనం కాదమ్మా! కొంతమంది విద్రోహులు మీ కుటుంబాల మధ్యనున్న వైరం మాసి పోకుండా చేయడానికి చేసిన ప్రయత్నం. దాని ఫలితమే ఇది! జరిగినదాన్ని గురించి ఆలోచించక, జరిగే దాన్ని గురించి ఆలోచించండి" వినయంగా అన్నాడు నారాయణ.

"నిన్న మా వ్యక్తిత్వం నశించింది. ఈ రోజు మాకు సంధియా ?" వినీ విన పడనట్లు చాలా చిన్నగా అంది.

"ఇది అసాధ్యం! నా మరిది ఉన్నాడు. నలుగురు కన్నకొడుకులున్నారు. వంద లాది మంది అనుచరులు ఉన్నారు. వారం దరి కడుపులు మండిపోతున్నాయి. ఈ సమయంలో సంధి; దానికి నేను కారకు రాల్ని కావాలా? భర్తను చంపుకొని సంధి చేసుకున్నదని లోకం నన్ను దూషిం చదా ? నా కొడుకులు నన్ను నీచమైన దాన్నిగా భావించరా ? మా అన్నను హత్య చేయించి, తన అన్నతో సంధి చేసుకుందని నా మరిది దుమ్మెత్తి పోయడా ? నా మనుషులందరూ నేను పుట్టింటి వైపు మొగ్గుచూపానని ఛీత్కా రించరా ? వీటి సంగతటుంచి, పాతిక సంవత్సరాలు నాతో కాపురం చేసిన వ్యక్తి; ఈ లోకంలో నాకు అత్యంత ప్రీతిపాత్రుడయిన వ్యక్తి; నాకి హోదా, అధికారం కల్పించిన వ్యక్తిని రక్తంలో శవాకారంలో చూసిన నేను ఈ సంధి చేసుకుంటే ఆయన ఆత్మకు ద్రోహం చేయడం కాదా ?"

ఆమె కన్నులనుండి జలజల నీళ్ళు కారుతున్నాయి.

"గురివిరెడ్డి నా అన్న ! నా రక్తం పంచుకు పుట్టిన వాడే! కాని, వాడే నేడు నా వైధవ్యానికి కారకుడుగా కన్పిస్తు న్నాడు. వాని వలననే నా భర్త చంప బడ్డాడని లోకం కోడై కూస్తున్నది. వాడి వల్లనే ఈ మారణహోమం ఇంత వరకూ ఆరకుండా వెలుగుతున్నది. వాడు సంధి అన్నంత మాత్రాననే నా భర్త అందుకు సిద్ధపడ్డాడు. ఆ సంధి సఫలం కావాలని నేను మొక్కని దేవుడు లేడు. కాని, నా ఖర్మ! సంధి విఫలం కావడం అటుంచి ఆ రంధిలోనే నా పసుపు కుంకుమ పోయింది. దీనికి కారకుడు గురివిరెడ్డి కాదని మీరంటున్నారు. మీరనడమే కాదు; నేను నమ్ముతున్నానుకూడా! కాని, తన మనుషలను అదుపులో పెట్టుకోలేక నా పసుపు కుంకుమ పోవడానికి కారకు డయ్యాడు. అందుకు పరోక్షంగానయినా వాడిదే బాధ్యత !"

సిద్ధారెడ్డి ఏం మాట్లాడాలో తెలియక భుజాలు తడుముకున్నాడు. నారాయణ నేల చూపులు చూస్తూ వింటున్నాడు:

"ఈ ఇంటికి నేను వచ్చి పాతికేండ్లు అయింది. మా నాన్న ఆ రోజు ఏ ఉద్దే శంతో ఈ ఇంటికిపంపాడో నాకు తెలుసు. రెండు కుటుంబాలు స్నేహంగాఉంటాయను కున్నారు. అందుకే శత్రువయినా వియ్యు మందారు. తిరిగి కొద్దిరోజులకే పాత ఆవే శాలు పెనవైచుకున్నాయి. అయినా బహి రంగంగా మా వారికీ, రహస్యంగా మా అన్నకూచెబుతూనే ఉన్నాను; కలిసిపోయి భవిష్యత్తులో పిల్లలు బాగుపడేలా

 

చూడమని! ఇద్దరూ నా మాట వినలేదు. వినలేదు గనుకనే ఇంతవరకూ కలిసిపోవడం జరుగలేదు. తీరా జరిగే సమయానికి నిప్పు అంటించారు. దీపం ముట్టిస్తే ఆర్పవచ్చుగానీ, అడవినిముట్టించి ఆర్పడం సాధ్యమా? నాకు నలుగురు మగ బిడ్డలున్నారు.మా అన్నకూ ముగ్గురు మగపిల్లలు, ఇద్దరు ఆడబిడ్డలు ఉన్నారు. వీరందరి సుఖం నేను ఆశిస్తున్నాను. నా భర్తను చంపిందెవరో, చంపించినదెవరో నాకు తెలుసు. వాళ్ళ నాశనం నేను తప్పకుండా చూస్తాను. అయితే అందుకొరకు మా రెండు కుటుంబాలు నాశనం కావడం నా కిష్టంలేదు. వీరిని కలపడమే నా బాధ్యత. నా భర్తను నా అన్న హత్య చేయించలేదని నేను ఒప్పుకుంటున్నాను. ఇప్పటికయినా సంధి కుదిరితే నాకు సంతోషమే! అటూ - ఇటూ భవిష్యత్తులో పోట్లాడుకోనట్టి సంధి చేసుకోదలిస్తే నాకు ఇష్టమే! నా కొడుకులనూ, మరిదినీ ఒప్పిస్తాను. అయితే అందుకు బలమైన హామీ మా అన్ననుండి కావాలి. అది కూడా అందరి ముందూ బహిరంగంగానే కావాలి"

దాదాపు ఎగిరి గంతేసినంత పనయింది నారాయణకూ, సిద్ధారెడ్డికీ. ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతున్నారు. తల్లి మాట్లాడుతున్న మాటలను అర్థం చేసుకోలేక శ్రీరెడ్డి నోరు తెరచి ఆమెనే చూస్తున్నాడు. గోపిరెడ్డి పండ్లు పటపట కొరికి విసురుగా బయటకు వెళ్ళాడు. మల్లారెడ్డి మాట్లాడకుండా తలవంచుకున్నాడు.

"మీరు కోరిన విధంగా చేయడానికి సిద్ధంగా ఉన్నాము అక్కగారూ! గురివిరెడ్డిని మీ ముందుకు తెస్తాము. మధ్యరాయబారాలతో అనవసరం. మీరే ముఖాముఖి తేల్చుకొనండి. ఒక్క విషయం; గురివిరెడ్డి ఇక్కడికి రావడమంటే, కార్చిచ్చులోనికి పిచ్చుక వచ్చినట్లే. మరి మీరు అందుకు తగిన హామీ ఇవ్వాలి" అన్నాడు సిద్ధారెడ్డి.

విషాదంగా ఆమె తల ఊపింది. "నా భర్తను పాతిక సంవత్సరాలుగా ప్రేమిస్తున్నాను; నిజమే! కాని, నా అన్నను యాభై ఏండ్లుగా ప్రేమిస్తున్నాను. ఒకరిని నాశనం చేసుకున్న నేను, మరొకరిని నా కళ్ళ ఎదురుగానే నాశనం చేసుకుంటానా?" తల అడ్డంగా ఊపింది. గురివిరెడ్డికి ఈనాడే కాదు; ఏనాడయినా నాకు తెలిసినంత వరకూ హాని జరగనివ్వను" దృఢంగా అంది.

"అతన్ని తొందర్లోనే పిలుంటే రేపే ఇక్కడకు తీసుకువస్తాం" అన్నాడు నారాయణ. లేచి బయటకు సాగారిద్దరూ. మల్లారెడ్డి మర్యాద పూర్వకంగా లేచి వారి వెంట బయటకు నడిచాడు.

"అమ్మా! నేను వింటున్నది కలో నిజమో తెలియడం లేదు. నిన్నటి రక్తం ఇంకా ఆరలేదమ్మా" అన్నాడు శ్రీరెడ్డి ఆవేశంగా. అతని కళ్ళ నుండి నీరు ఉబుకుతున్నది. ఆమె కన్నుల నుండి కూడా నీరు కారుతున్నది. అతని చెయ్యి తన చేతిలోనికి తీసుకొని నిమురుతూ కొంతసేపు మాట్లాడలేకపోయింది.

చీకటి పడుతున్నది. వారిద్దరూ అలాగే చీకట్లోనే ఉండిపోయారు. హఠాత్తుగా లైటు వెలగడంతో తల పైకెత్తి చూసింది. లైటు వెలిగించి రాంరెడ్డి అక్కడే నిలబడి ఉన్నాడు. దగ్గరికి రమ్మని ఆమె పిలిచింది. ఆమె దగ్గరగా వచ్చాడు రాంరెడ్డి. "శ్రీ! చూడు! వీడు

నీ తమ్ముడు. ఏదికేమయినా అయితే నీ మనస్సు ఎట్లా ఉంటుంది?" అంది.

"అదేంటమ్మా! రాంరెడ్డి మీద ఈగ వాలితే బ్రతుకనిస్తామా? వాడి రక్తం తాగుతాను" అన్నాడు ఆవేశంగా.

అంత విషాదంలోనూ ఆమె చిన్నగా నవ్వింది. "నీ తమ్ముడి మీద నీకు ఇంత ప్రేమ ఉండటానికి కారణం—ఒకరకం పంచుకొని పుట్టి, ఒకచోట పెరగడం వల్లనే కదా?"

"ఔను" అన్నాడు ఏమనాలో తెలియక.

"మరి నేనూ, మా అన్న ఒకే రక్తం పంచుకొని పుట్టి, ఒకచోట పెరిగామే! మరి మా అనుబంధాలు అర్థం కావా?"

ఆమె ఏడుస్తున్నది. ఎలా ఓదార్చాలో ఏమని చెప్పాలో తోచక స్తబ్దుగా కూర్చుండిపోయాడు శ్రీరెడ్డి. రాంరెడ్డిని ఎవరైనా ఏమైనా అంటే వారిమీదకు తాను దుమకగలడు; ఏమైనా చేయగలడు. మరి గురివిరెడ్డిని చంపితే తన తల్లి పరిస్థితి... తర్వాత ఆలోచించలేకపోయాడు. ఆమె ఏ విధంగా ఏవైపు నుంచి ఆలోచిస్తున్నదో అతని కర్థమయింది. చనిపోయిన భర్తను గురించి ఇప్పుడామె ఆలోచించటం లేదు. బ్రతికి ఉన్న అన్నను తాము చంపకుండా సంధి ఒడంబడికకు సిద్ధమవుతున్నది. ఔను. ఆడదాని మనస్సు రెండు వైపులా పదునే! ఒకవైపు పదును తగ్గిందని, రెండో వైపు కూడా పదును పోగొట్టదు. ఉన్నవైపునయినా పదును నిల్పుకోవాలనే తాపత్రయం.

ఆమె కళ్ళలోనికే చూస్తున్నాడు శ్రీరెడ్డి. ఇరవై సంవత్సరాలుగా చూస్తున్న ఆ కళ్ళను నేడూ చూస్తున్నాడు. కాని, నేడు ఆ కళ్ళలో ఎంతో తేడా ఉంది అనుకున్నాడు.




సంధి వార్త విన్న కరణం కలవరపడ్డాడు. అతనికి ఆశ్చర్యమనిపించినదేమిటంటే హత్య జరిగి ఇంకా 40 గంటలు కాకున్నా హతుడి భార్యే ఈ సంధికి అంగీకరించడం. చెంచురెడ్డి ముఠాలో ప్రధానమైన వ్యక్తి కరణం! మునసబుకూ తనకూ ఉన్న వైరాన్ని పురస్కరించుకొని, మునసబుకు వ్యతిరేకంగా ఈ పక్షంలో చేరాడు. పార్టీకి నాయకులు వారిద్దరయితే, ఉపనాయకులు వీరిద్దరూ! తన ముఠానంతా సమావేశపరిచి ఆలోచించాడు. అటు తర్వాత వారందరినీ తీసుకొని చెంచురెడ్డి భార్య వద్దకు వచ్చాడు. ఆ సమయానికి శ్రీరెడ్డి, మిగిలిన వారూ ఇంటివద్దే ఉన్నారు. కరణాన్ని చూసి ఆహ్వానించారు.

"అమ్మతో మాట్లాడాలి" అన్నాడు కరణం. శ్రీరెడ్డితో కలిసి ఆమె వద్దకు వెళ్ళాడు. ఆ సమయానికి ఆమె భగవద్గీత ముందు పెట్టుకొని కూర్చుని ఉంది. వీరిని చూస్తూనే పుస్తకం మూసి పక్కన పెట్టింది. వెంకడు తెచ్చిన మంచం మీద కరణం, శ్రీరెడ్డి కూర్చున్నారు.

"అమ్మా! ఒక వింత వార్త విన్నాను. అది నిజమో, అబద్ధమో తేల్చుకోలేకుండా

ఉన్నాను" సందిగ్ధంగా అడిగాడు. ఆమె కరణం వైపు చూసింది.

"చెప్పండి కరణంగారూ! మా దగ్గర దాపరికం ఎందుకు?" అంది వినడానికి సిద్ధపడుతూ.

"గురివిరెడ్డితో సంధి చేసుకోబోతున్నారని..."

"నిజమే!" తల ఊపింది.

కరణం ఆశ్చర్యంగా ఆమె వైపు చూశాడు.

"అమ్మా! నీకు చెప్పగల సమర్థుని కాకపోవచ్చు. కానీ, మా మాట కూడా మీరు ఆలోచించాల్సి ఉంది. ఈ ఊరిలో చెంచురెడ్డి వర్గంలో ప్రధానమయిన వ్యక్తిని నేనన్న సంగతి మీకు తెలుసు. మీ కుటుంబం కొరకు మా ఆస్తులు, జీవితాలు,సర్వస్వం ఒడ్డాము. నేనే కాదు; నాలాంటివారు ఊళ్ళో ఎందరో ఉన్నారు. ఈ సమయంలో ఎవరికీ తెలియకుండా, మీరీవిధంగా చేస్తున్నారంటే మాకు చాలా బాధగా ఉన్నది. మాకు దేవుడు లాంటి రెడ్డి చనిపోయి ఇంకా 40 గంటలయినా కాలేదు. ఆ భయానక వాతావరణం ఇంకా చల్లబడలేదు. రక్తంలో మునిగిన ఆయన శరీరం చూచి, ఇంకా అన్నం తినని వారెందరో ఉన్నారు. ఈ సమయంలో మీరీ విధంగా నిర్ణయానికి వస్తే మా గతేం కావాలి? మీ కుటుంబం కొరకు సర్వస్వం అర్పించి నిలిచిన మేము అధోగతి పాలు కావలసిందేనా? చెంచురెడ్డి ఆశయం తీర్చడం సాధ్యం కాదా?

"ఆగండి కరణంగారూ!" అంటూ చేయెత్తింది ఆమె.

"మీరు మా కుటుంబానికి ముఖ్యులే! మావైపు నిలబడినవారే! నేను కాదనను. కాని, ఈ అగ్నిని ఇంకా రగల్చడం మంచిది కాదని, ఆయన ఉన్నప్పుడే ఆలోచించారు. అందుకే సంధి ప్రయత్నం చేశారు. కాని, విధి వక్రించింది. అయినా ఈనాడు నేను సంధికి ఇష్టపడుతున్నానంటే, మిమ్మల్నందరినీ నడిబజారులో విడవాలనీ కాదు, మీ ప్రాణాలు తీయించాలనీ కాదు. ఆలోచించండి. మీరు పెద్దలు. విజ్ఞులు. ఈ గ్రామం పచ్చతోరణాలతో కళకళ లాడడానికి బదులు వేడి మంటలలో మగ్గుతున్నది. సుఖ సంతోషాలతో బ్రతకవలసిన ప్రజలు, నిత్యభయంతో, నిత్య దుఃఖంతో, బాధలతో, అవమానాలతో బ్రతుకుతున్నారు. కరణంగారూ! ఇప్పటికే ఎందరో బలిఅయ్యారు. ఎందరో కాళ్ళు చేతులు విరగగొట్టించుకొని కుంటివారయ్యారు. ఇంత దారుణం ఈ రెండు కుటుంబాలవల్లనే అని అందరికీ తెలుసు. అందువల్లనే ఈ రెండు కుటుంబాలు కక్షలు మానుకో గలిగితే, మిగిలిన వారందరూ బాగుపడగలరు. అందుకొరకే నా ప్రయత్నం. ఇప్పుడు జరిగిపోయిన సంఘటన మీకంటే ఎక్కువ నాకే బాధాకరమని మీకు తెలుసు."

కరణం విషాదంగా నవ్వాడు.

"అమ్మా! ఈ సంధివల్ల వచ్చే లాభమేమిటో నా కర్థం కావడంలేదు. మీ రెండు కుటుంబాలు కలుసుకున్నంత మాత్రాన, మిగిలిన కుటుంబాలు కలుసుకోగలవా? దెబ్బలు తిన్నవారూ, కాళ్లు చేతులు విరుగగొట్టించుకున్నవారూ, వారి బంధువులూ; హత్య చేయబడిన వారి బంధువులకూ ఆ వేశాలుండవా? వారు ఈ సంధికి సిద్ధంగా లేరే! ఇది కేవలం మీ రెండు కుటుంబాలు కలుసుకొనుటకే ఉద్దేశించబడింది. మీ పద్ధతి చూస్తే, ఇంతవరకూ మీకు సహాయంగా నిలబడిన మాబోటివారిని గాలికి

వదులు తున్నట్లుంది. ఈ సంధివల్ల మీకు లాభం గలుగవచ్చు; కాని, మాకు..."

"ఇది ఒకరి కొరకు కాదు కరణం గారూ!" ఆమె తత్తరపాటుతో అంది. "కేవలం ఇది మా స్వార్థానికి సంబంధించినదికాదు. జరిగిందేదో జరిగిపోయింది. ఇకముందయినా శాంతంగా ప్రజలందరూ బ్రతకాలనే ఉద్దేశంతో నేను ఈ ప్రయత్నం చేస్తున్నాను."

కరణం ఆమెవైపు తదేకంగా చూశాడు అతని పెదవుల మీద చిరునవ్వు మెదిలింది. "మీరు ఆ యింటి నుండి ఈ ఇంటికి మెట్టినప్పుడు, అందరూ గ్రామం బాగుపడుతుందనీ, ఇక గ్రామంలో మరా తగాదాలుండవనీ భావించారు. ఇది జరిగి పాతిక సంవత్సరాలయింది. ఈ పాతిక సంవత్సరాలలో సంధిమాట దేవుడెరుగు ముప్ఫైకి పైగా హత్యలు జరిగాయి. వారి భార్యలు ముండమోసి ఇంకా బ్రతికే ఉన్నారు. మరి రేపు మీరు చేసుకోబోతున్న సంధి మాత్రం ఇంతేకాదని నమ్మకమేమిటి?"

ఆమె కోపంగా చూచింది కరణంవైపు. వీరందరూ సంధి కిష్టపడడం లేదని ఆమె గ్రహించింది. తానొక్కతే సంధి కిష్టపడినంత మాత్రాన, సాధ్యమయినా అది తర్వాత విఫలమవుతుంది. వీరందరూ కలిసి రావాలి; వచ్చే పద్ధతిలో వీరులేరు. అయినాసరే ! ఎందరడ్డు వచ్చినా ఈ సంధి చేసుకోవలసిందే! ఇటువంటి మధ్యవర్తుల మాయోపాయాల వల్లనే, తాము నాశనమవుతున్నారు.

గోపిరెడ్డి లోనికి వచ్చాడు. అమ్మ మంచం మీదనే కూర్చున్నాడు. "ఈ సంధి నా కిష్టం లేదు" అన్నాడు తల వంచుకొని.

"ఎందుకిష్టం లేదు."

"నిన్న నా తండ్రి శరీరం రక్తంలో పడిఉంటే చూశాను. శత్రువుల ముఖాలు చూసినప్పుడల్లా నా తండ్రి శవం నాకు కన్పిస్తూనే ఉంటుంది. వారితో కలిసి నేను ఎలా మాట్లాడగలను? ఏ విధంగా వారి ముఖాలు చూడగలను ?"

"వేలెడంతలేవు ! నీవు కూడా నీతులు చెప్పవచ్చావా?" అంది కర్కశంగా.

"ఉన్నది వేలెడంత అయినా, పుట్టింది చెంచురెడ్డి కడుపునే కదమ్మా!" అన్నాడు కరణం.

ఆమె ఆవేశంగా ఊపిరి పీల్చింది. "మీరెందరు ఏకమై నన్ను, నా ఉద్దేశం నుండి మరల్చాలని ప్రయత్నించినా లాభం లేదు. నేనీ సంధికి సిద్ధంగా ఉన్నాను"

"అయితే నీవీ జన్మలో ఈ సంధి చూడలేవు" కర్కశంగా అన్నాడు గోపి. "మాది జన్మ జన్మల వైరం. నీవు అది తప్పించలేవు. ఏ పద్ధతిలో నీవు సంధి చేసుకోబోతున్నావో కూడా నాకు తెలిసింది. మా అందరినీ నీ పుట్టింటివారితో సంధికి అంగీకరించేలా చేయాలనుకోవడం వెర్రితనం. నీవు ఈ ఇంటికి వసే ఎంత సంధి కలిసిందో, నీ తర్వాత వచ్చేవారు కూడా అంతే సంధి చేయగలరు"

"మీ అందరి కొరకేరా నా సంధి ! నేను ఒక్కదాన్ని ఆనందం పొందడానికి కాదు. ఇప్పటికే ఈ గ్రామం చాలా వరకూ ఆరిపోయింది. ఇక ఉన్నంతవరకయినా వెలుగు చూడనివ్వండిరా !"

ఎవరూ నోరెత్తలేదు. వాతావరణం అతి నిశ్శబ్దంగా ఉంది. కరణం లేచాడు. "అమ్మా! మేము చెప్పవలసింది చెప్పాము.

తర్వాత మీ ఇష్టం! మీరు సంధి చేసుకుంటే మీ కుటుంబం బాగు పడవచ్చేమోగానీ, మిమ్మల్ని నమ్ముకొని రంగంలో ఉన్న మా కుటుంబాలు గాలికి లేస్తాయి. మా శత్రువు మమ్మల్ని గ్రామం నుండి నడిపిస్తాడు. వారు మా నెత్తురు తాగుతారు. అందుకే వారు సంధి పేరుతో మనల్ని విడతీస్తున్నారు. ఆ విషయం గమనించగలిగితే సంతోషిస్తాను" అంటూ లేచాడు.

ఆమె మాట్లాడలేదు. మాట్లాడవలసిందేమీ లేనట్లు తలవంచుకు కూర్చుంది. కరణంతోపాటు వచ్చిన వారందరూ తిరుగు ముఖం పట్టారు.

కరణం ఇంటి వద్ద అందరూ సమావేశమయ్యారు.

"మనమేం చేయాలి?" అన్నాడు వీరడు దిగులుగా. వీరడి బావమరదిని అటు వైపువారు చంపారు. అతని చెల్లెలు ముండమోసి ఇంటి వద్ద కూర్చున్నది. ఇరవై సంవత్సరాలు కూడా నిండని ఆ పిల్లని చూసినప్పుడల్లా శత్రువుల రక్తం తాగాలని క్రోధం పుడుతుంది. అట్టివాడికి సంధి అంటే ఏహ్యం.

కరణం అందరినీ తేరిపార చూసి, నిశ్చిత కంఠంతో అన్నాడు.

"ఒరేయ్! ఇద్దరు రెడ్ల తగవులో మనం ఒకవైపు నిలిచాము. ఇప్పుడేకాదు– ఈ గ్రామంలో ఈ ముఠా తగాదా ఏర్పడిన నాటినుండీ చెంచురెడ్డి తాతల వెనుక మన తాతలు ఉన్నారు. ఈరోజు చెంచురెడ్డి వైపు మనమున్నాము. మన నాయకుడు చంపబడి ఇంకా రెండు రోజులు కాలేదు. అప్పుడే సంధి ఆరంభమయింది. ఆమెగారికి పుట్టింటిమీద అభిమానమని మొదటి నుండీ మనకు తెలుసు. ఇప్పుడు ఆమెను అడ్డుపెట్టేవారు లేకపోవడంతో బాహాటంగా రంగంలోనికి దిగింది. ఆమె పెద్ద కొడుకు కూడా ఇందుకు మెత్తబడుతున్నాడు. ఈ సంధివల్ల మనల్ని శత్రువు తరిమి తరిమి చంపుతాడు. మన భార్యాపిల్లల్ని నల్లుల్లా నలుస్తారు. ఒరే వీరడూ! నీ చెల్లెలు ఎందుకు ముండమోసిందో నీకు తెలుసా? ఒరే నాగా! నిండా పదిహేనేండ్లు లేవు. నీ బిడ్డ మంగళ సూత్రం ఎట్లా తెగిందిరా? రాముడూ! నీఅన్న కాలు విరిగి, ఒంటికాలితో ఎందుకు నడుస్తున్నాడురా? సీతయ్యా! ముసలితనంలో ఆదుకోవలసిన నీ కొడుకు చేతులు పోగొట్టుకుంటే; అన్నం కలిపి నోటిలో ముద్దపెట్టి మీరెందుకు తినిపించవలసి వచ్చింది? మనల్ని మన శత్రువులు ఎన్నో విధాల నాశనం చేశారు. ఇన్ని జరిగిన తర్వాత సంధియా? ఈ సంధి కూడా మనకు కాదు. ఆ రెండు కుటుంబాలు కలుసుకోవడానికే! మనమంతా తరిమివేయబడడానికే! అసలా కుటుంబంలోని వారందరు కూడా సంధికి సిద్ధంగా లేరు. స్కూల్ ఫైనల్ చదువుతున్న గోపిరెడ్డి బహిరంగంగా వ్యతిరేకిస్తున్నాడు. రాంరెడ్డికి గురివిరెడ్డి కుటుంబంతో ఏనాడూ సఖ్యతలేదు. తన కుటుంబంలోనే ఇంత వ్యతిరేకత ఉంటే ఆమె ఈ విధంగా ఎందుకు ప్రయత్నిస్తున్నదో అర్థం కావడంలేదు. వారందరూ సంధి చేసుకున్నా మనం పోరాటం సాగించాలి. చెంచురెడ్డి కుటుంబం మనకు ద్రోహం చేసి వారితో కలిసినా; మనమందరం ఐకమత్యంతో గురివిరెడ్డి కుటుంబాన్ని ఎదిరించాలి. లేని పక్షంలో మనం ఈ గ్రామంలో నూకలు తినడానికి కూడా మిగలము"

అందరూ తలలూపారు కరణం మాటలకు. పెద్ద గూనోడు తలపైకెత్తి

అన్నాడు. "సామీ! -అప్పుడే ఏం జరిగిందని మనం తొందర పడడం? చెంచురెడ్డి చిన్న కొడుకు మాటల్ని చూస్తే, ఈ పొగ ఆరుతుందనే నమ్మకంలేదు. చెంచురెడ్డి భార్య, పెద్ద కొడుకు ఈ సంధికి ప్రధాన వ్యక్తులు. అంత మాత్రం చేత అయిపోయినట్లే భావించడమెందుకూ? ఒకవేళ సంధి అయినా గోపిరెడ్డి ఇష్టపడడు. మనవైపే నిలబడతాడు. గనుక పూర్తిగా ఏం జరుగుతుందో చూసి,తర్వాత మనం ఏం చేయాల్సిందీ ఆలోచిద్దాము"

ఎవరు ఏం చెప్పినా తలలూపే జనం గూనోడి మాటలకు కూడా తలలూపారు. దాంతో కరణానికి ఆశ్చర్యం, కోపం పుట్టుకొచ్చింది. ఏదో విధంగా చెంచురెడ్డి వర్గపు మనుషులకు తాను నాయకుడు కావాలని కలలు కంటున్నాడు. కాని ఆ కుటుంబానికి విశ్వాస పాత్రులయిన కొందరి వల్ల తనకు పెద్దరికం అందడం లేదు. ఇప్పుడేమో ఆ కుటుంబం సంధి కుదుర్చుకున్నా, సంధిని వ్యతిరేకించే చిన్న వాడిని నాయకునిగా చేయాలని ఆలోచిస్తున్నారు. అతనికి కసి పుడుతున్నది. శకుని కౌరవుల వైపు ఉండి, రెండు వర్గాలను నాశనం చేసినట్లు, తాను చెంచురెడ్డి వైపు ఉండి, రెండు వర్గాలనూ దెబ్బ తీయాలనుకుంటున్నాడు. కాని సాధ్యం కావడం లేదు. కరణానికీ శకునికీ ఉన్న తేడా ఏమిటంటే-శకుని వారి నాశనాన్ని మాత్రమే కోరాడు. కరణంకు వారి నాశనంతో పాటు, తర్వాత గ్రామం మీద అధికారం కూడా సంపాదించాలని ఆశ! ఆ ఉద్దేశంతోనే అవకాశం దొరికినప్పుడు చెంచురెడ్డి నాయకత్వాన్ని విమర్శించినా; వారి ఇంటి వద్ద తిని, తిరిగే విశ్వాస పాత్రులయిన వ్యక్తులు కరణం మాట చెవికెక్కించే వారు కాదు.

కరణం ఇంటివద్ద జరిగేదంతా ఎప్పటికప్పుడు ఆమె తెలుసుకుంటూనే ఉంది. శ్రీరెడ్డికి కూడా వివరాలందుతూనే ఉన్నాయి. అవకాశం కొరకు పొంచుకునున్న కరణానికి తాము అవకాశం ఇస్తున్నామా? అని కూడా ఆలోచించారు. అయినా కరణం తమనేమీ చేయలేడన్న ధీమా వారికుంది. తమ కుటుంబంలోనే చీలికవస్తే, ఆ చీలిక సద్వినియోగం చేసుకోగల వ్యక్తి అతడు. శ్రీరెడ్డిది రాతి గుండెకాదు. హత్యలవల్ల జరిగే దారుణాలు తెలుసు. ఈ సంధివల్ల పేదవారు బాగుపడతారని అతని ఉద్దేశం. ఆ ఉద్దేశంతోనే తండ్రిపోయిన ఆవేశం కూడా మరచి, సంధికి ఇష్టపడదలచుకున్నాడు. కాని, గోపిరెడ్డిది పెద్ద సమస్య అయింది. వయస్సులో చిన్నవాడయినా,పౌరుషంలో ఆరితేరినవాడు. మొండి ఘటంగా పేరు సంపాదించుకున్నాడు. అతన్ని సుముఖుణ్ని చేసుకుంటేనే సంధి ఫలవంతమవుతుంది.




దానవ జాతి అంటూ ప్రత్యేకంగా ఎప్పుడూలేదు. పురాణాలలో వలె వారికి పొడవాటి కొమ్ములూ, చేటలంత చెవులూ, ఆకాశమంత ఎత్తూ, ఏనుగంత

లావూ ఉండవు. వారూ-మనుషులే! ప్రకృతిలో అందరు మనుష్యుల్లాగే వారూ జన్మించారు. కొన్ని విపరీత బుద్ధులకు పోయిన వారినీ, సమాజాన్ని ఎదిరించి నిలువలేక పోయిన వారినీ, దానవులుగా ముద్ర వేశారు. సహజంగా ప్రతివ్యక్తి మంచిగానే ముందుకు రావడానికి ప్రయత్నిస్తాడు. కొందరిని సమాజం వెనుకకు నెట్టివేస్తుంది. కారణాలేమయితే ఏం? వారు వెనుక పడిపోవలసి వస్తుంది. ప్రతిగా వారు సమాజంమీద తిరుగబడతారు.తత్ఫలితమే దానవుడు; దానవత్వం! అసలు మనిషిని మనిషి నాశనం చేయడం దానవత్వమేకదా! ఎప్పుడూ ఒకరిని నాశనం చేయాలని ఆలోచించడమే దానవత్వం కాదా? కానీ ఒక వ్యక్తిని నిష్కారణంగా ఎవరూ చంపరు. ఒకడిని మరొకడు చంపుతున్నాడంటే, ఆ వ్యక్తిమీద పగ రేగాలి. పగ రేగేందుకు తగినంత చెడుపని ఏదోచేసి ఉండాలి. ఆ విధంగా ఎదుటి వ్యక్తిని నాశనం చేయాలనే ఆలోచన రావాలి. పర్యవసానమే దానవత్వం! సరిగ్గా ఇదే జరుగుతున్నది హత్యా పోరాటాల్లో! వాడి బంధువునో, మరొకడినో వీడు హత్యచేయడం: దానికి ప్రతిక్రియగా వాడూ అదే చేయడం.

అన్నపూర్ణమ్మకు పుట్టింటిమీద ఆశ ఉంది; అభిమానం ఉంది; ప్రేమ ఉంది. కాని ఆ ఇంటిమీద బద్ధ శత్రుత్వం వహించిన చెంచురెడ్డి ఆమె భర్త గనుక ఆచరణలో అది సాధ్యంకాలేదు. ఇప్పుడా అవకాశం వచ్చి ఆమె సంధి ప్రయత్నం చేస్తున్నది. ఆమె గతాన్ని గురించి ఆలోచించడంలేదు. చెంచురెడ్డి, గురివిరెడ్డిల ముందు తరతరాలుగా వైరముంది. ఆ వైరం పోగొట్టుకొనుటకు, ఒకరి బిడ్డను, మరొకరికి ఇచ్చి వియ్యమందినా తెగతెంపు దింతవరకూ. వారికి పుట్టిన పిల్లలే-అటు ఇటూ – రక్త సంబంధంగల ఆ పిల్లలే, పెరిగి పెద్దవారై ఒకరినొకరు పొడుచుకచస్తుంటే, ఈ ఆడవారు విలపించవలసి వచ్చింది. ఎటు చచ్చినా బాధ పడడం ఆ ఆడబిడ్డలకు తప్పడంలేదు. అన్నపూర్ణమ్మ గతీ అంతే! మరి అప్పట్లోనే స్కూల్ ఫైనల్ పాసయిన ఆమెను ఐదో తరగతి చదివి తుపాకి అందుకున్న చెంచురెడ్డికి, వైరాలు పోగొట్టుకోవాలనే సత్సంకల్పంతో ఇచ్చి వివాహం చేశారు. చదువులో ఆమెకు తగ్గ వరుడు కాకపోవచ్చు. కానీ రాజకీయ, ముఠాలరీత్యా ఆ గ్రామానికి, చుట్టు ప్రాంత గ్రామాలకు నాయకుడు. చిన్నతనం నుండి తండ్రి తర్వాత ఆ వర్గానికి నాయకుడు. అన్నపూర్ణమ్మ తల్లి ఎంత బాధపడ్డా, ఆ వివాహం జరుగకూడదని ఎంత మొత్తుకున్నా, వినకుండా చేశారు.

అన్నపూర్ణమ్మ ఆ ఇంటినుండి ఈ ఇంటికి వచ్చింది. వైరుధ్యాలు సమసిపోతాయని సంతోషించారు కొంతకాలం! అది ఎన్నో రోజులు సాగలేదు. నిప్పు కొంచెం ఉన్నా రాజుకోక తప్పదు. దాన్ని పూర్తిగా ఆర్పాలంటే ఆ రెండు కుటుంబాలు కలిసి వున్నంతమాత్రాన చాలదు. గ్రామమంతా ఈ వైషమ్యాల మధ్య ఉంది. నాయకులు తగవు విడిచినంత మాత్రాన, వారిఅనుయాయులు విడిచిపెట్టాలని నిబంధన ఏమిటి? వారిలో కూడా అనేక మంది అనేక విధాల బాధపడ్డవారూ, ఈ విరోధంతో తమ పుత్రుల, భర్తల ప్రాణాలు పోగొట్టుకున్నవారూ ఉన్నారు. వారిమధ్య సహజంగానే అగ్ని రేగింది.

ఒకరినొకరు తిరిగి తన్నుకోనారం భించారు. తమ తమ వర్గాన్ని కూడగట్టు కోవాలనీ; వారిని విడిచిపెడితే భవిష్యత్తులో తమకు సహాయంగా ఎవరూరారనీ; నాయకులు కూడా తిరిగి వత్తాసుఇచ్చారు. ఫలితం యధాస్థితి ! మళ్ళీ ఆ ఇంటి కాకి ఈఇంటిమీద వాలకుండానిషేధించబడింది. అన్నపూర్ణమ్మ చెంచురెడ్డి ఇంటినుండి కదలడం అసాధ్యముయింది. ఒకవేళ పుట్టింటికి పోవడం జరిగితే, తిరిగి మెట్టినింటికి రావడం అసంభవమని ఆమెకు తెలుసు. మరి ఆ భారతనారి చేసేదే ముంది భర్తదగ్గర పడి ఉండక ? తర్వాత కొద్దిరోజులకే చెంచురెడ్డి తండ్రిని చంపడంతో రంగం ఉద్రిక్తంగా తయారయింది. ఆ ఆవేశంమీద కూతురునిచ్చిన మామనే హత్యచేయించాడు చెంచురెడ్డి !

ఇన్ని హత్యలు జరిగితే ప్రభుత్వం ఏం చేస్తోందనే ప్రశ్న వస్తుంది. ప్రభుత్వం చేయగలదల్లా చూస్తూ కూర్చోవడమే ! వారికి తగిన సాక్ష్యాలు దొరకవు; దొరికిన సాక్ష్యాలు కోర్టులోనిలువవు. సాక్ష్యాలు చెప్పిన వారిని చంపుతారనే భయం ఉంటుంది. అసలు పోలీసులనే అయిపు లేకుండా చేస్తుంటే, సాక్ష్యాలు ఒక లెక్కలోనివా ? గ్రామంలో ఉన్న పోలీసు ఠాణా హత్యాకాండ జరిగే రోజు నిద్రపోతూ ఉంటుంది. మరి ఆ రోజు హత్య జరుగుతుందని తెలిసి వారు నిద్రపోతుంటారో;లేకతెలియక నిద్రపోతుంటారో! ఈ నాయకులను చూసి సర్కిల్ ఆఫ్ పోలీసు లాంటి వారే వణకుతూ ఉంటే, సాధారణ పోలీసులేం చేసారు ? కోడిపెట్టలు, ఇతర సామాగ్రి దొరికినంతవరకు తిని, సగం కళ్ళు మూసుకొని కాలం గడుపుతుంటారు.

ఇప్పుడు సంధి చేసుకున్నా గతంలో మాదిరిగానే అవుతుందనీ, అందువల్ల లాభంలేదనీ, గోపి, రాంరెడ్డి వాదన. గత చరిత్ర చూసినప్పుడు ఇది నిజమే అని పిస్తుంది! కాని, మానవుడిలో ఆశ చావదు. అదే అన్నపూర్ణమ్మలోనూ ఉంది. ఈ సంధి చేసుకుని, తన అన్న కుమార్తెను శ్రీరెడ్డికి వివాహం చేసుకుంటే; ఈ విరోధాలు సమసిపోతాయని ఆమె విశ్వాసం. తన భర్త ఉండగానే ఇది జరుగవలసింది. కాని, అప్పట్లో అది సాధ్యంకాలేదు. ఇప్పుడయినా పూర్తి చేయాలని ఆమె అభిమతం.

స్వతహాగా శ్రీరెడ్డి నెమ్మదస్తుడే ! అంతేగాక అతడికి గ్రామంలో పెద్ద పట్టు లేదు. తన అనుచర వర్గంలో నిలబడి, వారిని పక్కకు పోకుండా నిలుపుకునేశక్తి అతనికి ఇప్పటికి లేదు. అందువలననే ఈ విరోధానికి అతను జంకుతున్నాడు. ఏదో విధంగా సంధి చేసుకుని చేతులు దులుపుకోవాలని అతని ఆశ! వైరులు సామాన్యులు కారు. వారికి గ్రామ జనాభాలో పెద్ద బలం లేనిమాట నిజమే! కాని, పైనున్న బలం చూసినప్పుడు గ్రామస్థాయి బలం లెక్కలోనిది కాదు. గురివిరెడ్డి లాయరు. అతని అన్న కలెక్టరు. అతని తమ్ముడు డిప్యూటి పోలీసు సూపర్నెంటు. స్థానిక శాసన సభ్యుడు సిద్ధారెడ్డి అతని పెదనాన్న కుమారుడు. గురివిరెడ్డి అన్న కుమారుడు ఐ. ఎ. ఎస్. చదువుతున్నాడు. గురివిరెడ్డి తండ్రి పోయిన తరువాత, ప్రాక్టీసువిడిచి, గ్రామంలో స్థిరపడి, వైరుధ్యాలకు నడుం కట్టాడు. చెంచురెడ్డికి గ్రామ జనసంఖ్యలో అత్యధిక బలముంది. చుట్టు పక్కల గ్రామాల్లలో కూడా అతనికి అనుచర వర్గం ఉంది. కాని పైస్థాయికి వెళ్ళవలసి వచ్చినపుడు పెద్ద బలంలేదు. అవసర




మైతే నోట్లకట్టలు వెదజల్లి పనులు జరుపుకోవలసిందే! కరణంలాంటి శకుని తన ప్రక్కలోనే ఉన్నాడని తెలిసినా అలాంటి వారిని కనిపెట్టి చూస్తూనే కాలం గడిపేవాడు. కాని, చివరిదశలో ఆయన మనస్సు మార్చుకున్నాడు. అందుకు కారణం కొంత భార్యపోరు. మరికొంత డబ్బులు వెదజల్లినా ఒక్కొక్క సమయంలో పైస్థాయిలో సహకారం లేకపోవడం, అందువల్ల తన వర్గం దెబ్బతినవలసి రావడం ఎట్లాఅయితే ఏం! సంధి వరకూ వచ్చాడు. అది పూర్తవుతే, ఇక మధ్య దళార్లకు పుట్టగతులుండవు. కరణం లాంటి వాళ్ల, ఎంతో డబ్బు వాయిదాల పేరిట, ఇతరత్రా పనుల నెపంతో డబ్బు సంపాదించుకోగలిగారు. వారిద్దరూ కలిస్తే ఇక వాయిదాలూలేవు; కేసులూ ఉండవు. కాబట్టి వారిని కలవనీయకుండా చేయాలని వారి పట్టుదల. ఇటు కరణం, మునసబు-గురివిరెడ్డి అవసరం లేకుండానే చెంచురెడ్డిని నాశనం చేశారు.

ఈ సంధికి శ్రీరెడ్డి పూర్తిగా ఇష్టపడకున్నా అమ్మ ప్రోద్బలంమీద కొంతవరకూ అనుకూలించాడు. కాని, అతని సోదరులు పెడచెవిని పెట్టారు. తిరిగి నిప్పురవ్వ వీరి నుంచే పుడుతుందని కరణం ఎదురు చూస్తున్నాడు.




సమితి ప్రెసిడెంటు నారాయణ, శాసనసభ్యుడు సిద్ధారెడ్డి మరి రెండు రోజులకు వచ్చారు. వారి వెంట గురివిరెడ్డి కూడా వచ్చాడు. పాతిక సంవత్సరాల తర్వాత మొదటిసారిగా గురివిరెడ్డి ఆ యింటికి వచ్చాడు. మొదట తన చెల్లెలిని ఇచ్చిన కారణంగా కొంత కాలం రాకపోకలు జరిగినా, తర్వాత తగాదాలు యధాస్థితికి రావడంతో రాకపోకలు నిలిచిపోయాయి. మళ్లీ ఈరోజు వచ్చాడు. అన్న ముఖం చూసి అన్నపూర్ణమ్మ విలపించింది. తనను విధవను చేయడానికే ఈ యింటికి పంపారంది. తన భర్తతో వైరం మానకపోవడం తనను నాశనం చేయడానికేనంది. ఇంకా ఏమేమో అన్నది. ఆ ఆవేశంలో, దుఃఖంలో అన్నమాటలు, పట్టించుకోవద్దని గురివిరెడ్డితో సిద్ధారెడ్డి చిన్నగా చెప్పాడు. కొంత శాంతించిన తరువాత నారాయణ అందుకున్నాడు.

"అమ్మా! జరిగిపోయిందేదో జరిగిపోయింది. దానిని గురించి మనం మాట్లాడుకో బోవడంలేదు. అందువల్ల లాభమూలేదు. జరుగవలసినదాన్ని గురించి ఆలోచించడం ముఖ్యం. మీరిష్టపడితే, ఏవిధంగా ఇష్టపడతారో ఆవిధంగానే సంధికి ఒప్పిస్తాము."

ఆమె మాట్లాడలేదు. దుఃఖభారంతో మెదలకుండా కూర్చుంది. శ్రీరెడ్డి నారాయణతో అన్నాడు. "చూడండి! జరిగిందేదో మరచి పోవటానికి అది సామాన్య సంఘటన కాదు. మా జీవితాలతో చెలగాటమాడిన సంఘటన! అసలీ సంధి ప్రస్తావన మా కవసరంలేదు. మా తమ్ముళ్లు అంగీకరించడంలేదు. అయినా మా తల్లి బలవంత పెడుతున్నది. ఈ సంధి వల్ల ఏమీ లాభంలేదని, మా వర్గం

మొత్తం వ్యతిరేకిస్తున్నది. అయినా మా అమ్మ ఇష్టపడింది; గనుక, కొన్ని షరతులతో నేను ఆమోదించ దలచుకున్నాను. ఒకటి : ఈ సంధి తర్వాత, మా పర్గం వ్యక్తులమీద ఎవరిపైనయినా సరే; పాత కక్షలు సాధించేందుకు ప్రయత్నించ కూడదు. ఈ వైరం ఎందుకయితే ఏర్పడిందో; ఆ దేవాలయం భూముల యాజమాన్యం మాకేరావాలి. ఆ పద్ధతిలో అయితే నేను ఇష్టపడగలను."

"అది ముందుగానే నిర్ణయించాము. ఈ షరతులు అంగీకరించక పోవడమేమిటి? ఆ దేవాలయం భూములు సాగుచేయక బీడుగా తయారయ్యాయి! వాటిని ఎవరో ఒకరు సాగుచేసుకోవడమే మంచిది. మీకు రావాలని కోరుతున్నారు గనుక మీరే సాగుచేసుకోండి. ఈ సంధిలో మరొక సంధి కూడా కలపాలని మా ఉద్దేశం. మీ అమ్మ ఏ సంధికొరకు ఈ యింటికి వచ్చిందో, అదే విధంగా గురివిరెడ్డి కుమార్తె కూడా ఈ ఇంటికి రావాలని మా ఉద్దేశం. మీ అమ్మ రాకవల్ల పాతిక సంవత్సరాలకయినా ఈ సంధి కుదురుతున్నది. గురివిరెడ్డి కుమార్తె వల్ల ఈ సంధి విడిపోకుండా చేసుకోవచ్చు. ఆ అమ్మాయి మీ అమ్మ మేనకోడలే! ఆ అత్తా కోడళ్ళ కలయిక వల్ల, ఈ రెండు కుటుంబాలు విడిపోకుండా ఉంటాయని మా భావన" అన్నాడు సిద్ధారెడ్డి.

ఆయన ఏ పద్ధతిమీద ఈ వాదన తెస్తున్నాడో తెలిసిన శ్రీరెడ్డి దిగ్భ్రాంతుడయ్యాడు. అంతరాంతరాలలో అదే ఆలోచన ఉన్న అన్నపూర్ణమ్మ సంతోషించింది. తనుగా అడుగవలసిన అవసరం లేకుండా, అటువైపు నుండే అందుతున్నది. ఆమె దృష్టిలో ఈ విధంగా నయితే సంధి ఇక వదలడం సాధ్యం కాదు. మేనకోడలు తన యింటికి వస్తే మిగిలిన కొడుకులయినా వదినగా, మేనమామ కుమార్తెగా ఆకట్టుకోగలదని ఆమె ఆలోచన. గురివిరెడ్డి ఇందుకు సిద్ధంగా ఉన్నాడు.

గురివిరెడ్డి కుమార్తె, పైడిపల్లె హైస్కూలులోనే స్కూల్ ఫైనల్ వరకు చదువుకున్నది. గోపిరెడ్డి క్లాసే! ఇంత వరకూ వారిద్దరి మధ్యా శత్రువులమనే భావం తప్ప స్నేహంలేదు. గోపిరెడ్డి ఈమెను వదినెగా స్వీకరించగలడా? అలా ఆశించడం నిరుపయోగమే! మరి ఆమెను ఈ ఇంటికి తరమడం వల్ల సాధించేదేమిటి? ఇంట్లో తిరిగి మనస్పర్థలు; పోట్లాటలు; మొదలవవా? కాని అన్నపూర్ణమ్మ ఇవన్నీ ఆలోచించడం లేదు. ఈ పార్టీల్లో మధ్య దళారీల వల్ల ఇకముందు తమ కుటుంబం దెబ్బ తినకుండా, సంధి చేసుకుని బాగు పడాలి. నిత్యం ఆమె అదే ఆలోచిస్తున్నది. తన కొడుకులు శత్రువును ఎదిరించలేరనే భీతి; పుట్టింటిలో ఇక వైరం ఉండకూడదనే కోర్కె ఆమెను తరుముతున్నాయి.



గురివిరెడ్డి ఇంటికి వస్తూనే అందరూ చుట్టూ మూగారు. ఆత్రుతతో అడిగిన




వారికి జరిగింది చెప్పాడు. జరగాల్సిం దేమిటో కూడా చెప్పాడు. వారి సంధి విన్న తర్వాత కూతురు పార్వతి విస్తు పోయింది. ఈ స్నేహాల కొరకు తన అత్త గొంతు కోశాదు. ఇప్పుడు తన వంతు వచ్చిందా? అనుకుంది. ఆ అమ్మాయి ముఖ కవళికలు మారాయి. తటాలున అక్కడినుండి లేచి ఇంటిలోకి వెళ్ళింది.

ఆమె వెళ్ళిన వైపే చూస్తూ "మీరెందు కింత తొందర పడుతున్నారు? ఈ సంధి వల్ల ఏం ఒరుగుతుంది? ఇంతకు ముందు నీ చెల్లెలు ఆ యింటి నుండి, ఈ ఇంటికి రాలేకపోయింది. నీ కుమార్తె కూడా ఆ విధంగా కావాలని ఆశిస్తున్నావా?" అంది గురివిరెడ్డి భార్య నీలమ్మ

"గతాన్ని గురించి ఇక తవ్వుకోవద్దు. ఇక ముందయినా కలిసిపోదాం! ఈ మాట మనః పూర్వకంగాఅంటున్నాను. నా చెల్లెలి లాగ నా కూతురు ఎన్నడూ కాదు. ఈ వివాహం అవుతూనే,అరమరికలు లేకుండా అందరం కలిసిపోగలము" అన్నాడు.

"కనీసం పిల్ల ఇష్టానిష్టాలయినా తెలుసు కున్నారా?"

"మన కిష్టమయినప్పుడు, దానికిష్టం కాదేమిటే?" అన్నాడు కోపంగా "పిలిచి అడుగు" అంటూ లేచి బయటకు వెళ్ళాడు. నీలమ్మ లోపలికి వెళ్ళింది. పార్వతి రెండు మోకాళ్ళ మధ్య తల ఉంచి కూర్చుని ఏడుస్తున్నది. నీలమ్మ గుండె కరిగి పోయింది. భయంతో కంపించింది.

"పారూ!"

తలెత్తి చూసింది పార్వతి. ఎక్కిళ్ళు ఎక్కువయ్యాయి. కూతురిని చూసి నీలమ్మ కండ్ల నీరు పెట్టుకుంది. ఒడిలోనికి తీసు కుని నిమురుతూ కొద్ది క్షణాలు గడిపింది.





"అమ్మా! నన్ను ఆ యమకూపంలోనికి పంపొద్దు, నే పోనే!" అంది పార్వతి.

"అమ్మాయ్! ఈ దుర్భర పరిస్థితిని పోగొట్టుకోవాలని మీ నాన్న తాపత్రయ పడుతున్నాడు. అయినా నీకేం లోటే! మేమంతా ఉన్నాము. అటు వైపు ఉన్నది నీ మేనత్త!ఆమె స్వయంగా కోరి పిలిపించు కుంటున్నది. పిల్లలందరూ నీ మేనత్త కొడుకులే కదా! పరాయి వారెవరు?" అంది ఓదార్పుగా.

"అమ్మా! ఆ గోపిగాడు నీకు తెలుసు కదూ! వాడు నా క్లాస్‌మేటే! ఈ రోజు వరకూ వాడు నా శత్రువు. ఆ విధంగానే స్కూల్‌లో మెలిగాము. వాడు నన్ను చంపేసేటంత క్రూరంగా చూస్తాడు. వాడు నా మరది కావడమా? నాకెంత మాత్రం ఇష్టం లేదు"

నీలమ్మ నవ్వింది,"ఈ వివాహమయితే వాడే మారిపోతాడే! ఈ వైరాలూ,పగలూ ఏమీ లేకుండా పోతాయి. వాడు ఆ గోపి గాడు వదినా అంటూ పిలువక తప్పదు. అసలు నీకు ఇంతకంటే మంచి సంబంధం ఎవరూ చూడలేరే! వాడా యం.ఏ. చదువు తున్నాడు. ఆస్తా! బోలెడంత ఉంది. అత్త మేనత్త! ఆ ఇంటి మొదటి కోడలివి. కావలసినంత మంది మార్బలమూ చేతి క్రింద ఉంటుంది. వేలమీద జీతం తెచ్చుకోగల వాడికిచ్చి నిన్ను వివాహం చేయగలము. కాని, ఈ దర్పం వస్తుందా? ఎవడో ప్రభుత్వ జీతగాడి భార్యగా బ్రతకడం కంటే, కొన్ని గ్రామాలనే శాసించే శక్తిగల వారి ఇంట పెద్ద కోడ లిగా ఉండడం మేలు కదా!"

పార్వతి మాట్లాడలేదు. ఏం చెప్పినా వారి తలల కెక్కదు. తను చావడమో, ఆ ఇంటి కోడలిగా కూలిపోవడమో నిర్ణ

యించుకోవాలి. తప్పదు. చావా! అసంభవం! చచ్చిన వారిని చూసి, భయపడి అన్నం కూడా తినలేని తాను, ఆత్మహత్య చేసుకోలేదు. కాబట్టి, ఆ కూపంలో కూలిపోవడంతప్ప గత్యంతరం లేదు. తనకు ఇతరత్రా ఆలోచనలు లేవు. కాని, తన అత్త స్థితి తలచుకున్నప్పుడల్లా ఒళ్లు జలదరిస్తుంది. తనకు ఊహ వచ్చిన తరువాత, దూరంగా ఉండి ఎప్పుడయినా ఆ అత్తను చూడడమేగానీ, దగ్గరగా వెళ్ళనూ లేదూ; ఒక్క మాట కూడా మాట్లాడనూ లేదు. పైగా-శత్రువు అనే భావం ఆమెలో కలిగేది. ఆ కుటుంబంలో అందరినీ ఆ విధంగానే భావిస్తూ వచ్చింది. ఈ రోజేమో హఠాత్తుగా వియ్యం! తన మనస్సు అంత తేలికగా మార్చుకోవడం సులభమా! ఇంతవరకూ శత్రువులుగా భావించిన వారిని 'బావ, మరది, అత్త' అంటూ మాట్లాడగలదా? ఏమో! ఇప్పుడు మట్లాడలేకపోవచ్చు. ముందు ముందు మాట్లాడగలదేమో? అయినా తాను ఆలోచించి చేసేదేమీ లేదు. తన మాట ఎవరూ వినరు. ఈడ్చుకుంటూ వెళ్ళి పెండ్లి పీటలమీద తనను పారేస్తారు. ఇతరత్రా తనకు మార్గం లేదు.

ఆ మౌనం చూసి అంగీకరిస్తున్నట్లే భావించింది సీలమ్మ. తన బిడ్డ ఏ అఘాయిత్యం చేసుకోలేదనీ, చివరకు లొంగిరాక తప్పదనీ ఆమెకు తెలుసు. కాని, ఆమె బాధ ఆమెది. కాని, కసాయివారికి అప్పగించవలసి వస్తున్నది. ఈ ఇంటినుండి ఆ ఇంటికి వెళ్ళి, మళ్ళీ తిరిగి రావడం ఉండదు. అదీ ఆమె భయం.

ఎవరి భయాలు ఎట్లా ఉన్నా, వివాహ ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. గోపిరెడ్డి-తల్లితోనూ, అన్నతోనూ తీవ్రంగా వ్యతిరేకించాడు. ఒకదశలో, తాను ఇల్లువిడిచి పోతాననికూడా బెదరించాడు. రాంరెడ్డి కూడా ప్రాతికూల్యం చూపాడు. అయినా యజమానురాలు వీరెవరినీ లెక్క చేసే స్థితిలో లేదు. కరణం మళ్ళీ మళ్ళీ చెప్పి పంపాడు. ఇతర పెద్దలు కూడా ఈ వివాహం జరిపించ వద్దనీ, సంధి వద్దనీ చెప్పారు. ఆమె వినలేదు. అన్నపూర్ణమ్మ దృష్టిలో వీరంతా తమ కుటుంబాల నాశనం చేయ చూస్తున్నవారే. ఆ భావంలో నున్న వ్యక్తి వారి మాట ఎట్లా వింటుంది? వివాహం ఘనంగానే జరిగింది. ఈ సంధి వివాహానికి, వేల సంఖ్యలో చుట్టూ గ్రామాలకు చెందినవారు వచ్చారు. గురివి రెడ్డి అన్నతమ్ముండ్లందరూ హాజరయి; చేసుకున్న సంధికి అభినందించారు. ఇంతటితో పైడిపల్లె రూపు రేఖలే మారిపోతాయనీ, సుభిక్షంగా, శాంతిగా ఉంటుందని ఆశించారు. గ్రామంలో గురివిరెడ్డి వర్గానికిచెందిన కొందరు, శ్రీరెడ్డి వర్గానికి చెందిన కొందరు వివాహానికి రాలేదు. ఈ రాజీ పద్ధతి వారికి నచ్చలేదు. ముఖ్యంగా, శ్రీరెడ్డి పక్షానికి చెందిన మాదిగవాడలో మూడింట రెండువంతులూ, మాలవాడలో సగం మంది, రైతుల్లో ఒక్కరూ కూడా రా లే దు. శ్రీరెడ్డికి వీరందరి మీదా అమితమయిన కోపం వచ్చింది. అయినా చేసేదేమీ లేదు. వివాహం దేదీప్యమానంగా జరిగింది. డబ్బు నీరు పారినంత సులభంగా పారింది. గోపిరెడ్డి ఆ ఛాయలకు రాలేదు. రాంరెడ్డి, సురేంద్రరెడ్డి కలిసి పనులు చేశారు. అయినా - ఏదో అసంతృప్తి వారిలో ఉంది. అన్నపూర్ణమ్మ మేనకోడల్ని చూచి ముడిసిపోయింది. రాత్రి మేజువాణి సాగించారు. ఆ రాత్రి ఎవరికీ నిద్ర లే దు.

సొరాయి విచ్చలవిడిగా ఖర్చయింది. తాగి లేవలేక పడిపోయినవారు ఎందరో! శ్రీరెడ్డి సంతోషించలేదు. అలాగని బాధ పడనూ లేదు. ఈ విధంగా అయినా ఊరు బాగుపడితే మంచిదని అతని ఆలోచన, ఆశ! ఆ ఆశ వెనుక నిరాశ కూడా పేరుకుంటున్నది. కారణం- గోపిరెడ్డి ఈ వివాహద్భాయలకు కూడా రాకుండా తిరగడం! ఇంటిలో ఒక వ్యతిరేకి దొరికితే వాడిని పట్టి, తిరిగి నూరిపోసి, పురిగొల్పే పెద్దమనుషులు చాలామంది ఉన్నారు.

పార్వతి ఏమీ ఆలోచించడం లేదు. ఇప్పుడు ఆమె- అత్తనూ, ఆ కుటుంబాన్ని వైరిగా భావించడం లేదు. వారితో తాను కలిసిపోక తప్పదని పూర్తిగా అర్థమయింది. ఇంతవరకూ తాను గురివిరెడ్డి కుమార్తె; ఇప్పుడు శ్రీ రెడ్డి భార్య గా ముద్రపడింది. అన్నపూర్ణమ్మ కోడలిగా జనం గుర్తించారు. ఇక తాను ఆ విధంగా మెలగాలి. వ్యతిరేకంగా మసులుకోవడానికి తాను మగవాడు కాదు. అయినా అత్తను గురించి తన ఇంట్లో ఎన్నడూ నీచంగా భావించలేదు; మాట్లాడుకోనూ లేదు. ఆమె వైరి; అయినా ఆడబిడ్డగా గుర్తించక తప్పలేదు అప్పట్లో! అటువంటి వ్యక్తికి తాను కోడలిగా ఆ యింట అడుగుపెడుతున్నది. అందువల్ల నయినా ఆ కుటుంబాన్ని అసహ్యించుకోకూడదు. కలిసి పోయేందుకే ప్రయత్నం చేయాలనుకుంది.

కట్నం కింద గురివిరెడ్డి యాభై వేలు ఇచ్చాడు. కుమార్తెకు అరకిలో బంగారం కటబెట్టాడు. పదివేల రూపాయల విలువ చేసే సామాను ఇచ్చాడు. ఒక మనిషి మోయటానికి సాధ్యం కానన్ని చీరలు, రవికలు!

మూడు రోజులు వైభవంగా వివాహం జరిగిపోయింది. యాభై మంది వంటవాళ్లు తీరికలేకుండా వండినవంట, వండినట్లే అయిపోయింది. డెబ్బై బస్తాల బియ్యం అయిపోయ్యాయి. మూడు క్వింటాళ్ళ లడ్డు ఖర్చయింది.

మరుసటి రోజు ఈటె కొలువు! వందలాది ఈటెల మధ్య పెండ్లికూతురు భోణం కుండ మారెమ్మ వద్దకు తీసుకెళ్ళాలి. కొత్త పెళ్లికూతురు అనవాయితీ అది! ఆ రోజు తిరిగి ఈటెల తళతళలు కన్పించాయి. రెండువందలమంది ఈటెలు పట్టి నడుస్తుండగా; వారి ముందు తప్పెటల వాళ్ళు లయతో ఎగురుతుండగా; భోణం కుండ నెత్తిన పెట్టుకొని క్రొత్త పెళ్ళికూతురు నడుస్తుండగా; ఆమె కాళ్ళ కింద చాకలివారు బట్టలు పరుసుండగా; కోబలీ, తేబలీ, కొట్టుబలీ కేకలతో గ్రామం మార్మోగిపోతూ వెలుగు వెలిగింది. తాగి తందనాలాడే వాళ్ళు, పూనకలు వచ్చి ఊగిపోయేవారు, ధర్నాకోలలు భుజం మీద వేసుకుని, అధికారం చెలాయిస్తూ తిరిగేవారూ,... ఇవన్నీ కూడా శ్రీరెడ్డికి ఉత్సాహం కలిగించలేదు.




రాజీని పూర్తిగా వ్యతిరేకించిన వారిలో

గోపిరెడ్డి ప్రథముడు కాగా, మల్లారెడ్డి వంత పాడాడు. రాంరెడ్డి ఎటూ తేల్చుకోకుండా మధ్య నిలిచాడు. శ్రీరెడ్డి రాజీని బలపరచాడు. ఈ రాజీ వల్ల లాభనష్టాలు ముందు ముందు బేరీజు వేయబడతాయి. అయినా ప్రస్తుత వాతావరణం సుముఖంగాలేదు. గురివిరెడ్డి తగ్గి ప్రవర్తిస్తున్నా ఆయన కొడుకులు బలరాంరెడ్డి, నాగిరెడ్డి ఆ విధంగా ప్రవర్తించడం లేదు. ప్రత్యర్థుల మీద పట్టు సాధించేందుకు ఇంతకు మించి సమయం దొరకదని వారి ఊహ !

అందుకు తగ్గట్టే పరిస్థితి కలిసి వచ్చింది. గ్రామ మోతుబరులలో ఒకరయిన నారాయణరెడ్డికి ఎప్పుడో ఇరవై ఏండ్ల క్రిందట మాదిగ అంకడు - వంద రూపాయలు బాకీపడ్డాడు. నూటికి నెలకు ఒక్కరూపాయి వడ్డీ చొప్పున లెక్కించినా, అసలుకు మూడురెట్లు వడ్డీ అవుతుంది. అంకడిని-నారాయణరెడ్డి మర్యాదగా అడిగాడు. అంకడు ఇరవై సంవత్సరాల క్రిందటి బాకీ, ఇప్పుడు కట్టడమేమిటి ?కట్టనంటే కట్టనన్నాడు. నాశనం చేస్తానని బెదిరించాడు నారాయణరెడ్డి. అంకడు జంకలేదు. ఇక వాడితో మాట్లాడి లాభం లేదని నిర్ణయించుకుని ఒకరోజు ఉదయం పదిమంది సాయుధులతో మాదిగపల్లి వెళ్ళి, అంకడిని ఇంటినుండి బయటకు లాగి తంతూ, కొడుతూ గ్రామం మధ్యకు తెచ్చారు. మాలపల్లెలోనూ రెండు వర్గాలున్నాయి. నారాయణరెడ్డి గురివిరెడ్డి వర్గం కనుక, ఆ వర్గం మాదిగలందరూ నారాయణరెడ్డికి బాసటగా నిలిచారు. చెంచురెడ్డి వర్గానికి కలుగచేసుకునేందుకు ధైర్యం చాలలేదు. గతంలో అయితే అక్కడికక్కడే కలియబడేవారు. కాని, రాజీ కుదుర్చుకొని కుదుట పడటంతో, ఆ వర్గం మనుషులు ఏం చేయడానికి పాలుపోక, చూస్తూ ఉండవలసి వచ్చింది.

అంకడిని ఊరి చావడి వద్ద కొయ్యకు కట్టిపేశారు. ఎవరిష్టం వచ్చినట్లు వారు తంతున్నారు; కొడుతున్నారు. అంకడి భార్య ఏడుస్తూ శ్రీరెడ్డి వద్దకు వచ్చింది. కాని అతనేమీ కలుగచేసుకునే స్థితిలో లేడు. ఏ మాత్రం కలుగ చేసుకున్నా సంధి, రంధి అవుతుందని తెలుసు. ఆమెను ఊరడించడానికి అతనికి మాటలు చాలలేదు. ఆ సమయంలోనే ఇంటికి వచ్చాడు గోపిరెడ్డి. అతనికి గ్రామంలోని పరిస్థితి ఇంకా తెలియలేదు. అందువల్ల అంకడి భార్యను ఏమిటని అడిగాడు. ఆమె ఏడుస్తూనే జరిగిన సంగతి చెప్పింది. ఇంటిలోకి ఉరుకుతూ వెళాడు. కొద్దిసేపటిలోనే గండ్ర గొడ్డలి చేతపట్టి బయటకు వచ్చాడు. శ్రీరెడ్డి అడ్డగించాడు. "ఈ సమయంలో నీవు బయటకు పోకూడదు" అని.

గోపిరెడ్డి పండ్లు పట పట కొరికాడు. "నీ నీతులు నాకు చెప్పకు. నేను చెంచురెడ్డి కొడుకును. నా వర్గాన్ని రక్షించుకోవలసిన బాధ్యత నాకు ఉంది" అన్నాడు.

"గోపీ ! ఆవేశంలో అర్థం లేకుండా ప్రవర్తించకు. సంధి ఏర్పాటు చేసుకొని రెండు నెలలు కూడా పూర్తికాలేదు. అప్పుడే తిరిగి పోట్లాట మంచిదికాదు. వారూ - వారూ ఏదో తగవులాడుకుంటుంటే, మధ్యన మనకేమిటి పని ? ఇందులో మనం కలుగిచేసుకోనవసరం లేదు."

శ్రీరెడ్డి వాక్యాల్ని గోపి వినదలచుకోలేదు. శ్రీరెడ్డిని ప్రక్కకుతోసి బయటకు ఉరికాడు. అతడిని అనుసరించింది

 

అంకడి భార్య ఏడుస్తూ!

కరణానికి ఈ వార్త తెలిసింది. మాల, మాదిగ పల్లెలకు కూడా క్షణాల్లో వార్తలు వ్యాపించాయి. అయితే కర్రలు తీసుకొనివస్తే శ్రీరెడ్డి ఏమంటాడోనన్న భయంతో, వట్టి చేతులతోనే కచేరి దగ్గరకు వచ్చారు. గోపిరెడ్డి నేరుగా అంకడి దగ్గరికి వెళ్ళాడు. గోపిరావడం దూరం నుండి చూస్తూనే, సంధి సరాసరి స్వర్గానికే వెళ్ళిందనీ, రంధికి గోపిరెడ్డి సిద్ధంగా ఉన్నాడనీ అందరికీ అర్థమయింది. అందరికీ కుతూహలం, కొందరికి ఆరాటం, ఆవేశం, ఆవేదన కలిగాయి. గోపిరెడ్డి ఏం చేస్తాడో చూడాలని అప్పటికే అనేక మంది దూరం నుండి నిక్కి నిక్కి చూస్తున్నారు.

గోపిరెడ్డి కట్లువిప్పడానికి ప్రయత్నించాడు. దగ్గరలోనే మంచంమీద కూర్చున్న నారాయణరెడ్డి ఒక పొలికేక పెట్టాడు. "రేయ్" అంటూ ! పొలికేకలకు జడువ లేదు గోపిరెడ్డి. కట్లు విప్పడానికే ప్రయత్నిస్తున్నాడు. నారాయణరెడ్డి ఆదేశంతో ఇద్దరు బలిష్టమైన వ్యక్తులు వచ్చి, గోపిరెడ్డిని ప్రక్కకు లాగారు. గోపిరెడ్డి ఆవేశంగా బుసకొడుతున్నాడు.

"ఒరే అబ్బాయ్ ! ఇందులో నీవు కలుగచేసుకోకు! అదిమంచి పద్ధతి కాదు. వాడు నాకు డబ్బు బాకీ ఉన్నాడు. అది ఇవ్వమని మర్యాదగా అడిగాను; ఇవ్వ లేదు. అందుకు తగినపని చేసున్నాను. ఇందులో మీకేమీ సంబంధం లేదు."

గోపిరెడ్డి పొలికేక పెట్టాడు. "ఇది బాకీ వ్యవహారం కాదు. బాకీ రాబట్టే పద్ధతి ఇదికాదు. మా మీద కక్షతో వాడిని సాధిస్తున్నావు. గతంలో వాడు నీ ఇంటిమీద విసరిన రాళ్ళకు బదులుగా, నేడీ పని చేస్తున్నావు. వాడు నా మనిషి! నా మనిషికి దెబ్బతగిలితే నేను సహించను. మర్యాదగా విడువడం మంచిది. మర్యాద తప్పితే ఎవరికీ మంచిది కాదు."

"ఒరే నాయనా ! నీవుండేది వేలెడి పొడవు, మాటలు మాత్రం బారెడు పొడవు."

"నా చేతిలో గండ్రగొడ్డలి కూడా బారెడు పొడవు ఉందని గుర్తుంచుకో!" అన్నాడు రోషంగా గోపిరెడ్డి.

ఇంతలో శ్రీరెడ్డి, నాగిరెడ్డి కలిసి ఆదరా, బాదరగా అక్కడికి వచ్చారు. నారాయణ రెడ్డికి చెప్పవలసినది చెప్పి, అంకడిని విడిపించారు. అంకడు ఇంటికి వెళ్తూ మీసం తిప్పి మరీ వెళ్ళాడు.

"వాడిని చూడు; అంతగా బాదినా ఎంత మదమో ?" అన్నాడు నారాయణ రెడ్డి.

"ఈ మదానికి ప్రాణాలు పోసేవారు తయారవుతున్నారు" అన్నాడు నాగిరెడ్డి, గోపివైపు చూస్తూ. అపాటికే గోపి చాలా దూరం వెళ్ళాడు. గోపిని అనుసరించి చాలామంది వెళ్తున్నారు. అందులో కొందరికి-తమ వర్గానికి నాయకుడు ఏర్పడ్డాడని ధైర్యం ఏర్పడింది కూడా !

గోపి సరాసరి కరణం ఇంటికివెళ్లాడు. కరణం ఆహ్వానించి కూర్చోబెట్టాడు. దాదాపు వందమందిదాకా అక్కడచేరారు. కొందరు ఆడవాళ్ళు కూడా గుమికూడి చోద్యం చెప్పుకుంటున్నారు.

"పరిస్థితి మళ్ళీ మొదటికి వచ్చింది గోపీ !" అన్నాడు కరణం. కరణం వైపు ఎగా దిగా చూశాడు గోపి.

"మొదటికి రావడమేమిటి? ఉన్న చోటనే ఉంది. ఆ వర్గానికి ఈ వర్గానికి

పోరాటం తప్పదు. వైరుధ్యం మానదు. ఎవడో ఒకడు సంధి చేసుకుంటే, అది మిగిలిన అందరికీ వర్తించ పనిలేదు" అన్నాడు.

"బాగా చెప్పావ్ గోపీ! ఈ రోజు అంకడిని కొడతారు. రేపు మరొకడిని కొడతారు. మనం నోరు మూసుకుని కూర్చుంటే, మనందరినీ విడదీసి బాదేస్తారు. ఆ విధంగా విడదీయడానికే ఈ రాణీ ప్రయత్నాలన్నీ! అందులో చేప లాగ శ్రీరెడ్డి ఇరుక్కున్నాడు. కనీసం నీవైనా తిరిగి నిలబడినందుకు మాకు సంతోషంగా ఉంది" అన్నాడు అక్కడున్న ఒక ముదుసలి.

"నాయన్నాయనో! ఎంత రెడ్లయితే మాత్రం ఎంత ఆస్తి ఉంటే మాత్రం ఒక మనిషిని పల్లెనుండి, గొడ్డును లాగినట్లు లాక్కొచ్చి, కట్టేసి బాదుతారా? ఇదేం పోగాలంరో నాయనో? ఈ ఊరికి తిరిగి చేటువచ్చిందిరోయ్!" మాలగూడెం ముసలమ్మ వాపోతున్నది.

"సంధి చేసుకున్నాం గదా! ఇంకెవరు సహాయం చేస్తారు లెమ్మనే ధీమాతో అంకడిని బాదారు. ఇందుకేనా సంధి చేసుకున్నది? వాళ్లేమో - పెండ్లాం పిల్లలతో బాగుండిరి; మధ్యన మేమా తన్నులు తినేది!" మరొక ముసలమ్మ ఈసడింపుగా అంది.

నలుగురూ నాలుగు రకాలుగా మాట్లాడుకుంటున్నారు. గోపిరెడ్డి వింటున్నాడు. కాని, ఎవరినీ ఏమీ అనలేదు. అతనిలో ఆవేశం చల్లబడింది. ఇంటికి వెళ్ళిన తర్వాత అన్నకూ, తల్లికి ఇవ్వవలసిన సమాధానం ఏమిటి? అని ఆలోచిస్తున్నాడు. భవిష్యత్తు తిరిగి, గాఢాంధకారంలోనికి వెళ్తున్నదని ఆలోచిస్తున్నాడు.

కరణం ఇంకో విధంగా ఆలోచిస్తున్నాడు. తిరిగి రంధి ఆరంభమయింది. ఇక మానడం అసంభవం! పుండుకు మందువేసి కడితే మానుతుంది. పుల్లతో కెలికితే మరింత బాధాకరంగా తయారవుతుంది. ఈ పుండుకు మందు శ్రీరెడ్డి అయితే, పుల్ల-గోపిరెడ్డి. అందరూ వెళ్ళిపోయారు.

ఆవేశాలు తగ్గినవారు ఇది మామూలేననుకున్నవారూ తర్కవితర్కాలతో చర్చిస్తున్నారు. కరణం గోపిరెడ్డితో అన్నాడు. "మన వర్గాన్ని విడదీసి నాశనం చేయాలనుకున్నారు గోపీ! మీ నాన్న తర్వాత ఈ గ్రామంలో వారికి అడ్డు లేకుండా చేసుకుందామని తలచారు."

గోపిరెడ్డి మాట్లాడలేదు. వస్తానని చెప్పి, లేచి ముందుకు సాగాడు. అతని వెంట ఐదారుగురు యువకులు కదిలారు. ఇంటికి వచ్చేసరికి తల్లి చావడిలోనే కూర్చుని ఉంది. ఆమె ముఖం ధుమ ధుమ లాడుతున్నది. గోపిరెడ్డిని చూస్తూనే ఆవేశంగా అంది.

"ఒరే నాయనా? చిచ్చు ఆరిపోయిందనుకుంటే, నీవు మళ్ళీ ఊదుతున్నావా? వారి బాకీ రాబట్టుకొనేందుకు వారేదో చేస్తే మధ్యన నీకేమొచ్చిందిరా? అసలు నిన్నెవడు అక్కడికి వెళ్ళమన్నాడు?"

గోపిరెడ్డి శాంతంగానే అన్నాడు. "అమ్మా! వాడు మన మనిషి! వాడు దెబ్బతింటే మనం తిన్నట్లే!"

"అది పాతకాలం మాటరా! ఇప్పుడు మనకి పార్టీలు, ముఠా తగవులు వద్దు. జరిగిందేదో జరిగింది. ఇకముందైనా నోరు మూసుకొని పడి ఉండు."

"అది సాధ్యం కాదమ్మా! నేను




చెంచురెడ్డి కొడుకును. చెంచురెడ్డి వర్గానికి ఇప్పుడు నేను నాయకుడిని నా శత్రువెవరో, మిత్రుడెవరో నాకు తెలుసు."

ఆశ్చర్యంగా చూసింది అన్నపూర్ణమ్మ. "నిన్నగాక మొన్న పుట్టావు. అదీ నా కడుపున పుట్టావు. నాకే నీతులు బోధిస్తున్నావురా! ఈ పోట్లాటలు ఉండకూడదని కదా, మనం రాజీ చేసుకున్నది ?"

. గోపిరెడ్డి విసుగ్గా హూంకరించాడు. "రాజీ రాజీ అంటూ మొత్తుకోవడందేనికి? మీరు చేసుకున్న ఆ రాజీతో నాకెలాంటి సంబంధంలేదు. మీ రాజీ పథకాలెన్నైనా, నా తండ్రి శవాన్ని, నా ముందునుంచి మరుగుపరచలేవు. నేను నా శత్రువును చంపడానికే ప్రయత్నిస్తాను"

"నీకు పిచ్చెక్కిందిరా !"

"రాజీ పేరుతో ఒకడికి ఎక్కించి ఇంటిలో కూర్చోబెట్టి ముండగా చేశావు. ఆ పిచ్చి నాకు ఎక్కించవద్దు" అంటూ లోనికి వెళ్ళాడు. అంతవరకూ తలుపువద్ద నిలిచి వీరి సంభాషణ వింటున్న పార్వతి ప్రక్కకు తొలిగింది. గోపి కాళ్ళు ముఖం కడుక్కొని, పళ్లెంచేతపట్టుకొని అన్నం కుండవద్దకు వెళ్ళాడు. పార్వతి గబాలున వచ్చి, అతని చేతిలోని పళ్ళెంలాక్కుంది. "అదేమిటి? అన్నం నీవు పెట్టుక తిన కుంటే, అడిగితే పెట్టమా ?"

"అన్నం పెట్టమని కూడా ఈ ఇంటిలో నేను అడుక్కోవాలా ?"

పార్వతి తలెత్తి అతనివైపుచూసింది. "అడుగకుంటే అమ్మైనా పెట్టదనే సామెత స్కూల్లో ఎన్నిసార్లు చదువలేదు ? నీకు ఆకలయిందని తెలియడానికి మేమేమన్నా దేవతల మనుకున్నావా ?"

"తల్లీ ! మీరంతా దేవతలే ! నేనే దానవుణ్ణి. మీ అన్నం వద్దూ, మీరూ వద్దు. పొండి !" అంటూ లేచి వంటింటి నుండి నడవాలోనికి వచ్చి, అక్కడున్న మంచం మీద పడుకున్నాడు. పార్వతి హతాశురాలయింది. గోపిని మాటలతో శాంతింప చేయాలని ఆమె ఆరాటం ! అతన్ని శాంతింప చేసుకుంటే ప్రస్తుతానికి ఊరు శాంతి పడినట్లే ! పళ్ళెం అక్కడ పెట్టి, గోపిరెడ్డి మంచం వద్దకు వెళ్ళి నిల్చున్నది. గోపిరెడ్డి కండ్లు మూసుకుని పడుకున్నాడు. "గోపీ" చాలా చిన్నగా, నెమ్మదిగా పిలిచింది. గోపి కళ్ళు తెరచి ఆమె వైపు చూశాడు. ఆమె కను కొలుకుల్లో నీరు మెదలుతున్నది. తల పక్కకి తిప్పుకున్నాడు.

"నేను పరాయిదాన్నిగా కనిపిస్తున్నానా ?"

"కాదు. శత్రువు కూతురిగా కన్పిస్తున్నావు" కఠినంగా అనాలనుకున్నా నెమ్మదిగానే అనగలిగాడు.

"గోపి నేను నీ వదినను; నీ అన్న భార్యను. నా తండ్రి గురించి ప్రసక్తి ఇక్కడవద్దు. మనిద్దరం ఇప్పుడు ఒక గూటి పక్షులమే ! నేను నీకు విరోధిని కాను. నీ శ్రేయస్సు కోరేదానిని. నీవు దెబ్బతిన్నావని తెలిస్తే నాకు బాధ కలుగదా !"

"పార్వతీ ! నిన్ను 'వదినా' అని పిలిచే శక్తి కూడా నాకు లేనందుకు నన్ను క్షమించు. నీ ముఖంలో నీ తండ్రి కనిపిస్తున్నాడు. నీ తండ్రి ముఖంలో నా తండ్రి శవం కన్పిస్తున్నది. మీరూ మీరూ రాజీ అయినా నా కక్ష నేను తీర్చుకుంటాను. ఇది ముమ్మాటికీ సత్యం."

ఆమె వలవలా ఏడుస్తున్నది. గోపి అక్కడి నుండి లేచి బయటకు సాగాడు. శ్రీరెడ్డి ఎదురు వచ్చాడు.





''ఏరా ! నాయకుడివై పోతున్నావే ! చిన్నా, పెద్దా తేడా లేకుండా ప్రవర్తిస్తున్నావు. ఈ కాట్లాట మాకు తెలుసు. అనవసరంగా నీవు కలుగచేసుకొనడం మంచిదికాదు" అన్నాడు శ్రీరెడ్డి.

గోపిరెడ్డి అతని మాటలకు చిన్నగా నవ్వాడు. "నాయకత్వం వద్దని సంధి చేసుకున్నావు నీవు ! కావాలని నేను తీసుకుంటున్నాను. నీవు లొంగిపోయావు: నేను ఎదిరించ దలచుకున్నాను. నీతులతో నాకు పనిలేదు.''

"నేను చెబుతున్నది నీతులు కాదు. నీవు నా తమ్ముడివి. నీకేమైనా జరిగితే బాధపడేది మేముగానీ, ఆ కరణం గాడు కాదు. అనవసరంగా వాడు రెచ్చగొడితే, నీవు రెచ్చిపోతే ఎట్లా ? ఎవరో ఏదో చేసుకుంటే చేసుకోనీ ! మన జోలికి రానంత వరకూ నోరు మూసుకుని ఉండు."

"నేనేం పశువు ననుకున్నావా నోరు మూసుకు పడి ఉండడానికి ? కరణం మాటలు నమ్మి నేను గొడ్డలి తీసుకోలేదు. నా మనిషి దెబ్బ తింటున్నాడంటే నేను ఓర్చుకోలేను. నా ప్రాణం అడ్డుపెట్టి అయినా నిలబడి పోరాడతాను. మనం అన్న దమ్ములం. ఆ సంబంధం ఉంటే చాలు" విసవిసా బయటకు వెళ్ళాడు.

శ్రీరెడ్డి లోనికి వచ్చేసరికి పార్వతి ఏడుస్తూ కూర్చుంది. "ఏం! ఏమయింది?" అన్నాడు భార్య దగ్గరగా వచ్చి.

"గోపి మా నాన్నను చంపుతానంటున్నాడు."

శ్రీరెడ్డి హతాశుడయ్యాడు. పుండు కెలకడం ఆరంభమయింది. ఏ శాంతి కొరకు పార్వతి ఈ ఇంటికి వచ్చిందో ఆ శాంతినే భగ్నం చేసి ఏడుపు ఆరంభించింది. ఇది ఇక ఆరి పోదా ?




నారాయణరెడ్డి వర్గం అంతటితో ఊరుకోలేదు. శ్రీరెడ్డి, నాగిరెడ్డి వచ్చి నచ్చ చెప్పి విడిపించినా, అంకడికున్న యకరం జొన్న చేలో కంకులు కోయాలని నిర్ణయించుకున్నారు. జొన్న కోసి, గూళ్ళు ఒడ్డి ఉన్నారు. ఉదయం వెళ్ళి ఆ కంకులు కోయుటకు నిర్ణయించారు. రేపు ఉదయం కోస్తున్నామని బహిరంగంగానే చెప్పారు. కరణం ఇంటి వద్ద హడావిడిగా అందరూ మూగారు. గోపిరెడ్డి కూడా అక్కడికి వచ్చాడు. అందరికీ ఆవేశాలు వచ్చాయి. ఏమైనా సరే అడ్డుపడి తీరాలన్నారు. ఇలా వారు చేసుంటే, లొంగిపోవడం మన చేతకానితన మన్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్క సూటిపోటు అన్నారు. గోపిరెడ్డి, కరణం ఇద్దరూ రహస్యంగా ఆలోచించిన తరువాత, అడ్డగించి తీరాలని నిర్ణయించుకున్నారు. అంకడిని హాస్పిటల్ తీసుకవెళ్ళి కేసుకూడా నమోదు చేయాలనుకున్నారు. స్థానికంగా ఉన్న పోలీసులు గురివిరెడ్డికే ఎక్కువ సానుభూతి అందిస్తున్నారని అభిప్రాయ పడ్డారు.

మందిని నిర్ణయించారు. రాజీవల్ల వెనుకకు తగ్గినవారు పోగా ఇంకా వంద మంది దాకా కర్ర పట్టే వారున్నారు. వారందరూ అక్కడ లేరు. అయినా

తమతో కలిసి వస్తారని నిర్ణయించుకున్నారు. అందరికీ ఉదయమే సిద్ధంగా ఉండమని చెప్పి పంపారు. వారు వెళ్ళిన తరువాత గోపిరెడ్డి, కరణం, మరొక పది మంది మిగిలారు. ఉదయం చేయవలసిన కార్యాలు ఆలోచించారు. గోపిరెడ్డి ఇంటికి లేచి వెళ్తుంటే "గోపీ! అందరి చూపూ, ఆశా నీమీదే ఉంది! ఏం చేసినా బాధ్యత నీదే!" అన్నాడు కరణం.

ఈ వార్త గ్రామమంతటా రాత్రికే మార్మోగింది. శ్రీరెడ్డి తల్లడిల్లాడు. వెంటనే గురివిరెడ్డి ఇంటికి వచ్చాడు. గురివిరెడ్డి కర్నూలు వెళ్ళి ఉన్నాడు. పెద్దకొడుకు బలరాంరెడ్డి ఉన్నాడు. అతనితో జరుగుతున్న వివరాలు చెప్పాడు.

"నేను కూడా ఈ విషయం ఇప్పుడె విన్నాను. అయినా నీ తమ్ముడు ఇంత బరితెగించడం మంచిది కాదోయ్! వేలెడంత లేడు. ఇంత మొగాళ్ళం నోరు మూసుకుపడి వుంటే, వాడు చెంచు నాటకం ఆడతాడా? బుద్ధి చెప్పక!"

శ్రీరెడ్డి విషాదంలోనూ నవ్వాడు. "బావా! మీరనుకున్నంత తేలికగా వాడిని దండించటం సాధ్యం కాదు. వాడు నా తమ్ముడు; ఆ యింట్లో నాతో సమానమైన వ్యక్తి. అదటుంచి రెచ్చగొడుతున్నది మీవారే! ఆరిపోయే నిప్పును ఊది రేగగొడుతున్నారు. ఫలితం ఏమవుతుందో మీకూ తెలుసు. దీన్ని ఆర్పడానికి మీరే ప్రయత్నించాలి"

"అనే మేమూ అనుకుంటున్నామోయ్! అందరూ ఒకరినొకరు రెచ్చగొట్టుకుంటున్నారు. ఒకరు తక్కువా ఒకరు ఎక్కువా లేదు. సరే వారేదో తమ బాకీ రాబట్టుకోడానికి ప్రయత్నిస్తే మీ వాడికేం రోగం?"

శ్రీరెడ్డి కోపంగా చూశాడు. "కేవలం నా తమ్ముడి తప్పునే వెతుకుతున్నావు. ఎప్పుడో ఇరవై ఏండ్ల క్రింద పడిపోయిన బాకీ; తిరిగి తవ్వి తీయడానికి ప్రయత్నించే నారాయణరెడ్డిని అనవేం? అతడు మీ వర్గం మనిషి కావడం వల్లనా! ఇరవై సంవత్సరాల క్రింద రాబట్టుకోలేక విడిచిన డబ్బు, ఈనాడు రాబట్టడానికి దౌర్జన్యానికి దిగుతాడా?"

గురివిరెడ్డి భార్య కలుగచేసుకున్నది— వ్యవహారం శృతి మించుతుందని తెలిసి "అది కాదబ్బాయ్! గోపి తెగించి ఇంత ముందుకు రావడం మంచిదా? మీరే ఆ విధంగా ముందుకు వస్తే వెనుక ఉన్న మనుషులు, అవకాశం కొరకు ఎదురు చూసేవారూ ఊరుకుంటారా? నారాయణరెడ్డిది కూడా తప్పే! రాని బాకీని వసూలు చేసే పేరుతో తెచ్చి కట్టివేసి, గొడ్డును బాదినట్లు బాదుతాడా? అయినా బలరాం! నారాయణరెడ్డిని ఒకసారి హెచ్చరించకూడదూ? వీరంవరి పొట్లాటలతో మనం కలిస్తే మన కుటుంబాలు నాశన మవుతాయిరా! ఇంతవరకూ అయింది చాలు."

"రేపు తిరిగి మారణహోమం జరుగబోతున్నది. దీన్ని ఆపే మార్గమేమిటో చెప్పు" అన్నాడు శ్రీరెడ్డి.

"ఆపేదేముంది! బుద్ధిగా నోరు మూసుకొని ఇంట్లో కూర్చోమని గోపిగాడికి చెప్పు. వినకుంటే కట్టి పడేసెయ్యి. వాడు ముందుకు రాకుంటే ఎవడూ ముందుకు రాడు."

"అంటే నారాయణరెడ్డి అంకడి చేను కోసుకు వెళ్ళినా ఫరవాలేదు; కాని గోపి మాత్రం ముందుకు పోవద్దంటావా?"




''పెద్దాలు తీయవద్దు. ఈ పోరాటం మానాలంటే ఎవరో ఒకరు వెనుకకు పోవాలి. 'ఇంట్లోవాడే పెట్టెర కంట్లో పుల్ల' అన్న సామెతగా, మ న వా డే ముందుకుపోతే ఏదో దౌర్జన్యం చేయడానికి ఎదురు చూసేవారు ఊరుకుంటారా? అరే! పట్టుకోరా అండే పొడిచి చంపి మరీ వస్తారు. మన కుటుంబాలు బాగుపడాలంటే గోపి ముందుకెళ్ళ కూడదు."

"నేనా విషయం గోపికి చెప్పలేను; పోనీ నీవు వచ్చి చెప్పు."

బలరాంరెడ్డి ప క ప కా నవ్వాడు. "స్వంత అన్నవు నీవు చెప్పలేకపోతే నేనేం చెప్పగలను? అయినా నారాయణ రెడ్డితో మాట్లాడదాం! పిలిపిస్తాను" అంటూ బయటకు వెళ్ళాడు.

''తిరిగి కుత్తుకలు కోసుకోవడం ఎందుకు మొదలెడతారబ్బాయ్! జరిగి పోయినదాన్ని తవ్వకండి. ఆ చిన్నపిల్ల పార్వతి ముఖం చూడు. దాన్ని బాగా చూస్తారనే ఆశతో మీ చేతుల్లో ఉంచాను. మీ అమ్మ బ్రతుకే దానికి కూడా తీసుకురాకండి. బాబూ!'' అంది నీలమ్మ ఆవేదనగా.

శ్రీరెడ్డి మాట్లాడలేదు. కొద్ది సేపటిలో నారాయణరెడ్డి, బలరాం కలిసి వచ్చారు. శ్రీరెడ్డి అతనికి నచ్చ చెప్పడానికి ప్రయత్నించాడు. పోయిన బాకీ గురించి పట్టు బట్ట వద్దన్నాడు. తిరిగి చిచ్చు పేర్చ వద్దన్నాడు. ఎంత చెప్పినా అతను వినలేదు. వినకపోవడానికి బలరాం ప్రోత్సాహం ఉందని శ్రీరెడ్డికి ఇంకా తెలియదు. శ్రీరెడ్డి మాటలు, చెవిటివాడి ముందు శంఖ మూదినట్లయ్యాయి. ఉదయం జొన్న కంకులు కోయడం తప్పదు. ఎవరైనా అడ్డుపడితే కుత్తుక కోయడానికి సిద్ధమని నారాయణరెడ్డి చెప్పి పోయాడు. శ్రీరెడ్డి బలరాంరెడ్డితో కూడా ఓర్పుగా చెప్పాడు. తాను కలుగ చేసుకోననీ, ఆ తర్వాత వాళ్ళు ఏమయినా చేసుకు చావనిమ్మని అతనన్నాడు. విసిగి తెల్లవారుఝామున రెండు గంటలకు ఇంటికి వచ్చాడు. తలుపు తట్టిన వెంటనే పార్వతి తలుపు తీసింది. ఆమె ముఖంలో బాధ, భయం, ఆత్రుత కన్పిస్తున్నాయి.

"ఏమయింది?"

''ఏం కావాలో అదే అవుతున్నది" అన్నాడు విసుగ్గా వచ్చి మంచంలో కూర్చుంటూ. నెమ్మదిగా, భయంగా అతని దగ్గరకు వచ్చింది ఆమె! "అన్నానికి లేవండి?''

శ్రీరెడ్డి తలతిప్పి పడుకున్నాడు. "అన్నం తిన్నట్లే ఉంది నా పని! అన్నం తినే రోజులు కూడా దాటిపోతున్నాయి"

పార్వతి ఏడ్చింది; వెక్కి వెక్కి ఏడ్చింది. "నీవే ఇలాగయితే మిగిలిన మాగతి ఏమిటి బావా! నాకు దూరం కావద్దు. నిప్పును రేపవద్దు బావా" అంటూ అతని మీద వాలింది. జాలిగా చూశాడు ఆమె వైపు. తన తల్లి రెండు కుటుంబాల మధ్య బలి పశువే అయింది. ఇంకో బలి పశువు పార్వతి కావడమా? ఎన్నడూ నా పార్వతిని బలిపశువుగా చేయను అనుకున్నాడు. సంధి నిలబెట్టుకోవాలి. తిరిగి నరహత్యలు జరుగకుండా చూసుకోవాలి. లేచాడు. పార్వతి తలెత్తి అతని వైపు చూసింది.

"పారూ! నేను కర్నూలు వెళ్తున్నాను. రిజర్వ్ పోలీసులను తీసుకవస్తాను. వారయినా అడ్డుపడితే ఈ విధ్వంసకాండ ఆగుతుంది"

"ఈ రాత్రి ఆ నల్లవాగు మీదుగా నీవు

పోవడమా? ఈ ఊరుకాదు; ఈ ప్రపంచం నాశనమయినా నాకు బాధ లేదు. నీవు మాత్రం పోవద్దు" అంటూ కాళ్ళు చుట్టు కుంది.

"నాకేమీ భయం లేదులే! నన్నేవడేం చేస్తాడు ?"

"లేదు లేదు. నిన్ను పోనివ్వను. అవకాశం కొరకు పొంచి ఉన్నవాళ్ళు ఎందరో ఉంటారు"

ఈ సవ్వడివిని అన్నపూర్ణమ్మ లేచి వచ్చింది "ఏమిటే పార్వతీ" అంటూ.

"చూడత్తమ్మా! నీ పెద్ద కొడుకు ఇప్పుడు కర్నూలు పోతాడట?"

అన్నపూర్ణమ్మ ఆశ్చర్యంగా చూసింది కొడుకు వైపు "ఎందుకూ?" అంటూ.

"కొంపలంటుకుంటున్నాయి. ఆలస్యం చేసేకొద్దీ ఫలితం ఘోరంగా ఉంటుం దమ్మా!" అంటూ అంతవరకూ జరిగిన వివరాలు చెప్పాడు. అంతా విని ఆమె మండిపడింది. "ఎవడి కొంపో కూలుతుందని ఈ రాత్రి నీవు వెళ్ళి, నీ కొంప కూల్చు కుంటావా? నీకు బుద్ధి లేదురా! మీ నాన్న లాగ మీరు తయారయ్యారు. ప్రయా ణానికి ఒక కాలమంటూ ఉండాలిరా! రేచుకుక్కల్లా మన కొరకు ఎదురు చూసే వారు చాలామంది ఉంటారు"

"అటువంటి వారివల్ల నాకేమీ భయం లేదులే! ఎట్టిపరిస్థితిలోనైనా పోయితీరాలి. పోకుంటే అందరూ నాశనమవుతారు" అంటూ బయటకు నడిచాడు.

ఇక చెప్పినా వినడని నిర్ణయించుకొని బయటకు వెళ్ళి వసారాలో పడుకున్న వారిని లేపింది. "శ్రీరెడ్డి కర్నూలు వెళ్తు న్నాడు; వాడి వెంట వెళ్ళండి" అంటూ పురమాయించింది. అప్పటికప్పుడే ముప్పై మంది దాకా పోగయ్యారు. కత్తులు, ఈటెలు, గొడ్డండ్లు తీసుకొని శ్రీరెడ్డి వెంట నడిచారు. అమావాస్య చిమ్మచీకటి. గజం దూరంలో నిలబడిన మనిషి అగు పించడం లేదు. ఆ చీకటిలోనే తారాడు కుంటూ స్టేషన్‌కు వచ్చారు. అక్కడ ఒక గుర్రం బండి తప్ప మరింకేమీలేదు. వీరిని చూస్తూనే ఆ బండి ముదుసలి లేచి నిల్చున్నాడు.

"వ్యాన్లు ఏమీ ఇటు రాలేదా?" అడి గాడు శ్రీరెడ్డి అతన్ని. ఆ ముదుసలిది పైడిపల్లే! అయితే గ్రామ రాజకీయాల తాకిడికి తట్టుకోలేక రైలు స్టేషన్ వద్ద గుడిసె వేసుకొని, బండి తోలుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. శ్రీరెడ్డి అతడికి తెలుసు.

"ఇప్పుడే పూలపాడు వెళ్ళింది బాబూ! ఇంకొక అర్ధగంటలో బండి టయానికి రావచ్చు" అన్నాడు. చేసేదేమీలేక స్టేషన్‌లోకి వెళ్ళి కూర్చున్నారు. పిచ్చా పాటి మాట్లాడుకుంటుండగా, బండి వస్తున్నట్లు గంట కొట్టారు. అప్పుడే వ్యాను కూడా ఒకటి వచ్చి ఆగింది. వ్యాను డ్రైవరును పిలుచుకురమ్మని మని షిని పంపాడు శ్రీరెడ్డి. డ్రైవరు ఆ కత్తులు, ఈటెలు చూసి ఇది పెద్ద కేసే నను కున్నాడు.

"కర్నూలు పోవాలి. వస్తావా ?" అడి గాడు శ్రీరెడ్డి. డ్రైవరు తలూపాడు. "బాబూ బండి కొంచెం ట్రబులిస్తున్నది. కర్నూలు చేరాలంటే కనీసం గంటన్నర పడుతుంది" అన్నాడు.

"40 కిలోమీటర్లు వెళ్ళేదానికి గంట న్నరా ?" అని చేతి గడియారం చూసు కున్నాడు. నాలుగ్గంటలు కావస్తున్నది. అంటే చేరేటప్పటికి ఐదున్నర అవు




తుంది. తిరిగి ఏడుగంటలలోగా రావచ్చు ననుకున్నాడు. ఉదయం లేచి, సారా త్రాగి, కర్రలు వెతుక్కొని సాగేటప్ప టికి తొమ్మిది పది గంటలవుతుంది. అప్పటికి పోలీసులతో కలిసి ఊరు చేర వచ్చుననుకున్నాడు. "పోదాం పద" అంటూ బయటకు నడిచాడు. శ్రీరెడ్డితో పాటు నలుగురు మనుషులు వ్యాను ఎక్కాడు. మిగిలినవారిని, తెల్లవారేవరకూ స్టేషన్‌లోనే పడుకుని తెల్లారిన తర్వాత వెళ్ళమన్నాడు. తాను వచ్చేటప్పటికి ఆలస్యమయినా, గోపివెంట ఉండి గోపికి ఏమీ జరుగకుండా చూడమని మరీ మరీ చెప్పాడు. ముందుసీటులో కూర్చున్నాడు. వ్యాను సాగింది. బండి జర, జరమంటూ బొబ్బలు పెడుతున్నది. ఇది గమ్యం చేరుస్తుందా? అన్న భయం ఒకవైపూ, తెల్లవారితే ఏమవుతుందోనన్న భయం ఇంకొక వైపూ! ఆలోచిస్తూ కూర్చు న్నాడు. బండి పాతది. రోజుకు రెండు సార్లయినా రిపేరుకు సిద్ధమయ్యేది! అసలే అది గతుకులబాట! ఓవర్ ఛార్జీ వసూలు చేసుకుని, ఎక్కువడబ్బు రాబట్టు కోవచ్చని ఆ బాటలో రెండు వ్యానులు తిరుగుతున్నాయి. అందులో ఒకటి ఇది. కొంతదూరం పోయిన తరువాత బండి కదలకుండా నిలబడింది. ఇంజన్ శబ్దం కూడా లేదు.

"ఏమయింది డ్రైవర్?" అన్నాడు శ్రీరెడ్డి. డ్రైవరుకు ముచ్చెమటలు పోస్తు న్నాయి కారు చెడిపోయిందంటే తంతా రని –

"చూస్తున్నానండీ" అంటూ దిగి బానెట్ పైకి ఎత్తి, చెక్ చెయ్యనారం భించాడు. వీడు ఎటూ కాకుండా మధ్య నిలబెట్టాడేమిటా? అని మిగిలిన వారు భయం భయంగా దిక్కులు చూస్తున్నారు.

ఆ కటిక చీకటిలో ఏది ఏమిటో అర్థం కావడంలేదు. చలి వాతావరణం తగ్గి పోతున్నది. ఈదురు గాలిగా ఉంది. ఎక్కడో నక్క ఊళలు విన్పిస్తున్నాయి. తెల్లవారబోతుందన్నట్లు దగ్గర్లోని గ్రామం లోని కోళ్లు అరుస్తున్నాయి. అక్కడి నుండి మెయిన్‌రోడ్డు ఎక్కాలంటే ఇంకా ఐదు కిలోమీటర్లుంది.

"ఇది ఇప్పట్లో బాగవుతుందంటావా?" డ్రైవరుతలెత్తి శ్రీరెడ్డివైపు చూశాడు. "తయారు చేస్తున్నాను బాబూ! కొద్ది సేపటిలోనే కదుల్తుంది" అన్నాడు.

అక్కడే తెల్లగా తెల్లారింది. ఆరుం పావయింది. తను కర్నూలు చేరగలడా? అనే సందేహం వచ్చింది. కారు స్టార్ట యింది. అందరూ కూర్చుంటూనే కది లింది. మరి కొంతదూరం పోతూనే నిల బడింది. డ్రైవర్ దిగాడు. అందరూ దిగారు. మెయిన్‌రోడ్డు కిలోమీటరు దూరంలో కన్పిస్తున్నది. లారీలు, బస్సులు పోతున్నాయి. శ్రీరెడ్డి డ్రైవర్ని పలుక రించలేదు. యాభై రూపాయల నోటు సీటుపైనవేసి, వేగంగా ముందుకు నడక సాగించాడు. అతనివెంట మనుషులు సాగారు. దాదాపు పరుగు నడకతో పది నిమిషాలలో మెయిన్ రోడ్డు చేరారు. లారీలు వస్తున్నాయిగానీ నిలపడంలేదు. ఆ లారీలకంటే వేగంగా గుండె కొట్టు కుంటున్నది. ఎట్టకేలకు బస్సు వచ్చింది. ఆగుతూనే ఎక్కికూర్చున్నారు. అప్పటికే ఏడున్నరయింది. సూర్యుడు బారెడు దూరం సాగి పైకిపోతున్నాడు. కర్నూలు చేరేవరకు ఎనిమిదిన్నర అవుతుంది. అప్పటికేమవుతుందోఅనుకున్నాడుశ్రీరెడ్డి

అతని అన్ని ఆలోచనలనూ భగ్నంచేస్తూ టైరు - బాంబు ప్రేలినంత శబ్దంతో పగిలింది. శ్రీరెడ్డి గుండె పగిలినట్లయింది. దరిద్రుడు పట్టిందంతా మట్టి అయినట్లే తాను చేయబోయేపనంతా విఘ్నమయిపోతున్నదే, అనుకుంటూ సీటునుండి ఇక లేవనయినా లేవకుండా కూర్చున్నాడు.




తూర్పు తెల తెల వారింది. నారాయణ రెడ్డి ఇంటిముందు ఈటెలు తళ తళలాడాయి. రెండు డబ్బాల వంటసారా దించారు. కేకలతో, హూంకరింపులతో ఆ ప్రాంతం నిండిపోయింది. దాదాపువంద మంది ఉన్నారు.కూర్చున్నవారు కూర్చుని ఉండగా, త్రాగే వారు త్రాగుతున్నారు. అటు ఇటు హడావిడిగా తిరిగేవారు తిరుగుతున్నారు. ఆ ప్రాంతమంతా, ఎటుచూసినా ఈటెలు, గండ్రగొడ్డళ్ళు,కట్టెలు ధరించిన వారే!

రావలసింది ఐదువందల రూపాయలు. దాన్ని రాబట్టుకోడానికి ఐదువేల రూపాయల ఖర్చు-పల్లెటూరి ముఠా నాయకుల రాజకీయాల్లో ఒక వింత ఇది. రావలసిన దానికంటే ఎన్నోరెట్లు ఎక్కువ ఖర్చు చేసి రాబట్టుకోవడమో, పోగొట్టుకోడమో తేల్చుకుంటారు. కేవలం పట్టుదల, తమ అధికారం నిలబెట్టుకోవాలనే తపన మాత్రమే ఇది!

అటు నారాయణరెడ్డి ఇంటివద్ద జరుగుతున్న హంగామాతో సమానంగాలేకున్నా, కొంతవరకూ శ్రీరెడ్డి ఇంటివద్ద కూడా ఆరంభమయింది. ప్రొద్దుపొడవకముందే, దాదాపు యాభై మంది చేరారు. అందరూ ఆయుధాలతోనే ఉన్నారు. అక్కడికీ ఇక్కడికీ తేడా సారాయి! గోపిరెడ్డి స్వతంత్రుడు కాకపోవడంతో సారాయి దొరకలేదు. ముందుకు త్రోసే కరణం, రాబట్టుకొనడమేగానీ, పోగొట్టుకోవడం తెలియనివాడు. అయినా అక్కడ చేరిన వారు సారాయికోసం వచ్చినవారు కాదు. తమ నాయకునికి అండగా, తద్వారా గ్రామంలో తమకు దెబ్బలేకుండా చేసుకొనుటకు నిలబడ్డారు. గోపిరెడ్డి బలంలో అది స్వల్పమైనదే! ఆ గ్రామంలో ఈ ముఠావైపు కర్రపట్టగలవారు, రెండొందల దాకా ఉన్నారు. రాజీవల్ల తామెక్కడ దెబ్బతినగలమోనన్న సంశయంతో ఈ రోజు వారంతా ముందుకు రాలేదు. ఆ వచ్చినవారు శ్రీరెడ్డిని చూసిగాక, గోపిరెడ్డిని చూసివచ్చినవారూ, శత్రువుమీద విపరీతమైన కక్ష ఉండి, గతంలో వారి వల్ల బాగా దెబ్బతిన్న వారూను. ఇక ముందు తమకు గోపి ఒక్కడే రక్షకుడని వారు నమ్ముతున్నారు. రాంరెడ్డి కూడా అక్కడ ఉన్నాడు; కాని అతని ముఖంలో విసుగు కనిపిస్తున్నది. మంది కలిసి రావడంలేదు. పెట్టుబడికి డబ్బులులేవు. ఈ పరిస్థితిలో శత్రుత్వం ప్రమాదకరమే! ఆ మాట గోపితో అన్నా లెక్కచెయ్యడు గోపికి కష్టం కలిగించడం తప్ప, ఏమీ లాభంలేదు. అందువల్ల మెదలకుండా కూర్చున్నాడు. కరణం ఆ ప్రాంతం రాలేదు. ఏమైనా జరిగే పరిస్థితి ఏర్పడితే, తన కెలాంటి సంబంధంలేదని చెప్పడానికి




అతని ఎత్తు! గురివిరెడ్డి గ్రామంలోలేడు. బలరాంరెడ్డి, నారాయణరెడ్డిని ముందుకు త్రోసి తాను బయటకు రాకుండా కూర్చు న్నాడు. ఖర్చంతా నారాయణరెడ్డిదే! అయినా అతను వెనుకాడడం లేదు. నిప్పు ఆర్పడం అతని లక్ష్యం కాదు. ఎగ త్రోయడానికే అతను నిర్ణయించు కున్నాడు.

ప్రొద్దు పొడిచిన కొద్దిసేపటికే పొలి కేకలు వేస్తూ మంది కదిలారు. కొందరి చేతుల్లో కొడవళ్ళున్నాయి. మరికొందరి చేతుల్లో ఈటెలున్నాయి. నారాయణరెడ్డి తాతలనాటి ఖడ్గం చేతపట్టి, మీసం దువ్వుతూ నడుస్తున్నాడు. అతని వెనుక మంది నడుస్తున్నారు. వారిని చూస్తున్న గ్రామంలోని ఆడవారు, పిల్లలు ఏడు స్తున్నారు. ఏం జరుగబోతుందో తెలిసి నట్లే ఉంది. ఈ గ్రామంలో 'సంధి' అనేది ఇక పనికిరాదని తేలిపోయింది. సంధి చేసుకున్న పెద్దమనుషులు ఇరువురూ గ్రామంలో లేరు. వారు ఉన్నా ఈ యజ్ఞం ఆగదనీ తెలుసు.

పోతూ పోతూ నాటుబాంబు ఒకటి త్రోవలో విసరేశారు. పెద్ద శబ్దంచేస్తూ మంటలు లేచాయి. అది శత్రువులను భయ పెట్టడానికే; తమ దగ్గర బాంబు లున్నాయని తెలియ చెప్పడానికే! ఆ గుంపు పోలీసు ఠాణాముందుగానే వెళ్ళారు. బయట సెంట్రీ, లోపల ఇద్దరు డ్యూటీ కానిస్టేబుల్స్ ఉన్నారు. వారు వీరిని చూస్తున్నారేగానీ నోరు మెదపడం లేదు. వారి గుండెలు ధనధనమని మోగు తున్నాయి. ఏ సమయంలో అవి నిలిచి పోతాయోనని వారి భయం. ఆ సమ యంలో వారిని చూసినవారు, భవిష్యత్‌లో ఎప్పుడు పోలీసుల్ని చూసినా లెక్క చేయరు. దిష్టితీసిన బొమ్మల లాగున వారు నిలబడి ఉన్నారు.

దాడి జరుపబడే పొలం గ్రామానికి రెండు ఫర్లాంగులు ఉంటుంది. పొలంలో ఉన్న గూడుమీద పడి కట్టలు లాగివేశారు. పదిమంది కంకులు కోయడం మొదలు పెట్టారు. మిగిలిన మనుషులు కర్రలు చేతపట్టి, అటూ ఇటూ తిరుగుతూ, తూలుతూ, ఎవరో ఎదురుగా ఉన్నట్లు ఊహించుకుని బండ బూతులు తిడు తున్నారు. వారి మెదడు వేడెక్కి పోతున్నది. అప్పుడే వచ్చిన ఎడ్లబండిలో కోసిన కంకులు పోస్తున్నారు. బండి నిండింది.

"బండి పోనివ్వండిరా! కళ్లంలో బండి దిగ విడిచి, మళ్ళీ రండి" నారాయణరెడ్డి ఉత్సాహంగా అన్నాడు. అంతవరకూ ఎవరూ అడ్డం రాలేదు. ఇంత జరిగినా, అడ్డం రాదలచినవారు రాకపోవడంతో; అతని ఉత్సాహం శృతి మించింది. తమ దెబ్బకు వారు భయపడడంవల్లే రాకుండా మానుకున్నారనుకున్నాడు. బండి ముందుకు సాగింది. బండి వెనుక పది మంది నడుస్తున్నారు. మిగిలినవారు పొలం వద్దనే ఉన్నారు. మరొక బండి కంకులు అవుతాయి. అవి ఇంటికి చేర్చితే పని అయిపోతుందని ఆలోచిస్తున్నారు. బండి కళ్ళంలోకి రావాలంటే ఊరుదాటి రావాలి. పొలం గ్రామానికి ఉత్తరం అయితే, కళ్ళం దక్షిణంవైపు ఉంది. అందువల్ల గ్రామం మధ్యనుంచే బండి పోవాలి. కచేరీమూల తిరిగి బండి సాగుతూ ఉండగా అక్కడ గోపిరెడ్డి నిలబడి ఉన్నాడు. బండి తోలేవాడికి ఆ సమ యంలో యమధర్మరాజులా కని

 

పిస్తున్నాడు గోపిరెడ్డి. గోపిరెడ్డి వెనుక యాభై మందిదాకా ఉన్నారు. బండి నిలిచి పోయింది. బండి వెనుక ఉన్న పదిమంది వెనుతిరిగి పరుగెత్తడం మొదలు పెట్టారు.

"ఒరేయ్! వాళ్ళను పోనీయకండి! పట్టుకోండి" గోపిరెడ్డి కేకతో మంది అటు ఉరికారు–చేతికందిన రాళ్ళను వారిమీదకు విసురుతూ. తొమ్మిది మంది పారిపో గలిగారు. సారాయికై పు 'విపరీతంగా ఎక్కిన ఒకడు తూలి క్రింద పడడంతో దొరికి పోయాడు. వాడి వీపుమీద కర్రలు నాట్యమాడాయి. దొరికినవాడి కాళ్లుపట్టి, మోకాలివరకూ విరిచివేశారు మరొకడు గండ్రగొడ్డలితో నరకడంతో కాలు ప్రక్కకు వచ్చింది. వాడు స్పృహ తప్పి పడిపోయాడు. ఈలోగా కొందరు బండి మీదున్న వాడిని దింపి, చితక బాదారు. తర్వాత బండిని వెనుకకు త్రిప్పి గోపిరెడ్డి కళ్లంవైపు పోనిచ్చారు. బండి మీదున్న కంకులు క్రిందకు కార్చి, బండిని కళ్లం బయటకు తెచ్చి విడిచి, ఎద్దులను తరిమారు. అవి పారిపోయాయి.

"ఒరేయ్! మనం ఎక్కడికీ పోనవసరం లేదు. వస్తుందా...మరొక బండి ఊరు లోనికి వచ్చినప్పుడు చూసుకుందాం! లేకుంటే, వాళ్ళే మన మీదకు వచ్చి నప్పుడు పోట్లాడుదాం. ఎవరూ ప్రక్కకు పోకండి" అన్నాడు రాంరెడ్డి.

పొలంలో ఉన్న నారాయణరెడ్డి వర్గానికీ వార్త తెలీగానే ఆగ్రహంతో మంది పడ్డారు. నారాయణరెడ్డి వెనుక అందరూ పరుగిడుతున్నారు. ఏదో విధంగా ఈ పోట్లాటనుండి తప్పించుకోవాలని ఆలో చిస్తూ, కొందరు చిన్నగా పరుగిడు తున్నారు. గోపిరెడ్డి కళ్లంలో వారందరూ కూడా సిద్ధంగా ఉండడంవల్ల, మంది తామే ఎక్కువ ఉన్నా, మీదపడడానికి ధైర్యం చాలలేదు. దొరికిన రాళ్ళను తీసుకుని విసరసాగారు. ఇద్దరిమధ్యా దూరం ఇరవై గజాలకు మించి లేదు. ఒకరి రాళ్లు ఒకరికి తగులుతున్నాయి. ఒకరి నొకరు తిట్టు కుంటున్నారు. దొడ్డిగోడలు నేల కూలు తున్నాయి. ఆ రాళ్లు విచ్చలవిడిగా పడు తున్నాయి. దెబ్బలు తగిలినవారు కేక లేస్తూ, బాధతో ప్రక్కకు పరుగిడు తున్నారు. గోపిరెడ్డి వర్గంలోని రాముడు ముఠా చీల్చాడు. ఒకవైపు వీళ్ళు రాళ్లు విసరుకుంటుండగా, వెనుక వైపుకు పది మందితో వెళ్ళాడు. అక్కడినుండి 'కోబలీ' అంటూ అరవడంతో, నారాయణ రెడ్డి మనుషులు తబ్బిబ్బు పడ్డారు. ప్రాణ భయంతో గజమెత్తు గోడలుకూడా దుమికి పరుగెత్తేవారు పరుగిడుతుంటే, నిలబడిన కొందరు కర్రలకు కర్రలు కలిపారు. అసలు నాయకుడు నారాయణరెడ్డి ఎప్పుడో తప్పించు కున్నాడు. మిగిలినవారు ప్రాణాలకు తెగించి కొట్టుతూ, కొట్టించు కుంటున్నారు. ఫెడీమని కర్రల శబ్దం ఆ ప్రాంతమంతా విన్పిస్తున్నది. కేకలు, ఈలలు మిన్ను ముట్టుతున్నాయి. నారాయణరెడ్డి వర్గంలోని ఒకడు బాంబు తీసి, ఇటువైపు విసిరాడు. బ్రహ్మాండ మైన శబ్దంతో ఆ ప్రాంతమంతా మారుమ్రో గింది. వాటితోపాటు "అబ్బా" "అమ్మా" అన్న అరుపులు ఆ శబ్దంలో విన్పించ లేదు. ఎట్టకేలకు నారాయణరెడ్డి వర్గం పారిపొయ్యారు. విపరీతమయిన దెబ్బలు తగిలిన ఒకడు అక్కడే పడి ఉన్నాడు. గోపిరెడ్డి వర్గంలోని పదిమందికి బాంబు దెబ్బలు తగిలాయి. ఒకడు అక్కడి కక్కడే చనిపోయాడు. గోపిరెడ్డికి,

రాంరెడ్డికి విపరీతంగా దెబ్బలు తగిలాయి.




రిజర్వు దళాలు దిగేటప్పటికి పది గంటలు దాటింది. అప్పటికే జరిగేదేదో జరిగి పోయింది. ఆ దళాలవెంట వచ్చిన శ్రీరెడ్డి, గురివిరెడ్డి పరిస్థితిని కండ్లారా చూశారు. దెబ్బలు తగిలినవారిని పోలీసు వ్యానులలో హాస్పిటల్‌కు తరలించారు. గ్రామంలోని ఆడ-మగవారు శవాన్ని చూడడానికి వస్తున్నారు. చుట్టుప్రక్కల గ్రామాల నుండి కూడా తరలి వస్తున్నారు- ఈ మారణ హోమం చూడడానికి. పై నుండి దళాలు వచ్చేవరకూ ప్రజలెవ్వరూ ఇండ్ల నుండి బయటకు రాలేకపోయారు. చివరకు ఠాణాలోని పోలీసులు కూడా రాలేదు.

శ్రీరెడ్డి ఇంటికి వచ్చాడు. ఇంటి దగ్గర అంతా గందరగోళంగా ఉంది. తల్లీ, భార్యా ఏడుస్తున్నారు. వారితో పాటు ఏడవటానికి మరి కొందరు- దెబ్బలు తగిలిన వారి భార్యలు-అక్కడఉన్నారు. అక్కడ కురుక్షేత్రమయితే, ఇక్కడ శోక క్షేత్రంగా ఉంది. శ్రీరెడ్డికి విసుగు పుట్టి,కోపం రేగింది. తన మాట వినకుండా తమ్ముండ్లు ఇద్దరూ ఈ విధంగా తయారు కావడం చింతగా ఉంది. వారిని ఇక మార్చడం సాధ్యం కాదేమోనని ఆలోచిస్తున్నాడు. సంధి-రంధిగా మారిందంటే ఇక గ్రామం బాగుపడదు. సరిగ్గా ఆరు నెలలు పూర్తికాలేదు. తిరిగి హత్య. రెండు హత్యలూ చెంచురెడ్డి వర్గానికిచెందిన వారినే. ఈ స్థితిలో సంధి సాగడం సంభవమా ? అయినా అందుకొరకే తాను ప్రయత్నించాలి. పరిస్థితులు మార్చాలి.

"రేయ్ రంగడూ!"

బయట నిలిచి ఉన్న రంగడు లోనికి పరుగెత్తాడు. "వెళ్లి కరణాన్ని పిలిచిరా ! పని ఉందంటే కాదు, తప్పని సరిగా వెంటనే రావాలని పిలుచుకురా"

రంగడు పరుగెత్తాడు. కొంచెం సేపటి లోనే కరణం వచ్చాడు. శ్రీరెడ్డిని చూస్తూ పలకరింపుగా నవ్వాడు. శ్రీరెడ్డి నవ్వ లేదు. అతని ముఖం జేవురించింది. కరణం ముఖం చూస్తూంటే 'పీకి పారేద్దామా?' అన్నంత ఆవేశం పుడుతున్నది. అయినా ఇది సమయంకాదు.

"ఎంత పని చేశావు కరణమయ్యా ! పిల్ల వాడిని పట్టుకొని సర్వనాశనం చేశావే?" ఆవేదనగా అన్నాడు.

కరణం బిగుసుక కూర్చున్నాడు.

"అదేమిటి శ్రీరెడ్డీ ! మధ్య నన్నేదో ఇరకించే మాట మాట్లాడుతున్నావు. ఏం జరిగిందో నాకు మాత్రం ఏం తెలుసు ?"

"నీకేం తెలుసో నాకు తెలుసు స్వామీ! నువ్వు మా పాలిట శకునివి. అన్నదమ్ము లనే చీల్చి వేస్తున్నావు. మామధ్య వైరం కలిగించి, మా చేతనే మా కుటుంబాన్ని నాశనం చేయాలనుకున్నావు. కాని కరణం ఇది మంచి పద్ధతి కాదు. ఈ విధంగా అయితే నీవు బాగు పడవు."

గురివిరెడ్డి వచ్చాడు. కరణాన్ని చూస్తూనే ఆవేశపడ్డాడు. అయినా ఆవేశం అణచుకుని అన్నాడు "చూడు




కరణమయ్యా! గ్రామం బాగుపడుతుందనే ఆశతో నేను కలలు కంటున్నాను. ఎవరినీ నేనై చంపించ లేదు. చంపాలనీ కలలు కనలేదు. గోపి ఊరకుండవలసిన వాడు. అటువంటి వాడిని, నిప్పు ఊది నట్లు నీవు పౌరుషం ఊదావు. అన్న దమ్ముల మధ్య అసూయలు రేపావు. గ్రామమంతాతిరిగి మంటలు మండించావు. దీనికి పూర్తి బాధ్యత నీదే! కాదని తప్పించుకోవటం సాధ్యం కాదు."

"గురివిరెడ్డిగారూ! మీరు ఈ విధంగా మాట్లాడతారని నేననుకోలేదు. ఇందులో నాకే మీ సంబంధం లేదు. వారు-వీరు కర్రలు తీసుకున్న సంగతే నేను విన లేదు."

శ్రీరెడ్డి నవ్వాడు "కరణమయ్యా! నీవు ఎన్ని చెప్పినా నేను నమ్మను. దీనికి కారకుడివి నువ్వే! ఆ విషయం గ్రామంలోని వారందరికీ తెలుసు. అయినా నిన్నేమీ అనదలచు కోలేదు. కాని, ఇక ముందు జాగ్రత్తగావుండు. ఇకముందు ఈ గ్రామంలోకావేషాలు పురికొల్పేది నీవేనని తెలిసే మాత్రం ముందు కాటికిపొయ్యేది నువ్వే!"

కరణం అవాక్కయి, అవమాన భారంతో తల వంచుకున్నాడు.

"ఇకవెళ్ళు!" అని గురివిరెడ్డి చెప్పిన తరువాత వెళ్ళిపొయ్యాడు. గురివిరెడ్డి, శ్రీరెడ్డి లోనికి వచ్చారు. వారిని చూస్తూనే పార్వతి మరింత ఏడుపు మొదలుపెట్టింది. అన్నపూర్ణమ్మ "ఇదేంపని అన్నయ్యా! మనం అనుకున్నదేమిటి? జరుగుతున్న దేమిటి? తిరిగి గ్రామం నాశనం కావడం ఆరంభమయిందే! ఇది బాగుపడుతుందా? మన కుటుంబాలు బాగుపడతాయా?"

గురివిరెడ్డి వద్ద సమాధానం లేదు. అక్కడే ఉన్న నులక మంచం వాల్చి కూర్చున్నాడు. అతని ప్రక్కనే శ్రీరెడ్డి కూర్చున్నాడు. పోలీసు తతంగం పూర్తయ్యేసరికి, పోలీసు వ్యాను తిరిగి వచ్చింది. శవాన్ని వ్యానులో చేర్చారు. డి. యస్. పి. శ్రీరెడ్డి దగ్గరకు వచ్చాడు.

"వెళ్తున్నాం శ్రీరెడ్డీ! మా పని అయి పోయింది. ముప్పైమందిని ఇక్కడ రిజర్వ్‌లో ఉంచుతున్నాము. తిరిగి ఏమైనా జరిగితే వెంటనే తెల్పండి." అంటూ చెప్పి వెళ్ళిపోవబట్టారు.

"ముందు దారి ఏమిటి మామా?" అన్నాడు శ్రీరెడ్డి.

"దాన్ని గురించి ఆలోచించాలి. మనం ఈ తగాదాకుదూరంగా ఉన్నాము. తగాదా గురించి నీకు కొంతవరకయినా తెలుసు. నా కసలు తెలియదు. అయినా, ఇంత తొందరపడి ఈ ప్రమాదం తెస్తారని నేను ఆశించలేదు. రెండు వర్గాలను అణచి వేయడానికి మనం శాయశక్తులా ప్రయత్నించాలి. పరిస్థితులు ముదరక ముందే బాగుచేయడానికిప్రయత్నించాలి!"

గురివిరెడ్డి వెళ్ళాడు. శ్రీరెడ్డి పది మందిని వెంటబెట్టుకొని తిరిగి కర్నూలుకు ప్రయాణమయ్యాడు. అన్నపూర్ణమ్మ తనూ వస్తానని పట్టుబట్టింది. పార్వతిని ఇంటివద్దనే ఉంచి వారు ప్రయాణ మయ్యారు. అక్కడినుండి దాదాపు ఐదు మైళ్ళు వెళ్ళాలి. తర్వాతనే బస్సు ఉంది. రైలు కర్నూలు వైపులేదు. అందువల్ల బస్సే శరణ్యం. ఐదుమైళ్ళు నడిచేటప్పటికి దాదాపు రెండుగంటలు పట్టింది. వెళ్ళిన అర్ధగంటకు బస్సు దొరికింది. జనరల్ హాస్పిటల్ చేరేసరికి రాత్రి ఏడుగంట లయింది. హాస్పిటల్‌లో విజిటర్స్ టైం కాదది. అందువల్ల శ్రీరెడ్డి యస్. పి. తో

మాట్లాడి పర్మిషన్ తెచ్చుకొని హాస్పిటల్ సూపరింటెండెంట్‌కు చూపించి, ఆయననుండి పర్మిషన్ తీసుకొనివచ్చేటప్పటికి తొమ్మిది దాటింది.

హాస్పిటల్‌లో వీరికి ప్రత్యేకంగా కేటాయించిన వార్డులోకి వచ్చారు. వరుసగా మంచాలమీద పదిహేనుమంది ఉన్నారు. వారిలో రెండువర్గాలవారూ ఉన్నారు. ఒక గ్రామంలో పుట్టి పెరిగి, ఆవేశాలతో కొట్టుకొని, తిరిగి ఒకేచోట పడి ఉన్నారు.

అన్నపూర్ణమ్మ ఆత్రుతగా కొడుకుల దగ్గరకు వెళ్ళింది. గోపిని చూసి ఆమె గుండె చెరువయింది. గోలున ఏడుస్తూ మంచం వద్ద కూలబడింది. పదిహేనేండ్ల వయస్సులో తండ్రి తర్వాత తండ్రిలాగే పోరాటంలోకి దిగాడు. ఎన్నడూ ఎవరితోనూ దెబ్బలు తినని వ్యక్తి, బాంబు దెబ్బతో నేలకూలాడు. అతనిలో ఆవేశముంది. ఆ ఆవేశాన్ని అణచుకోలేక, ఈ విధంగా తయారు కావడం ఆమెకు బాధ కలిగించింది. ప్రక్కన రాంరెడ్డి. అతడి పరిస్థితి అంతే కట్లతో పడుకోబెట్టబడి ఉన్నాడు.

తల్లిని చూసి గోపిరెడ్డి ఏడ్వను కూడా లేదు. అతని శరీరంలో మంట పుట్టింది. మనస్సుకూ మంటపుట్టింది. ఇదంతా చేసినది ఈ తల్లేనని అతని ఉద్దేశం. తండ్రి చనిపోయి మూడు రోజులు కూడా కాకుండానే సంధికి ప్రయత్నించింది. తన పుట్టింటివారిని నిలబెట్టడానికా ? వారి ప్రాణాలు కాపాడడానికా ? ఏదయితే ఏం! అన్నను సంధి పేరుతో, వారితో కలిపింది. తాను దూరమయ్యాడు. తండ్రిని చంపినవాడిని తాను చంపాలి. వాడెవడైనాసరే ! శ్రీరెడ్డి గోపిదగ్గరగావచ్చాడు.

అతడిని చూసి గోపి తల ప్రక్కకు త్రిప్పుకున్నాడు. మాట్లాడడానికి కూడా అతనికి మనసొప్పడంలేదు.

"ఎలా ఉందిరా ?" అనునయంగా అడిగాడు శ్రీరెడ్డి వంగి తమ్ముని చూస్తూ. గోపిరెడ్డి అతని కళ్ళల్లోకి సూటిగా చూశాడు. అతని కళ్ళనుండి నీరు రాలి, పరుపుమీద టప టప రాల్తున్నాయి. శ్రీరెడ్డి కండ్లనుండి రాలిననీళ్లు అదే పరుపు మీద పడుతున్నాయి.

"టయిమయిపోయింది; దయచేసి ఇక వెళ్ళండి" అన్నాడు ఇన్స్‌పెక్టర్. అన్నపూర్ణమ్మ గోలు గోలున ఏడుస్తున్నది. ఆ ఏడ్పుకు వార్డంతా విషాదంగా తయారయింది. దెబ్బలు తిన్నవారూ ఏడుస్తున్నారు. చూడవచ్చినవారూఏడుస్తున్నారు. పోలీసులు వారివెంట నడుస్తుండగా, మిగిలినవారు బయటకు వచ్చారు. అన్నపూర్ణమ్మ కళ్లు తుడుచుకుంటూ బయటకు వచ్చింది. వ్యాను మాట్లాడుకొని వెంటనే ప్రయాణమయ్యారు.




"గోపికి ఎలా ఉంది ?" అడిగింది పార్వతి అందరూ ఇల్లు చేరుతూనే ! శ్రీరెడ్డి ఆమెవైపు చూసి తల త్రిప్పుకొని లోనికి వెళ్ళాడు. అన్నపూర్ణమ్మ ఏడుస్తూ అక్కడే కూలబడింది. పార్వతికి ఆదుర్దాగా ఉంది. "అత్తమ్మా ! ఎట్లా ఉంది;

చెప్పుతమ్మా ?" అంటూ ఆమె భుజాలు పట్టుకొని, కన్నీరు విడుస్తున్నది. అన్న పూర్ణమ్మ గొంతు సరిచేసుకుంది. "ఏమని చెప్పమంటావే ? వాడు — నేను పలుకరించినా పలుకడు. నాతో మాట్లాడలేదు. శ్రీతో మాట్లాడలేదు. మేమందరం వాడికి విరోధులమయ్యామే ? భగవంతుడా ! ఈ ఘోరం నేను చేసిందేరా ! నిష్కారణంగా వారిని నేనే కొట్టించాను" అరుస్తూ ఏడుస్తున్నది. పార్వతి కూడా ఏడుపు ఎక్కువ చేసింది. శ్రీరెడ్డి అక్కడికి వచ్చాడు విసుగ్గా.

"ఏమిటి మీ పెడబొబ్బలు ? ఎవరికే మయిందని మొత్తుకుంటున్నారు. అయిందేదో అయింది. ఇక మీరు నోరుమూసుకొని ఉండండి."

పార్వతి లేచి లోనికి వెళ్ళింది. అన్నపూర్ణమ్మ తన పడకగదిలోనికి వెళ్ళింది. శ్రీరెడ్డి కరణం వద్దకు వెళ్ళాడు. అతన్ని చూస్తూనే లేచి, మర్యాద పూర్వకంగా ఎదురు వచ్చాడు కరణం.

"కరణమయ్యా ! అర్జంటుగా ఇప్పుడు పదివేల రూపాయలు కావాలి. తక్షణం ఇచ్చెయ్యి" అన్నాడు శ్రీరెడ్డి.

"పదివేలా ! నా దగ్గిరెక్కడివి ? అయినా సమయా సమయాలు లేకుండా కావాలంటే ఎక్కడ పుడుతుంది ?"

"కరణం ? నాకు కోపం తెప్పించకు! నీ ఇనప్పెట్టెలో ఎంత ఉంటుందో నాకు తెలుసు. ఇప్పటికే జరిగినదంతా నీ వల్లనే నని మాకు నిర్ధారణ అయింది. ఇంకా నీవు అతిగా ప్రయత్నించడం మంచిదికాదు."

కరణం మళ్ళీ నోరెత్తలేదు. ఇంటిలో కెళ్ళి పదిపేల నోట్లకట్ట తెచ్చి అతని కిచ్చాడు. ఆ డబ్బు జేబులో పెట్టుకొని శ్రీరెడ్డి బయటకు నడిచాడు. తిరిగి కర్నూలు వెళ్ళాలి. అసలు కేసు పెట్టకుండా చూడాలి. ఎటువైపు నుంచయినా కేసుండకూడదు. కేసులు పెట్టుకోవడమంటే రంధికి సిద్ధ పడడమే ! వచ్చిన వ్యానులోనే ఎక్కాడు. అతని వెంట గురివిరెడ్డి కూడా కదిలాడు. గురివిరెడ్డి వ్యాను ఎక్కడం చూసి పార్వతి పిలిచింది. దిగి ఆమె దగ్గరగా వచ్చాడు.

"నాన్నా! ఈ గాయం మాన్పండి. నన్ను చూడండి; నా జీవితం చూడండి" అంది ఏడుస్తూ. గురివిరెడ్డి ఆమె భుజం తట్టాడు.

"నా మెదడు పనిచేస్తున్నంత వరకూ నీకేమీ భయంలేదమ్మా! నిన్ను ఇంకో గ్రారె పిల్లను చేయను" అంటూ వచ్చి వ్యాను ఎక్కాడు.

కర్నూలులో యస్.పి.ని కలుసుకొని 'రాజీ ఏర్పాటు చేస్తాం. కేసును రద్దు చేయించాల'ని అడిగారు. పోలీసులకు అవకాశం దొరకకనే ఉండాలి. దొరికిన తర్వాత వదిలిపెట్టరు. అయినా గురివిరెడ్డి శక్తి ఏమిటో తెలుసు కాబట్టి కేసు ఐ.జి.కి కూడా తెలుసుననీ, తనతో మాట్లాడడంవల్ల ప్రయోజనం లేదని, ఆయనతోనే కలిసి మాట్లాడడం మంచిదని చెప్పాడు. తిరిగి హైదరాబాదు ప్రయాణమయ్యారు. గురివిరెడ్డి దృష్టిలో కేసు అసలు పెట్టకూడదని కాదు. ఇంత బహిరంగంగా దెబ్బలు తగిలి, హత్య జరిగితే కేసు నమోదు చేయవద్దని చెప్పేటంత మూర్ఖుడు కాదు. ఆయన లాయర్! కేసును బలహీనం చేయాలనేది అతని ఉద్దేశం. బలహీనం చేయడం ద్వారా, ఎవరికి శిక్షలు పడకుండా . చేయడం ద్వారా కోర్టులో ఆలస్యం లేకుండా కేసు పూర్తి

చేయాలి. ఆ పద్ధతిలోనే అతను ఆలోచిస్తున్నాడు.

ఐ. జి.ని కలిసి, వివరాలు చెప్పి, తన పరిస్థితి కూడా చెప్పాడు గురివిరెడ్డి. ఐ.జి. పూర్తి హామీ ఇవ్వలేదు. ఆలోచిస్తానని మాత్రం మాట ఇచ్చాడు. తిరిగి వాను గ్రామానికి ప్రయాణమయ్యారు.

గ్రామంలో ఆవేశాలు ఇంకా తగ్గలేదు. హతుడు యానాది రాముని కుటుంబం, ఇంకా కోలుకోలేదు. నారాయణరెడ్డి వర్గంలో కాళ్ళు నరికివేయబడ్డ సుంకన్న ఇంటిలో పరిస్థితి అంతే! గ్రామం ఈ విషాదం నుండి తేరుకోవటానికి మరికొన్ని రోజులు పడుతుంది. అయినా నిత్య కృత్యాలు తప్పవు గనుక పనులు చేసుకుంటున్నారు. అందునా పంట చేతికి వచ్చే సీజన్! ఈ సీజన్‌లో పంట పోగొట్టుకుంటే, తర్వాత తినడానికి తిండి ఉండదు. తిండి లేకుంటే ఈ పగలూ కక్షలూ ఉండవు.




పైడిపల్లెకు ప్రభుత్వం ఎమర్జన్సీ క్రింద కొన్ని సదుపాయాలు ఏర్పాటు చేసింది. పైడిపల్లెకు సరాసరి బస్సు సౌకర్యంలేదు. అక్కడికి ఐదుమైళ్ళ దూరంలో ఉన్న వెల్లట్ల మీదుగా వెళ్ళి హైరోడ్డు వరకూ వారికి బండ్ల బాటఉంది. వర్షాకాలం ఈ త్రోవ బురదమయం. నడవాలంటే అతి కష్టంమీద కాళ్ళు లాక్కుంటూ నడవాలి. ఎద్దుల బండ్లు అసలు పోవు. రైలు మార్గం కిలోమీటరు దూరంలో ఉంది. ఆ త్రోవ కూడా సరి అయినది కాదు. వర్షాకాలంలో అతి భీకరంగా పారే నల్లవాగు అడ్డు వస్తుంది. త్రోవంతా ఎగుడు దిగుడు బురదమయం. పైగా అడవి తుమ్మచెట్లు త్రోవకు అటు ఇటు చిక్కగా అల్లుకుని ఉన్నాయి. వాటి కంప గాలికి రోడ్డున పడి, నచ్చే పోయే వారికి ఇబ్బంది కలిగిస్తుంది. గ్రామం ఇలా ఉండడం వల్ల, పోలీసు ఠాణా ఏర్పరచినా, వారి నుండి సహాయం కొరకు విజ్ఞప్తి చేసే లోపల ఇక్కడ జరగ వలసింది జరిగి పోతుంది. అందువల్ల ఆ గ్రామానికి ప్రధానంగా, రవాణా టెలి కమ్యూనికేషన్ ఏర్పరచడానికి నిశ్చయించారు. ఒక నెల లోపునే టెలిఫోన్ లైన్ ఏర్పడింది. వెల్లట్ల నుండి గ్రావెల్ రోడ్డు తయారయింది. ఇటు రైలు స్టేషన్ నుండి కూడా గ్రావెల్ రోడ్డు వేశారు. దానిపైన కంకర రోడ్డు వేయడానికి ప్రయత్నిస్తున్నారు. పోలీస్ స్టేషన్‌కు వైర్‌లెస్ ఏర్పాటు చేశారు. రిజర్వు పోలీసులను ఇరవై మందిని సిద్ధంగా ఉంచే ఏర్పాటు చేశారు. ఇన్ని చేసినా ఆ గ్రామ పోరాటాలు తగ్గుతాయని వారనుకోవడం లేదు; కొంతవరకయినా తగ్గించే అవకాశముంటుందని మాత్రం ఆశించారు.

బాంబు దెబ్బలు తగిలిన ఇరు వర్గాల వారు నెల తర్వాత తిరిగి వాగలిగారు. అందులో ఒకడికి మోచెయ్యి వరకు, ఇంకొకడికి రెండుకాళ్ళూతీసేశారు.

గోపిరెడ్డి ఇంటికి వచ్చిన వెంటనేఆస్తి భాగ పరిష్కారం చేయాలని అడిగాడు.




అన్నపూర్ణమ్మ అంగీకరించ లేదు. శ్రీరెడ్డి అసలే ఒప్పుకోలేదు. అయినా ఖచ్చితంగా పంపకం జరగాల్సిందేనని పట్టుబట్టాడు గోపిరెడ్డి. గోపిరెడ్డి వర్గంలోని కరణం, మరి కొందరు పెద్దలు కూడా, భాగ పరిష్కారం వద్దని నచ్చ చెప్పబోయారు. కాని వారి మాట కూడా పెడచెవిన బెట్టాడు. తనకు ఎవడూ చెప్పనవసరం లేదనీ, ఏ నీతి ఎటువంటిదో తనకు తెలుసుననీ, అన్నాడు. శ్రీరెడ్డి అన్ని విధాలా నచ్చ చెప్పడానికి ప్రయత్నించాడు.

"కావాలంటే ఆస్తి మొత్తం నువ్వే తీసుకో! నేనే బయటికి వెళ్తా" నని కూడా బెదిరించాడు. కాని గోపిరెడ్డి లెక్క చేయ లేదు. ఆస్తి పిత్రార్జితం కాబట్టి, అడ్డు పెట్టడానికి అవకాశం లేదు. భాగం పంపకాలు ఆరంభమయ్యాయి; మొత్తం రెండు వందల యకరాలు ఐదు విభాగాలు చేశారు. అందులో శ్రీరెడ్డి, తల్లి, సురేంద్ర రెడ్డి మూడు భాగాలు కలిసి ఒకవైపు నూటా ఇరవై యకరాలు; గోపిరెడ్డికి నలభై, రాంరెడ్డికి నలభై ఎకరాలు. రాంరెడ్డి విడిగా ఉండడానికే నిశ్చయించుకున్నాడు. అతను పూర్తిగా రంగంలో పాల్గొనడం లేదు. గోపిరెడ్డి వైపే ప్రస్తుతం మొగ్గు చూపినా, అటూ ఇటూ ఊగుతున్నాడు. సంధి చేసుకోవడం మంచిదేననీ, ఇరు కుటుంబాలనూ బాగు చేసుందనీ ఒక వైపు ఉద్దేశం; ఇంకొక వైపు నుండి తండ్రిని చంపిన వారితో రాజీ ఏమిటన్న ఆలోచన. అందువల్ల అటు శ్రీరెడ్డి వైపు గాని, ఇటు గోపిరెడ్డి దగ్గర గాని ఉండ దలచుకోలేదు. గురివిరెడ్డితో పగ సంగతి ఎట్లున్నా, తల్లితో ఘర్షణ పడడం అతని కిష్టం లేదు. అందువల్ల గోపిరెడ్డితో కలిసి ఉండటం కూడా ఇష్టం లేదు. అయితే సహాయం మాత్రం గోపిరెడ్డికే చేయడానికి నిశ్చయించుకున్నాడు.

గోపిరెడ్డి చదువు నిలిచిపోయింది. హాయిగా చదువుకుంటూ ఉన్నతదశకు వెళ్ళవలసినవాడు యుద్ధరంగంలో దిగాడు. నిండా పదునైదేండ్లు లేవు. అందరికీ వ్యతిరేకమయ్యాడు. తన భాగం వచ్చిన నలభై యకరాలతో పది ఎకరాలు డెబ్బైవేల రూపాయలకు అమ్మి వేశాడు. అందులో పదిహేనువేలు పోసి సెకండ్ హాండ్ జీపు కొన్నాడు. కొన్ని బాంబులు, డైనమైట్లు తెప్పించాడు. అన్ని ఖర్చులకు పోగా మిగిలిన నలభైవేల రూపాయలు ఏ సమయంలో అవసరం పడుతుందోనని నిలవ ఉంచబడింది.

కక్షలు పెరిగిన తర్వాత వాటిని త్రుంచడం సాధ్యం కాదు. అందులో రాయలసీమవారివి మరీ భయంకరం! పగ, ద్వేషం, క్రోధం పెరిగిందంటే, అది హత్యల స్థాయికి తీసుకెళ్తుందని అందరికీ తెలుసు.

వరినాటు పోశారు. పొలం దున్నుతున్నారు. గట్లు చెక్కేవారు చెక్కుతున్నారు. పేరయ్యగారి పాలేరు నరశింహులు గట్టుచెక్కుటకు పొలం వెళ్ళాడు. మడిలో నీళ్ళు లేవు. నీరు లేకుండా గట్లు చెక్కడం సాధ్యం కాదు. కాలువ వెంట పైకి వెళ్ళాడు. పైన రామన్న పొలానికి నీరు పారుతున్నది. కాలువకు అడ్డంగా, చుక్కనీరు క్రిందికి దిగకుండా బిగించారు. వాళ్ళ పాలేరు గోవిందు అక్కడే కూర్చున్నాడు. నర్సింహులు అక్కడికి వెళ్ళి చూసి నీరు బాగా వస్తున్నది. కాబట్టి చెరి సగం కాలువ తిప్పుకుంటే సరిపోతుందను

కున్నాడు.

"గోవిందా! గట్లు చెక్కాలి; నీరు లేదు. కాలువ అడ్డం తియ్యి; చెరి సగం పారుతుంది" అన్నాడు.



గోవిందు ఒప్పుకోలేదు. "మా చేను తడిసేవరకు అడ్డం తియ్యను" అన్నాడు.

"అదేంట్రా! నీవేనా నీరు కట్టుకునే వాడివి? మాకు మాత్రం అవసరం లేదా? కాలువమొత్తం నీవే తిప్పుకుంటే కుదరదు" అంటూ కాలువలో దిగబోయాడు నరసింహులు. గోవిందు తటాలున లేచి అడ్డం వచ్చాడు.

"రేయ్! మడవ తీస్తే నే నొప్పుకోను. నా పొలం పారేవరకూ తీయనంటే తీయను."

"ఒరే గోవిందూ! కాలువ మీ తాత సొత్తు కాదురోయ్!"

"మీ నాయన సొత్తుకూడా కాదురా!"

"కాదు కాబట్టే వచ్చే నీరు చెరి సగం పంచుకుందా మంటున్నాను."



"నేను విడువను; ఏం చేసుకుంటావో చేసుకో, ఫో!" ధీ మా గా అన్నాడు గోవిందు. నర్సింహులు వానివైపు ఎగాదిగా చూశాడు. అంత అహంకారంతో మాటాడుతున్నవాడు తీయడు. తామిద్దరూ కలబడి ఎందుకు చావడం? వెళ్ళి ఆసామికి చెబితే ఆయన ఏమంటాడో చూద్దామని, పార భుజంమీద పెట్టుకొని, పొలం వద్దకు తిరిగి వచ్చాడు. ఆపాటికే పేరయ్య పొలం వద్దకు వచ్చి ఉన్నాడు. పొలం ఎండిపోయి ఉంది. కాలువవెంట చుక్క నీరు రావడం లేదు. ఎదురుగా వస్తున్న నర్సింహులును చూచి "ఏరా! కాలువ వస్తున్నదా?" అని అడిగాడు.

"పైన గోవిందుగాడు కాలువకు మడవ గట్టిగా బిగించాడు. తీయమంటే తీయడం లేదు. 'మీ బాబుకూ, మీ తాతకు చెప్పుకో, ఫో!' అంటున్నాడు" అన్నాడు నర్సింహులు.

ఆ మాటలకు పేరయ్య ఆగ్రహం చెందాడు. పైనున్న కండువా చేతికి తీసుకొని విదలించి, తిరిగి భుజంమీద వేసుకున్నాడు. "రా! పోదాం రా! ఆ నా కొడుక్కు అంత మకురు ఎక్కిందేం? వాడిని కాల్వలో వేసి తొక్కితేగానీ, వాడి బాబుకు తెలివి రాదు" అంటూ పంచె పైకి పట్టుకొని ముందుకు నడిచాడు. వెనుక కర్ర చేతికి తీసుకొని నర్సింహులు నడిచాడు. సరాసరి మడవ దగ్గరికి వెళ్ళాడు పేరయ్య. ఆ పాటికి గోవిందు వెల్లికిలా పడుకుని, కూనిరాగాలు తీస్తున్నాడు. రావడంతోనే గోవిందు తలమీద కాలితో తన్నాడు పేరయ్య! గోవిందు లేచి నిలబడ్డాడు.

"లంజ నాకొడకా! క్రింద చేను ఎండిపోతుంటే, కాల్వ మొత్తం బిగించి, పైగా దబాయింపు చేస్తావురా? నా కొడకా! నీకు అడ్డొచ్చేవాడెవడో చెప్పుకో; ఫో!" అంటూ మీదపడి నాలుగు దెబ్బలు కొట్టాడు. "మడవ తీయరా!" అంటూ నర్సింహులును చూచి హూంకరించాడు. నర్సింహులు కాల్వలో దిగి, పొలంలోకి నీరు పోకుండా అడ్డువేసి, నీరు మొత్తం కాలువలోనికి మళ్ళించాడు.

"కాలువకు మళ్ళీ అడ్డం వేశావా నిన్ను కాలువలోనే తొక్కేస్తాను" అంటూ అరచి చర చరా పొలం వైపు కదిలాడు. అతనివెంట నర్సింహులుసాగాడు. గోవిందు వెంటనే ఇంటికి వెళ్ళాడు. రామన్న ఉదయం అన్నంతింటున్నాడు. రామన్నభార్య బయట పంచలో నిలబడింది. ఆమె గోవిందు ఏడుపు ముఖాన్ని చూచి విస్తుపోతూ "ఏమయిందిరా?" అంది. గోవిందు సగం ఏడుస్తూనే వివరించాడు. అన్నం తింటున్న రామన్న ఈమాటలువిన్నాడు. దిగ్గునలేచి బయటకు వచ్చాడు "ఏందిరా!" అంటూ. గోవిందు జరిగిన విషయం మళ్ళీ చెప్పాడు. రామన్న ఆగ్రహంతో పండ్లు కొరికి "నా మడవ తెంచినది కాక, నా జీతగాణ్ని కొట్టి, తిడతాడా? వాని కథ మిటో చూస్తాను. అంటూ చెయ్యి కడుక్కొని నారాయణరెడ్డి ఇంటి వద్దకు వెళ్ళాడు. ఆ సమయానికి నారాయణరెడ్డి, బలరాంరెడ్డి కూర్చుని మాట్లాడుకుంటున్నారు. రామన్న తెచ్చిన వార్తవిని కోపంతో మండిపడ్డారు.

"వాడు—ఆ పేరయ్యాగాడు ఎక్కడున్నాడట?" అడిగాడు బలరాంరెడ్డి.

"ఇంకా పొలం వద్దే వున్నాడట" రామన్న జవాబిచ్చాడు,

"ఇంకేం! దెబ్బకు దెబ్బ తీసే సరిపోతుంది" అన్నాడు అక్కడే ఉన్న వారిలో ఒకడు. మరొకడు మీసందువ్వాడు.

ఇంకొకడు కర్ర ఝుళిపించాడు, అసలు నాయకులు ఇంకా నోరు మెదపలేదు. అనుచరవర్గం కర్రలు తీసుకొని బయటకు నడిచారు. వారివెంట నారాయణరెడ్డి, బలరాంరెడ్డి కదిలారు. ఊరు దాటేవరకు చిన్నగా నడిచారు. ఊరుదాటిన కొద్ది దూరంలోనే మాగాణిఉంది. తిరిగివస్తున్న పేరయ్య కంటబడ్డాడు. కేకలేసుకుంటూ, కర్రలు పైకెత్తి అతని మీదికి ఉరికారు. రానున్న ప్రమాదం పేరయ్యకు అర్థమయింది. ఆ సమయంలో తప్పించుకో గలనన్న ఆశ అతనికిలేదు. అయినా బలంకొద్దీ ఉరకసాగాడు. కొంతదూరం ఉరికేసరికి కాలువ ఒకటి అడ్డు వచ్చింది. ఎగరడంతో అటు ఒడ్డు చేరలేక కాల్వలో పడ్డాడు. ఆ వెంటనే పొలి పొలి యని కేకలేస్తూ అతనిమీద పడ్డారు. కర్రలు పటపట మన్నాయి. ఆ కట్టెల చప్పుడులో ఆర్తనాదం విన్పించలేదు. క్రింద పడిన వాడు చచ్చాడా, బ్రతికాడా ? అని చూడకుండా, వెనుతిరిగి గ్రామంలోనికి పరుగెత్తారు.

పేరయ్య దెబ్బతిన్న విషయం కొద్ది సేపటిలోనే గ్రామమంతా వ్యాపించింది. పదిమంది వెళ్ళి పేరయ్యను ఎత్తుకొని వచ్చారు. పేరయ్య వీపు చిట్లింది; తల పగిలింది; పెదవులు పగిలాయి; దవడల మీద రక్తం కారుతున్నది, చావలేదు, చచ్చేటంత దెబ్బలు. పేరయ్యను గోపిరెడ్డి ఇంటివద్దకు చేర్చారు.అతనివర్గం అందరూ చుట్టూ చేరారు.

సరిగా అదే సమయంలో మాదిగ ఓబన్న బావమరిది అటుగా పోతున్నాడు. అతనికి ఈ పోట్లాట సంగతి తెలియదు. అతనిది ఆ వూరుకాదు. ఓబన్న చెల్లెలిని పెండ్లి చేసుకున్నాడు. చుట్టపు చూపుగా వస్తున్నాడు. అతన్ని మాదిగ సుంకడు చూశాడు. పరుగెత్తుతూ వెళ్ళి వాడిచొక్కా పట్టుకున్నాడు. మరి కొందరు తోడై వాడిని లాక్కెళ్ళి, స్థంభానికి కట్టివేసి బాద సాగారు. ఆ గ్రామ తగవులతో అతనికి ఎట్టి సంబంధంలేదు. అయినా కక్ష ! ఓబన్నను నాశనం చేయాలని సుంకడి లక్ష్యం! ఓబన్న మీద ఇప్పుడు దెబ్బ తీయలేకున్నా, దొరికిన వాడి చెల్లెలి మొగుడి మీదయినా కసి తీర్చుకోవాలి. ఆ మందిలో ఒకడు ఏం చేస్తే, మిగిలిన వారూ అదే చేస్తారు. ఆలోచించే పనేలేదు.

గోపిరెడ్డి అక్కడికి వచ్చాడు. "ఎవడు వాడు ?" అని అడిగాడు. ఎవరో చెప్పారు ఓబన్న బావమరిదియని.

"ఏమిరా మరీ తెలివితక్కువ దద్దమ్మలవుతున్నారు ? పరాయి గ్రామం వాడితో మనకు పనేముంది; వాడిని విడవండి !" అన్నాడు కోపంగా. అతని మాట మీరడం సాధ్యం గాదు కనుక, కట్లు విప్పారు. అప్పటికీ కసితీరక అతని వీపున సుంకడు కాలితో తన్నాడు. అతడు ముందుకు తూలి పడ్డాడు. లేచి పరుగు లంకించుకున్నాడు. నెత్తురు కారుతున్న శరీరంతో ఓబన్న ఇల్లు చేరేసరికి హరిజనపేట గుప్పుమంది. ఓబన్న బంధువులు మొగవాళ్ళు మీసాలు దువ్వారు. ఆడవాళ్లు గోసి చెక్కి, దుమ్మెత్తిపోస్తూ శాపనార్థాలు పెడుతున్నారు. సుంకడి ఇంటి వైపు తిరిగి ఆ కొంప నాశనం కావాలని ఏడుస్తూ తిడుతున్నారు. అటువైపు సుంకడి బంధువులు ఊరుకోలేదు. శాపానికి ప్రతి శాపం వారూ పెడుతున్నారు. వీరు దుమ్మెత్తిపోస్తే, వారు ఇసుక పైకెత్తి తూర్పారబట్టి తిడుతున్నారు. హరిజనపేట

రావణ యుద్ధానికి సిద్ధమయింది.

ఇంతవరకూ రిజర్వ్ పోలీసులకు ఈ విషయాలేవీ తెలియవు. మధ్యాహ్నం పదకొండు గంటలకే భోజనం చేశారు. ఆ రోజు గురివిరెడ్డి వర్గం వారితో రెండు కోళ్ళు తెప్పించుకుని, బిరియాని చేయించు కొని సుష్టుగా తిని కొందరు నిద్ర కుప క్రమించారు; మరికొందరు పేకాట ప్రారం భించారు. డ్యూటీలో ఉండవలసిన సెంట్రీ పేకాట ముక్కల్ని చాపమీద విసురుగా విసురుతూ, డబ్బులు వేస్తూ, తదేకంగా చూస్తున్నాడు. గ్రామంలో తిరుగవలసిన బీటు కానిస్టేబుల్ హాయిగా నిద్ర పోతు న్నాడు. గ్రామంలో ఇద్దరికి చావుదెబ్బలు తగిలి అటు – ఇటు ఆడవారు శాపాలతో మోహరించి – ఉండగా; పురుషులు కట్టెలు ఝళిపిస్తూ, మీసాలు మెలివేస్తుంటే, ఈ వార్తను ఒకడు ఎవడో పోలీసులకు చేర వేశాడు. ఆ వార్త విన్న వెంటనే– సారా యితో దిమ్మెక్కిన వారి మెదడు కొద్ది సేపు పని చేయలేదు. తెలివి తెచ్చుకుని ముక్కల్ని విసిరేసి, నిద్రపోవు వారిని తట్టిలేపి, తుపాకులు భుజాలకు తగిలించు కొని తొందరగా కదిలారు. ఆ సమయా నికే ఇరువైపులా రాళ్లు విసురుకుంటు న్నారు. ఎదురెదురుగా ఉన్న ఆంజనేయ స్వామి, రామాలయం దేవాలయాలను చాటు చేసుకొని, ఒక గుడివద్ద ఒక వర్గం; మరొక గుడివద్ద ఒక వర్గం చాటున దాక్కుంటూ రాళ్లు విసురుకుంటున్నారు. పోలీసులు వారి మధ్యకు పోవటానికి భయ పడ్డారు. కాళ్లు వణుకుతున్నాయి. ఇండ్లలో పడుకున్నవారిని తట్టిలేపి, తీసుకెళ్ళి బాద గలరు గాని ఎదురుగా నిలిచి పులుల్లాగ పోరాడేవారి మధ్యకు దూరడం వారికి సాధ్యం కాదు. కొంచెంసేపు తటపటాయిం చారు. పోలీసులను ఎవరూ పట్టించు కోలేదు; పట్టించుకోగల స్థితిలో వారులేరు. చివరకు తెగించి. హెడ్డు ముందుకు వచ్చాడు. "ఆగండి" అంటూ అరిచాడు. అతని అరుపుకు వందలమంది మారణా యుధులు ఆగుతారా? రాళ్ళ జోరు ఎక్కు వయింది. అందులో ఒక రాయివచ్చి హెడ్ కానిస్టేబుల్ మోకాలికి తగిలింది. తుపాకి క్రింద పడేసి "అమ్మా" అంటూ అరచి, కాలు పట్టుకుని కూర్చున్నాడు. పరిస్థితి ప్రమాదకరంగా తయారయినట్లు గ్రహిం చిన పోలీసులు హెడ్డుని లాక్కుంటూ ప్రక్కకు వెళ్ళారు. వారిలో ఒకడు ధైర్యం చేసి, తుపాకిలో తూటా ఎక్కించి, "మీరు వెళ్ళిపోకుంటే కాలుస్తాను" అన్నాడు పైకెత్తి. అతని మాటలు ఎవరూ వినలేదు.

'ఢాం' అంటూ తుపాకి మ్రోగింది.

ఆ చప్పుడుకు కొందరు బెదిరి ప్రక్కకు పరుగెత్తారు. నారాయణరెడ్డి అల్లుడు సాంబిరెడ్డి "ఒరేయ్! వాళ్ళకు కాల్చే అర్హత లేదురా! గాలిలోకి పేల్చుకుంటు న్నారు. ముందు వాళ్ళపని పట్టండి" అని అరిచాడు. ఇంకేముంది? శత్రువులమీద విసరవలసిన రాళ్ళు, పోలీసులమీదకు రాసాగాయి. ఇరువైపులనుండీ పోలీసుల మీదకు రాళ్ళు మరలాయి. అవి వస్తున్న వేగానికి తగిలితే అక్కడే కూలబడవల సిందే! ఇతర సమయాలలో కిలోరాయి విసరాలంటే సాధ్యం కానివాడు కూడా, ఆ సమయంలో రెండు కిలోల రాళ్ళను అవలీలగా విసురుతున్నాడు. కొందరు వడిశెలలో రాళ్ళుపెట్టి విసురుతున్నారు. మరికొందరు చిన్న చిన్న గాజు పెంకులు గుమ్మటంతో విసురుతున్నారు.

పోలీసులు హతాశులయ్యారు; భయ భ్రాంతులయ్యారు. వాళ్ళు ఉన్నది పద హారుమంది. యస్. ఐ. డ్యూటీలోలేడు. హెడ్డుకు దెబ్బ తగలడంతో స్టేషన్‌లో విడిచి వచ్చారు. అందరి దగ్గరా తుపాకు లున్నాయి. కాని అవి పేల్చడానికి కావల సిన సామర్థ్యం వారిలోలేదు. చివరకు దిక్కుతోచని పోలీసులు కాలికి బుద్ధి చెప్పారు. స్టేషన్ చేరి కర్నూలుకు వైర్ లెస్‌లో పరిస్థితి తెల్పారు. కర్నూలునుండి అదనపు బలం వచ్చేవరకూ తలదాచు కోవాలని స్టేషన్ తలుపులు బిగించారు. బయట తలుపులమీద రాళ్ళు పడుతూనే ఉన్నాయి. కేకలు, ఈలలు, అరుపులు విన్పిస్తున్నాయి. వైర్‌లెస్ తీగను, టెలి ఫోన్ లైను త్రెంచేశారు. సింహనాదాలు చేస్తూ ఎగురుతున్నారు. ఆ ఎగిరేవారిలో నాయకులు ఎవరూ లేరు. కూటి కొరకు, కష్టంచేయని బ్రతుకు కొరకు తమ భూస్వాములకోసం కర్రలు పట్టి తిరిగే పేదవారు. ఎప్పుడూ ఏదో తగవుబెట్టి, మంట ఆర్పకుండా, తద్వారా తాము నాలుగు డబ్బులు సంపాదించి వచ్చిన డబ్బుతో త్రాగి, తిని, తందానాలాడే వెర్రివాళ్ళు.

పన్నెండు గంటలకు రిజర్వ్‌దళాలు రెండు వ్యాన్లలోదిగారు-సూపరింటెండెంట్‌తో సహా. అయితే వీరు వచ్చే సమయానికే గ్రామంలో అందరూ పరారయ్యారు. గ్రామంలో మిగిలినది ఆడవారు, ముదు సలులు, పిల్లలూ మాత్రమే! శ్రీరెడ్డి, గురివిరెడ్డి, గోపిరెడ్డి గ్రామంలోనే ఉన్నారు. వారిని స్టేషన్‌కు పిలిపించారు. అంత వరకూ జరిగిన కథ వారికి తెల్పాడు సూపర్నెంటు. ఆ కథేమిటో వారికిముందే తెలుసు: కాకపోతే రంగంలో లేరు.

"ఈ గ్రామం బాగుపడాలనీ, అందరూ సుఖంగా ఉండాలనీ ప్రభుత్వం ఆశ. మీరేమో కలబడి ఛస్తున్నారు. మీరు బాగు పడదలచ లేదని ఈ సంఘటనతో అర్థమవు తున్నది. గ్రామంలోని పోలీసులు ఒకరి వైపు నిలిచి రెండవ వైపు వారిమీద దాడి చేయవలసిన పనేమీలేదు. ఇద్దరికీ రక్షణగా ఉంచాము. తమకు రక్షణగా ఉంచిన దళాలనే రాళ్ళువేసి చంప ప్రయత్నించడం ఆత్మహత్యా సదృశం! మిమ్మల్ని మీరు రెచ్చగొట్టుకోవడమేగాక ఇప్పుడు ప్రభుత్వాన్ని కూడా రెచ్చ గొట్టారు" అన్నాడు సూపరింటెండెంట్.

గురివిరెడ్డి నవ్వాడు. అది జీవంలేని నవ్వు. "సార్! మీరు, మీ పోలీసులు ఏం చేయగలరో ఇప్పుడర్థమయింది. ఉదయం ఎనిమిది గంటలనుండి గ్రామంలో పోట్లాట ఆరంభమయింది. పదకొండుగంటలదాకా గ్రామం వెలుపలా, లోపలా కూడా కల బడి కొట్టుకున్నారు. కొందరి తలలు పగి లాయి, మరి కొందరి కాళ్ళు విరిగాయి. ఈ గ్రామంలో ఇరవైమంది పోలీసులు ఉండినా మూడుగంటలసేపు పోట్లాట జరిగిందంటే అర్థమేమిటి? మీ పోలీసులు ఏం చేస్తున్నారు? బీటు కానిస్టేబుల్స్ ఏ మయ్యారు? స్టేషన్‌లో సిద్ధంగా ఉండ వలసిన మిగిలిన పోలీసు లేమయ్యారు? అసలు తప్పు మీ పోలీసులదే! గ్రామంలో వారు తిష్టవేసినది, కోడి పెట్టల కూ సారాయికే నా? వారికి ఎప్పుడూ, తిండి, త్రాగుడు, పేకాట కావాలి. వాటికోసం గ్రామంలోని పెద్దలను నయానా, పేద వారిని భయానా పీడించి తెచ్చుకుంటారు. ఇప్పుడు ఇక్కడ జరిగిన తప్పంతా పోలీసులదే! ఇటువంటి వారిని ఈ

గ్రామంలో కాపలా పెట్టి, పల్లె నాశన మవుతుంటే బాధ పడడానికి బదులు మా మీద విరుచుకు పడితే మేం చేసేదేముంది? రెండు వైపులా రాజీ కొరకు నేనూ, నా అల్లుడు శ్రీరెడ్డి ప్రయత్నిస్తున్నాం. అయినా కుదరలేదు. మీ పోలీసులవల్ల అసలిక్కడ రాజీ కుదరదు. దయచేసి మీ తప్పును మీరు సరిదిద్దుకోండి."

గురివిరెడ్డి వాగ్ధాటికి సూపర్నెంట్ అవాక్కయి పొయ్యాడు.

అతని వాదనలో ఒక విషయం అర్థ మవు తున్నది. తమ ముందున్న గోపి రెడ్డిని గురించి అతడు మాట్లాడడం లేదు. కేవలం తనూ, తన అల్లుడే శాంతి దూతలుగా మాట్లాడుతున్నాడు.

స్థానిక పోలీసులమీద చర్య తీసు కొనడం ముందు ముఖ్య విషయమని సూపర్నెంటు నిర్ణయించు కున్నాడు. ఆ సమయంలో డ్యూటీలో ఉన్నవారిని వెంటనే సస్పెండ్ చేశాడు. మొదటే వాళ్ళు తగిన జాగ్రతలో ఉండి, తగిన చర్య తీసుకుని ఉంటే, ఇంత జరిగేది కాదని అభిప్రాయ పడ్డాడు.

కేసు నమోదు చేశాడు.



14

పంచాయతీ ఎలక్షన్లు ఆరంభమవు తున్నాయి. పగ, ద్వేషాల్ని మరింత రెచ్చ గొట్టేవి పంచాయతీ ఎన్నికలే!

పంచాయతి సమితి అధ్యక్షుడు నారా యణ. జరుగనున్న ఎన్నికల్లో సమితి అధ్యక్ష పదవి నారాయణకు లేకుండా చేయాలని సిద్ధారెడ్డి ప్రయత్నాలు ఆరం భించాడు.

తన తమ్ముడు నరసారెడ్డికి ఆ పదవి లభించేలా చూడడం అతని లక్ష్యం! అందుకే సమితి ఏరియాలోని అన్ని గ్రామ పంచాయతీల్లో తన వర్గాన్ని కూడగట్టు కుంటున్నాడు. పైడి పల్లెలో గురివిరెడ్డిని తన వర్గంలో చేర్చుకునే శక్తి నారాయణకు లేదు. గురివిరెడ్డి, సిద్ధారెడ్డి దగ్గరి బంధువులు. అందువల్ల అటువైపే గురివిరెడ్డి వర్గం ఉంటుంది. ఇంతవరకూ ఆ గ్రామంలో గురివిరెడ్డి గెలిచింది కూడా లేదు.

పంచాయతీ ఏర్పడినప్పటినుండి మూడుసార్లు ఎన్నికలు జరిగాయి. చెంచు రెడ్డే గెలిచాడు. అందువల్ల గురివిరెడ్డిని ఆకట్టు కొనుటకు ప్రయత్నించడం వల్ల జరిగేదేమీ లేదని నారాయణకు తెలుసు. శ్రీరెడ్డిని ఆకట్టుకునే అవకాశం లేదు. అతను మామకు అనుకూలంగా ఉంటు న్నాడు. అతడు పోటీకి నిలబడడు. కాబట్టి, గోపిని తన వర్గంలో చేర్చు కొనుటకు ప్రయత్నం చేయడం మంచిదని నిర్ణయించుకుని గోపి ఇంటికి వచ్చాడు.

ఆ సమయానికి గోపిరెడ్డి మంచంమీద కూర్చుని ఉన్నాడు. అతని చుట్టూ అను చర, సహచర వంధిమాగధులు కూర్చుని కబుర్లాడు కుంటున్నారు. నారాయణ జీపు బయట నిలబడుతూనే, మర్యాద పూర్వ కంగా లేచి, ఎదురు వచ్చాడు గోపిరెడ్డి. నారాయణ నవ్వుతూ అతని భుజం

తట్టి "బాగున్నావా రెడ్డీ?" అంటూ పలుకరించాడు.

గోపిరెడ్డి నవ్వుతోనే సమాధానమిచ్చాడు. అందరూ కూర్చున్నారు.

"చాలా రోజుల తరువాత వచ్చారు; ఏమిటి విశేషాలు" అన్నాడు గోపిరెడ్డి.

"ఆఁ! అప్పుడు సంధి చేయడానికి వచ్చాను. తర్వాత రాలేదు. అది తిరిగి రంధిగానే మారిందని విన్నాను; నిజమేనా?"

"రంధి ఏమిటండీ? ఆ రోజే నేను ఇష్టపడలేదు కదా! మా తండ్రిని చంపించిన వారితో నాకు సంధి ఏమిటి?"

"మీ అన్నయ్య ఎటు నిలిచాడు?"

"ఆయన ఎటు నిలిచినా, ఆయనతో నాకు పనిలేదు. నా ఆస్తి నేను తీసుకుని పక్కన ఉన్నాను."

కాఫీలు వచ్చాయి. ఒక బకెట్‌తో తెచ్చి అందరికీ పోశారు. వీరికి కూడా చెరొక గ్లాసులో పోసి ఇచ్చారు. గోపిరెడ్డి పద్ధతి అది. అక్కడ అందరూ సమానమే! అందరితోపాటు తాను తిని, తాగుతాడు. కాని స్పెషల్ భోజనాలు, డ్రింకులు అలవాటున్న నారాయణకు ఈ కాఫీ నచ్చలేదు. అయినా తను వచ్చిన పని నెమరు వేసుకుని, విషంలాగే అయినా మింగాడు. తర్వాత అసలు విషయానికి దిగాడు.

"పంచాయతీ ఎలక్షన్‌లు వచ్చాయి. విన్నావా రెడ్డీ?" అన్నాడు నారాయణ.

"వినేదేందయ్యా! ఈ గ్రామంలో మా దెబ్బకు ఇంతవరకూ ఎదురు లేదు. మా రెడ్డి పోటీ చేస్తాడు. గెలిచి తీరతాం" మీసం దువ్వుతూ అన్నాడు సుంకడు.

నారాయణ నవ్వాడు. బాబూ! నీకు తెలియదు. మీ రెడ్డికి పంచాయితీలో పోటీ చేసే హక్కు లేదు. ఇరవై ఒక్క సంవత్సరం నిండిన వయస్సు గలవారికే ఓటు హక్కు ఉంటుంది. ఓటు హక్కు ఉన్నవారికే పోటీచేసే అర్హత ఉంటుంది"

"ఇరకాటంలో పడ్డామే!" అన్నాడు పీరడు.

"నీ ఉద్దేశమేమిటి రెడ్డీ?" అడిగాడు నారాయణ.

"పోటీ చేస్తాం. ఎవరిని పోటీ నిలుపాలా అనేదే సమస్య"

"పోనీ కరణం మీ మనిషే గదా! అతనిని నిలుపవచ్చు కదా!"

భూమయ్య కాండ్రించి తుపుక్కున ఊశాడు. "ఆ వెధవ, ఆ దగుల్బాజీని ప్రెశిడెంటును చేస్తామా? ఛా ఛా! మాకు సిగ్గుండొద్దూ! భస్సే చేయం" అన్నాడు.

"బాబూ! కరణం పీడ మాకు పెద్దదయింది. పైసా ఖర్చు పెట్టడు. తన ఇంటి చుట్టూ కర్రలతో కాపలా ఉండాలంటాడు. ఈగ వాలితే బెదిరిపోతాడు. ఒట్టి పిరికిపంద. అటువంటి వాళ్ళకు గ్రామ నాయకత్వం ఇస్తే మా వర్గం నాశనమవుతుంది" అన్నాడు పేరయ్య. ఇంకా కట్లతోనే ఉన్నాడతడు.

"పక్కవాళ్ళెందుకు? మా మల్లారెడ్డి ఉన్నాడు. గోపిరెడ్డి బాబాయి. ఆయన అయితే మా అందరికీ ఆమోదమే! ఆయనే ఈ గ్రామానికి ప్రెశిడెంటు కావాలి" అన్నాడు భూమయ్య.

నారాయణ గోపి ముఖంలోనికి చూశాడు. అతని ముఖంలో వారి మాటలకు ఆమోదం తెలుపుతున్నట్లే ఉంది.

"మరి ఆయనను పిలిపించి మాట్లాడమంటావా?" అన్నాడు నారాయణ.

"వద్దు; ఆయన ఇంటికే వెళ్దాం పదండి" అంటూ గోపిరెడ్డి లేచాడు.



అతని వెంట అందరూ లేచారు. నాలుగు ఇండ్ల ఆవల ఉన్న మల్లారెడ్డి ఇంటికి వెళ్ళేసరికి, ఆయన నిద్రపోతున్నాడు. ఆయన కొడుకు నాగిరెడ్డిలేపాడు. అందర్నీ వచ్చి బయట సోఫాలో కూర్చున్నారు. అంతవరకూ జరిగిన వివరాలు చెప్పి "మీరు పోటీచేస్తే బాగుంటుంది" అన్నాడు నారాయణ. మల్లారెడ్డి తల అడ్డంగా త్రిప్పాడు.



"నాకీ రాజకీయాలు వద్దండీ! గ్రామ రాజకీయాల్లో నేను కలుగ చేసుకోదలచుకోలేదు. గోపిరెడ్డికి నాకు చేతనయిన సాయం చేయగలను. ఇప్పుడు మా వర్గంలో వాడే ముందున్నాడు. అందువల్ల వాడితోనే ఆలోచించి, మరొకరిని నిర్ణయించండి. నా సహకారం ఇస్తాను. నేను మాత్రం ఈ గ్రామ తగాదాల ఊబిలో దిగను."

మరి కొంతసేపు ఆయనను బలపరచ చూసి, సాధ్యం కాదని నిర్ణయించుకున్నార

లేచారు. నారాయణ జీపులో ఎక్కుతూ "నీ ఇష్టమేమిటి రెడ్డీ ?" అన్నాడు.

"పోటీ చేస్తాం! వచ్చిన చిక్కు నాకు అర్హత లేక పోవడం. అందువల్ల మరొకరిని చూస్తాను. మా అన్న రాంరెడ్డిని అడుగుతాను. ఆయనకు పాతికేండ్ల వయసుంది" అన్నాడు.

"మాట్లాడుదామా ?"

"వద్దు. ఆయనతో నేను మాట్లాడుతాను. మీరు వెళ్ళండి. పోటీ మాత్రం తప్పదు" అన్నాడు గోపి రెడ్డి. నారాయణ వెళ్ళాడు. డబ్బు అవసరమైతే తెలుపమనీ, మొహమాటం వద్దనీ చెప్పాడు.

గురివిరెడ్డి పోటీకి నిలబడదలచుకున్నాడు. అన్నపూర్ణమ్మ, పార్వతి, ఆయనకు ఎంతో చెప్పి చూశారు; బ్రతిమలాడారు; గోపిని ఇంకా రెచ్చగొట్ట వద్దన్నారు. అందువల్ల పరిస్థితులు మరీ విషమింపుతాయని మరీ మరీ చెప్పారు. గురివిరెడ్డి ఒప్పుకోలేదు. "కావాలంటే గోపిగాణ్ని నిలబడమను. నేను మానుకుంటాను. ఎవరినో ప్రెశిడెంటును చేయాలంటే నేను ఒప్పుకోను" అన్నాడు.

గోపికి ఆ అర్హత లేదని గురివిరెడ్డికి తెలుసు. అర్హత లేకున్నా పోటీ చేయిస్తున్నాడంటే తన మీద కక్షతోనే. కాబట్టి తాను తగ్గడమంటే, తన మర్యాద మంట గలుపుకోవడమే ! శ్రీరెడ్డి తమ్ముని వైపు ఇప్పట్లో పోలేడు. శ్రీరెడ్డిని అనుసరించే కొందరి ఓట్లు తనకు పడడమో! తటస్థంగా ఉండడమో జరుగుతుంది. ఆ విధంగా గెలుపు సులభమేనని ఆయన విశ్వాసం.

నామినేషన్ దాఖలుచేసే తేదీ వచ్చింది. గోపిరెడ్డి తరుపున రాంరెడ్డి ఒక వార్డుకు పోటీ చేస్తున్నాడు. కాబోయే ప్రెశిడెంటు అతడేనని అంతరూ అనుకున్నారు. మొత్తం ఏడు వార్డులు; పద్నాలుగు మంది పోటీ! రాంరెడ్డికి పోటీగా నిలబెట్ట బడ్డ అభ్యర్థి అనామకుడు. అదీగాక రాంరెడ్డి అనుచరులు ఓట్లున్న ప్రాంతమది. గురివిరెడ్డి నిలిచిన వార్డు పరిస్థితి అంతే! వారిద్దరూ గెలవడం ఖాయమే. మిగిలిన ఐదింటిలో భారీ పోటీ! హరిజన సీటుకు పోటీ మరీ భయంకరమైనది. ఓబన్న గురివిరెడ్డి వర్గం; నాగడు గోపిరెడ్డి వర్గం. శ్రీరెడ్డికి అనుకూలురయిన వారిని విడిచి పెడితే, మిగిలిన ఓట్లలో సమానస్థాయిలో ఉన్నాయి. చెంచురెడ్డి హయాంలో, నాగడి తండ్రి ఆ వార్డుకు సులభంగా గెలిచేవాడు. ఇప్పుడు శ్రీరెడ్డి చీలికవల్ల ఓట్లు తారుమారయ్యాయి. శ్రీరెడ్డి ఎటూ చెప్పలేక పోతున్నాడు. తండ్రి వైపు నిలబడమని పార్వతి, గోపిని రెచ్చగొట్ట వద్దని అన్నపూర్ణమ్మ చెబుతున్నారు. శ్రీరెడ్డి ఏమీ తేల్చలేక పోతున్నాడు. ఎటువైపూ పోకుండా ఉందామంటే, అప్పుడు రెండు వైపులా చెడ్డ కావలసి ఉంటుంది. మే 28 పోలింగ్! అదే రోజు సాయంత్రం ఐదు గంటల నుండి లెక్కింపు; ప్రెశిడెంటు ఎన్నిక. ఇరువైపులా ముమ్మరంగా ప్రచారం చేసుకున్నారు. అటు సిద్ధారెడ్డి రాయబారులు, ఇటు నారాయణ రాయబారులు వచ్చి పోతున్నారు. గ్రామంలోని పోలీసు దళాలకు, అతి జాగ్రత్తగా ప్రవర్తించమని సూపర్నెంటు నుండి మాటిమాటికీ ఆదేశాలందుతున్నాయి. అందువల్ల పోలీసులు అప్రమత్తతో తిరుగుతున్నారు.

పోలింగు హైస్కూలులో పెట్టారు. ఆడవారికి ప్రత్యేకంగా పోలింగు ఏర్పాటు చేశారు. వార్డుకు దాదాపు నూటా ఇరవై ఓట్లు. అందులో సగం ఓట్లు ఆడ




వారివి. ఆ అరవై ఓట్లకే ఆడవారికి ప్రత్యేక బూత్‌లు ఏర్పాటు చేశారు. పొరపాటు నయినా ఒకడి భార్యను మరొకడు తాకితే, అక్కడికక్కడే తెగబడి పొడుచుకు చస్తారని ఆఫీసర్లకు తెలుసు. అందువల్ల శ్రమ అయినా మంచిదేనని ఆ విధంగా ఏర్పాటు చేశారు.

పోలింగు రోజు వాతావరణం ఉద్రిక్తంగా తయారయింది. సారాయి అమ్మకుండా నిషేధించారు. అయినా ఇండ్లల్లో దబ్బాలతో స్టాకు ఉంటే దుకాణాల్లో ఎవరు తాగుతారు?

గోపిరెడ్డి వర్గం ఈ సమయంలోనే పథకాలు వేసుకున్నారు. గురివిరెడ్డి తమ చేతికి దొరికితే చంపాలని వారి పథకం! అది అత్యంత కట్టుదిట్టంగా కొందరికి మాత్రమే తెలుసు. కరణాన్ని వీరు సమ్మరం లేదు. కరణం కూడ మునుపు ఉన్నంత ఉత్సాహంతో కార్యక్రమాలలో పాల్గొనడంలేదు. తనకు వారి స్థాయిలో నాయకత్వం దొరకదని తేల్చుకున్నాడు. అందుకే తగ్గి ప్రవర్తిస్తున్నాడు.

పోలింగు బూత్ వద్ద క్యూ నిలబడింది. పిల్లలు తప్ప ఇండ్లవద్ద ఎవరూ లేరు. ఎవరిఓట్లు ఎవరివో తెలుసుగనుక, తమ వారిని ఉదయమే పోలింగ్ వద్ద నిలిపారు. అటూఇటూ ఊగిసలాడుతున్న శ్రీరెడ్డి మనుషులు ఇంకా పోలింగ్ దగ్గరికి చేరలేదు. శ్రీరెడ్డి ఆ రోజు బయటకు రాలేదు; అన్నపూర్ణమ్మ రానివ్వనూలేదు. రాంరెడ్డి యస్.ఐ. వద్దనే ఉన్నాడు. గోపిరెడ్డి పథకానికి ప్రతిగా గురివిరెడ్డి వర్గం పథకం వేసుకున్నారు.

పోలింగ్ ఆరంభమయి ముమ్మరంగా జరుగుతున్న సమయంలో, హరిజనవాడలో మంటలు లేచాయి. కొంచెం సేపటిలోనే పోలింగ్ బూత్‌వద్ద అల్లకల్లోలం ఆరంభమయింది. అందరూ హరిజన వాడవైపు పరుగిడుతున్నారు. మరికొందరు అక్కడే రణగొణ ధ్వనితో కలబడడానికి తయారయ్యారు. పది మంది పోలీసులు హరిజనవాడ వైపు పరుగెత్తారు. మిగిలిన వారు బూత్‌లవద్ద కలబడే వారిమీద లాఠీఛార్జి చేస్తున్నారు. కొందరిని అరెస్ట్ చేశారు.

పోలింగ్ రసాభాసగా తయారయింది. గోపిరెడ్డి, రాంరెడ్డి అందరూ హరిజన వాడకు వెళ్ళారు.

కర్నూలుకు ట్రంకాల్ చేశారు. అదనపు పోలీసు సిబ్బందినీ, అగ్నిమాపక శకటాన్ని పంపుతున్నట్లు తెల్పారు అక్కడినుండి!

పోలింగ్ గల్లంతు కావడమంటే తాము ఓడిపోవడమేనని, గోపికి దాదాపు అర్థమయింది. నిప్పుపెట్టబడ్డ మొదటి గుడిసె నాగడిది. ఆ తర్వాత వరుసగా కాలినవి అతడి వర్గంవారివే! రెండు గంటలకు అగ్నిమాపక శకటం వచ్చింది; మంటలను ఆర్పివేశారు. పోలింగ్‌ను రద్దుచేసి వాయిదా వేయవలసిందిగా రాంరెడ్డి కోరిన కోరికను అధికారి తిరస్కరించాడు. దాదాపు యాభై శాతం పైగా పోలయ్యాయి. గనుక, తిరిగి జరిపే ప్రసక్తి లేదన్నాడు. ఐదు గంటలకు లెక్కింపు ఆరంభమయింది. అర్ధగంటలో ఫలితాలు తెలిశాయి. ఏడు సీట్లలోనూ, రాంరెడ్డి పోటీ చేసిన సీటు తప్ప శక్కిన ఆరు సీట్లు గురివిరెడ్డి వర్గానికి వచ్చాయి.

ఈ ఎలెక్షన్‌తో అసలే బేజారయిన అన్నపూర్ణమ్మ ఫలితం వార్త విన్న తరువాత మరింత కృంగిపోయింది. వాళ్ల

పిల్లలు. అసలే ఆవేశాలు; కక్షలు. ఈ ఓటమితో వారు ఇక ఎంతవరకయినా తెగించి నిలబడతారని ఆమె ఆవేదన. పోలీసు బందోబస్తు గ్రామమంతటా ఏర్పాటు చేశారు. 144 సెక్షన్ గ్రామంలో వారం రోజుల వరకూ విధించారు.




ఎలెక్షన్ గొడవ ముగిసింది. గ్రామం తిరిగి ప్రశాంత పరిస్థితికి వచ్చింది. రిజర్వు దళాలు గ్రామంలో కట్టుదిట్టంగా ఉండడంతో గొడవలు సాగడం లేదు. అప్పుడప్పుడు పోలీసాఫీసర్లు, రెవెన్యూ అధికారులు వచ్చి పరిస్థితి పరిశీలించి వెళుతున్నారు.

శ్రీరెడ్డితో అటు ఇటు కూడా సంబంధాలు తెగిపోయాయి. తమ్ముండ్లు ఓడిపోయారన్న వార్త అతనికి బాధ కలిగించింది. ఓటింగులో తన అనుచరుల ఓట్లు తమ్ముండ్లకే వేయమని చెప్పాడు.అయినా మోసం జరిగింది. వారు ఓడిపొయ్యారు. అందువల్ల గురివిరెడ్డితో సరిగా సంబంధాలు పెంచుకోవడం లేదు. అతని చూపు తమ్ముండ్ల వైపు తిరుగుతుందని గురివిరెడ్డికి కూడా తెలుసు. ఇక సంధి సాధ్యం కాదనే గురివిరెడ్డికి అర్థం అవుతున్నది. రాంరెడ్డి, గోపిరెడ్డి అన్నతో మాట్లాడడం తగ్గించారు. క్రమక్రమంగా ఒకరి మీద ఒకరికి అనుమానాలు ఏర్పడుతున్నాయి. గ్రామంలో గోపిరెడ్డి వర్గం పంచాయతీలో పడిపోవడమే గాదు, సమితి స్థాయిలో ఒకే ఒక ఓటుతో నారాయణ కూడా పడిపోవడం జరిగింది. మునుపటిలా ఆవేశాలు బహిరంగంగా చెప్పుకునే స్థితిలో లేరు. పోలీసు బందోబస్తు చాలా జాగ్రత్తగా ఉంది.

శ్రీరెడ్డి ఇంటిలో పరిస్థితి కూడా ఏమంత కలుపుగోలుగా లేదు. అన్నపూర్ణమ్మ ముభావంగా ఉంటున్నది. పార్వతి మీద ఒక విధమైన న్యూనతా భావం శ్రీరెడ్డికి ఏర్పడుతున్నది. శ్రీరెడ్డి ప్రవర్తన ఆమెకు బాధాకరంగా పరిణమిస్తున్నది. సంధిపోయి, రంధి ఆరంభమయింది. ఇంతవరకూ సంధి వైపే చూస్తున్న శ్రీరెడ్డి పంచాయతీ ఎన్నికలలో కూడా పాల్గొనకుండా తటస్థంగా ఉన్నాడు. అవి సక్రమంగా జరిగి ఉంటే అతని భావం ఎలా ఉండేదో గాని, వక్రంగా ఎన్నిక ముగియడం అతనికి బాధ కలుగచేసింది.ఆ ఎన్నికలలో తన తమ్ముడు ఓడిపోవడం మరింత బాధ! దానితో గురివిరెడ్డి మీద కినుక, అసహ్యం ఏర్పడింది. ఆ విధంగా అతనుకూడా సంధికిదూరంగా జరుగుతున్నాడు. ఇంకొకవైపు సోదరులను కలవడం సాధ్యం కావడం లేదు. ఇంతవరకూ ఎడ ముఖం పెడ ముఖం పెట్టుకున్న వారితో అంత తొందరగా కలిసి సర్దుకోవడం సాధ్యం కావడంలేదు. అయినా తనమీద విశ్వాసముంచి తిరిగే వారిని, గోపిరెడ్డితో కలిసి తిరుగమని చెబుతున్నాడు. ఆ విధంగా తానుకూడా ఈ పోట్లాటలో భాగం పంచుకుంటున్నానని ఆచరణ ద్వారా చెప్పగలుగుతున్నాడు.

ఈ పరిస్థితి పార్వతికి బాధాకరంగా తయారయింది.ఆమె ఆ యింటికి వచ్చింది




రాజీ పథకం మీద కాని, అది విఫలమవు తున్నది. రాజీ విఫలమయిన తరువాత, ముప్పై సంవత్సరాల క్రిందట తనమేనత్త ఏ విధంగా పుట్టింటికి దూరమయిందో, తన పని అంతే అవబోతున్నది. చివరకు తన మేనత్త గతి తనకూ తప్పదేమో! ఆలోచించి, చివరకు ఒకరోజు పుట్టింటికి వెళ్లింది. ఈ మధ్య ఆ యింటికీ, ఈ యింటికీ రాకపోకలు, ఆప్యాయతలు తక్కువయ్యాయి. పుట్టింటికి వెళ్తున్నానని శ్రీరెడ్డికి గాని, అత్తకు గానీ తెలుప కుండానే వెళ్ళింది. వెళ్ళేటప్పటికి గురివి రెడ్డి ఇంట్లో లేడు. కూతురిని ఆహ్వానిం చింది తల్లి నీలమ్మ! తల్లిని చూస్తూనే ఆమెకు అమితంగా దుఃఖం వచ్చింది. నీలమ్మ పరిస్థితీ అంతే! వారిద్దరూ కలుసు కొనక ఇరవై రోజులవుతున్నది.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం. ఎవరు, ఏ విషయం గురించి ముందు కదలించాలో తెలియక మధన పడుతున్నారు. సరిగ్గా ఆ సమయంలోనే పార్వతి చెల్లెలు నాగమణి స్కూల్ నుండి ఇంటికి వచ్చింది.పార్వతిని చూసి "అక్కా"అంటూ బిగ్గరగా అరుస్తూ వచ్చి ప్రక్కన కూర్చుంది. "ఏమే! ఇంటికి రావడమే తగ్గించావ్! బావ ఏమ యినా అలిగాడా?" అంది కొంటెగా.

ఇంకో సమయంలో అయితే పార్వతి కూడా కొంటెగానే సమాధానమిచ్చేది. కాని, ఆ సమయంలో ఆమెపరిస్థితి సరిగా లేదు. తను వచ్చిన పనివేరు; తనకున్న బాధలు వేరు. అయినా తన బాధ కన్పించ కుండా నవ్వి, నాగమణి తలమీద చెయ్యి వేసి నిమురుతూ "బాగా చదువు తున్నావా?" అంది.

"బాగా ఏమిటి? ఈ ఇంటిలోని వారెవ్వరూ ఇంతవరకూ పరీక్షల్లో ఓడి పోవడం జరుగలేదు. ఇకముందు జరు గదు" బండగుద్ది చెప్పింది నాగమణి సగర్వంగా.

నిజజీవితాల్లో పూర్తిగాఓడిపోతున్నాం అనుకుంది పార్వతి. తన పుట్టిల్లు పైస్థాయిలో ఉండాలని ఆమె ఉద్దేశం.

నాగమణి పుస్తకాలు తీసుకొని లోప లికి వెళ్ళింది.

"నాన్న ఎక్కడికి వెళ్ళాడమ్మా?" అంది పార్వతి నీలమ్మ వైపు చూస్తూ.

"ఊరిలోనే ఉన్నాడే! ఇంకా ఉదయం అన్నం కూడా తినలేదు. తొందరలోనే రావచ్చు!"

"ఇదేంటమ్మా! మళ్ళీ వీళ్లు - వాళ్ళు ఎదురీత వేస్తున్నారు. నన్ను ఆ ఇంటికి పంపించింది ఎందుకు? మళ్లీ వీరు మూతా తగాదాలు పెట్టుకొని నన్ను బాధ పెట్ట డానికా?" పార్వతి కంట తడిపెట్టింది. నీలమ్మ పార్వతి వీపు నిమురుతూ కూర్చున్నది.

"ఇది ఆర్పినా ఆరే పగకాదే! నీ మేనత్తను ఆ యింటికి ఇచ్చి గొంతు కోశారు. నీ బ్రతుకూ అంతే అవుతుందని, ఆ యింటికి పంపడం ఇష్టంలేక నేను వ్యతిరేకించాను. అయినా మీ నాన్న విన లేదు. ఇప్పుడు నీ గొంతు కోస్తున్నారు" నీలమ్మ కంఠం రుద్ధమయింది. దుఃఖంతో. పార్వతి ఏడుస్తున్నది.

"అమ్మా!నీఅల్లుడు మారిపోతున్నాడే! మునుపున్నంత సఖ్యతలేదు. ఏ విషయం కదిపినా చిరాకు పడుతున్నాడు. తమ్ముం డ్లనుగురించి, వారితో కలిసి పోవడం గురించి తల్లితో ఆలోచిస్తుంటాడు. ఎప్పు డయినా నాన్న గురించి ప్రసక్తి వచ్చినా 'అతగాడొక మోసగాడు. మోసంచేసి గెల్చే పెద్దమనిషి' అంటూ హేళనచేస్తుంటాడు.

నా మనస్సుకు వారు మాట్లాడే మాటలు ఈటెలపోటుల్లాగ ఉంటున్నాయి. నాన్న ఎందుకిట్లా వైరానికి తలపడుతున్నాడు? కనీసం నన్ను చూసి అయినా, నా బ్రతుకును బాగుపరచడానికయినా, నాన్న శాంతంగా ఉండలేడా?"

"ఇంకెక్కడిది శాంతమే! నీ అన్నగార్లిద్దరూ నారాయణరెడ్డిని ముందు నిలిపి, వెనుక నాటకాలాడుతున్నారు. ఆ నారాయణరెడ్డి ఎప్పుడూ కయ్యానికి కాలు దువ్వుతూ తిరుగుతుంటాడు. మీనాన్నకూ వారిని అనుసరింపక గత్యంతరంలేదు. నేనిప్పుడు ఈ కయ్యాన్ని గురించి ఆలోచించడంలేదు. నాశనమయ్యే నీ బ్రతుకు గురించే ఆలోచిస్తూ కుమిలిపోతున్నాను. నీ తండ్రికి చెప్పే ధైర్యం నాకులేదు. మనసులోనే కుమిలుతూ చావలేక బ్రతుకుతున్నాను."

గురివిరెడ్డి రాకతో వారి సంభాషణ తెగిపోయింది. "ఎప్పుడొచ్చావ్ పారూ?" అన్నాడు కుర్చీలో కూర్చుంటూ. నీలమ్మ లోపలకు వెళ్ళింది: పార్వతి కుర్చీ లాక్కొని తండ్రి దగ్గరగా కూర్చుంది. ఏ విధంగా తండ్రి ముందు ఆ ప్రసక్తి ఎత్తాలో ఆమెకుతెలియడంలేదు. చిన్నప్పటి నుండి తండ్రిని పులిగానే చూస్తున్నది:

"ఆరోగ్యం బాగుందా?" తిరిగి ప్రశ్నించాడు. పార్వతి తలూపింది.

"నాన్నా" అంది చిన్నగా వినీ విన్పించనంతగా! గురివిరెడ్డి ఆమెవైపు చూస్తున్నాడు: సంవత్సరం క్రిందట పరికిణీ ఓణీలతో తిరిగిన పార్వతి ఇప్పుడు నిండుగా పెద్ద ముత్తైదువులా మెరిసిపోతున్నది. ఖరీదైన పట్టుచీరతో వెడల్పాటి కుంకుమబొట్టుతో, మెరిసిపోతున్న వెండి జరీజాకెట్‌తో, చాలా అందంగా, నమ్రతగా పెద్ద మనిషిలా కనిపిస్తున్నది.

"చెప్పమ్మా!" అన్నాడు అనునయంగా ఆమె వైపు చూస్తూ.

"నా జీవితం నాశనమవుతున్నది నాన్నా!" అంది ఏ విధంగా చెప్పాలో తెలియక తికమక పడుతూ.

"ఏమయింది?"

"మీ అల్లుని ప్రవర్తన మారుతున్నది. పంచాయతి ఎన్నికల వరకూ మీతో కలిసి తిరిగాడు. నేడు మీరంటే క్రోధంతో మండి పడుతున్నాడు. నా పుట్టింటి గురించి, అక్కడ మాట్లాడడానికి లేదు. సోదరుల వైపు చిన్నగా సాగుతున్నాడు. తిరిగి మీరూ మీరూ కలియబడి పోట్లాడుకుంటే మధ్యన నా గతేమిటి? నా జీవితం బాగుపడేదేమిటి?" పార్వతి కళ్ళనుండి నీళ్ళు కారుతున్నాయి.

గురివిరెడ్డి నొచ్చుకున్నాడు. పార్వతిని ముద్దుగా పెంచుకున్నాడు. పార్వతంటే అతనికి అమితమైన ప్రేమ. అయినా ఈ సంధి కొరకు పార్వతి జీవితాన్ని తానే ఒడ్డాడు. పార్వతికి ఎట్టి బాధా లేకుండా చేయగలననుకున్నాడు. కాని, సాధ్యం కాలేదు. హరిజన పేటకు నిప్పు పెట్టమని తాను చెప్పలేదు. అది నారాయణరెడ్డి పథకం! పరిస్థితులు ఈ విధంగా తయారవుతాయనుకుంటే తను పోటీ చేయకపోవును; తీరా అంతా అయిన తరువాత అధ్యక్ష పదవికి రాజీనామా చేస్తాననడం తెలివి తక్కువతనమటుంచి, తన జీవితానికి కళంకమే అవుతుంది. గోపిరెడ్డిని ఏదో ఒకటి చేయాలని కొడుకు లిద్దరూ ఆవేశపడుతున్నారు. ఈ రాజీకి చిచ్చుపెట్టింది గోపిరెడ్డి. అతన్ని ఎలాగయినా నాశనం చేయాలని వీరి పథకం! గోపిరెడ్డికి




అపాయం జరిగితే ఇక శ్రీరెడ్డితో రంధి తప్పదు. ఆ విషయం గురివిరెడ్డికి తెలుసు. అందువల్ల అల్లుడి మనసు నొప్పించకుండా ఉండడానికి ప్రయత్ని స్తున్నా, తన వెనుక ఉన్నవారి ఆలోచ నలు వేరుగా ఉన్నాయి. గోపిరెడ్డిని నాశనం చేస్తే శ్రీరెడ్డి ఏమీ చేయలేడు. రాంరెడ్డి చేత అసలేమీ కాదు. గనుక సింహంలాగు నిలబడిన గోపిరెడ్డిని కూల్చాలని పథకాలు వేశారు. ఆ విషయాలు గురివిరెడ్డికి తెలుసు. వారిని మందలిస్తున్నాడు. వారు తనమాట వినీ విననట్లు ప్రవర్తిస్తున్నారు. ఈ స్థితిలో శ్రీరెడ్డితో తనకున్న సఖ్యత చెడుతుందని తెలుసు. కానీ, తానేమి చేయగలడు? తాను నిస్సహాయుడినని కూతురికి చెప్పుకో గలడా ?

"ఏం నాన్నా పలుకవు ?" పార్వతి తండ్రి ముఖంలోకి చూస్తూ అడిగింది. నీలమ్మ వచ్చింది. క్రింద చాప వేసుకొని కూర్చుంది. చాలా సేపు గురివిరెడ్డి పలుక లేదు.

"మీ అత్త ఏమంటున్నది?" అన్నాడు తుదకు.

"అనేదేముంది ? 'సఖ్యతగా ఉంటా రని నా భర్త చనిపోయిన రెండు రోజు లకే రాజీకి ప్రయత్నించాను. ఆ రాజీ నా గోపిని నాకు కాకుండా దూరం చేసింది. వాడు లేకుండా నేను బ్రతుక లేను' అంటుంది. ఆమెకు గోపి మీద విపరీతమైన ప్రేమ. ఆ దిగులుతోనే సగం చిక్కిపోయింది. గోపితో కలిసి నిలబడమని పెద్ద కొడుకుతో పోరు తున్నది. ఒకవైపు రాజీ విఫలం కాకుండా చూడమని చెబుతూ, విఫలమయితే గోపికి అండగా ఉండమంటున్నది. ఆమెకు తన కొడుకుల మీదున్న ప్రేమలో ఒకశాతం కూడా పుట్టింటిమీద లేదు ఇప్పుడు. ఆయన కూడా మారిపోతున్నాడు. మీ అందరి మధ్యా నేనున్నాను. నా జీవితం మల్లెపువ్వులాగ వికసించి, ఆనందంగా గడుస్తుందని నీవు ఆరోజు హామీ ఇచ్చావు. మరి ఈరోజుకు పరిస్థితి ఇట్లా అయింది" అంది పార్వతి.

"పారూ ! సాధ్యమయినంత వరకూ రాజీ చెడకుండానే చూస్తాను. చెడితే నేను చేసేదేమీ లేదు. కాని, ఒకందుకు నేను బాధ పడుతున్నాను. రాజీ పథకంలో మా నాన్న నా చెల్లెలి గొంతు నులిమాడు. ఈ రాజీ విఫలమయితే.."పార్వతి కళ్ళల్లోనికి చూస్తూ ఆ తర్వాత మాట్లాడలేక తల పక్కకు తిప్పుకున్నాడు.

"విఫలమయితే నా గొంతు నులిమి నట్లే కదా నాన్నా ?" పెద్దగా అరచింది పార్వతి. "మీ రందరూ కలిసి మా గొంతులు నులుముతున్నారు. మీరు కొట్టు కుని, గొంతులు కోసుకుని ఛస్తున్నారు. అటు అత్త వారింటికీ, ఇటు పుట్టింటికీ చెందక మేము కుమిలి పోతున్నాము. నాన్నా ! ఎవరు చచ్చినా ఏడువ వలసింది మేము. ఊళ్ళో ఎవరికి ఏమి జరిగినా, అది మా నెత్తిన పిడుగు పడినట్లే! ఇప్పటి కయినా మించింది లేదు. ఇంత విషం నోట్లోపోసి చంపి, ఆ తర్వాత మీ బాధలు మీరు పడండి" రెండు మోకాళ్ళ మధ్య తల పెట్టుకొని పార్వతి విలపిస్తుంటే, నోటికి గుడ్డ అడ్డం పెట్టుకొని నీలమ్మ విలపిస్తున్నది. గురివిరెడ్డి అక్కడి నుండి లేచి వెళ్ళాడు.

"నీ బ్రతుకు నాశనమయిందే తల్లీ ! పదహారేండ్లు కంటికి రెప్పలా కాపాడి,



కష్టాల మధ్యకు త్రోసినానే! నీ జీవితం ఇంకేం బాగుపడుతుందే!" నీలమ్మ పార్వతిని కౌగిలించుకుని ఏడుస్తున్నది. అప్పుడే అక్కడికి వచ్చిన నాగమణి, వారి ఏడుపుకి కారణం తెలియక ఏడుపు ముఖం పెట్టింది.

తనకూ వారికీ సంబంధాలు తెగిపోతున్నాయని పార్వతి కర్థమయింది. ఏ సమయంలో నయినా ఆ యింటి నుంచి, ఈ ఇంటికి రాకుండా కట్టుదిట్టాలు చేస్తారు. నియమాలకు లోబడి బ్రతికే తాను తెగించి, ఆ యింటి నుండి ఈ ఇంటికి రానూలేదు; తద్వారా శ్రీరెడ్డితో బంధం తెంచుకోనూ లేదు. గనుక పుట్టింటి సంబంధం త్రెంచుకొనక తప్పదు. గుండె ధైర్యం చేసుకున్నది. తండ్రి మౌనం అర్థమయింది. చావయినా బ్రతుకయినా భర్త దగ్గరే! తన అత్త గతంలో ఏ విధంగా నిర్ణయానికి వచ్చి ఉంటుందో ఇప్పుడు తనకు అవగత మవుతున్నది. చుట్టున్న తల్లి

చేతుల్ని విడిపించుకొని లేచింది. తల్లికి చెప్పకుండానే త్రోవ బట్టింది. నీలమ్మ, నాగమణి ఏడుస్తున్నారు. వారి ఏడ్పులను వినదలచుకోలేదు; చూడదలుచుకోలేదు. చరచర బయటకు వచ్చింది. వీధిలో నడుస్తున్నవారు తనను ఆశ్చర్యంగా చూస్తున్నట్లు ఆమెకు తోస్తున్నది. తల వంచుకొని చకచక ఫర్లాంగు దూరంలోని తన ఇంటికి వచ్చింది. శ్రీరెడ్డి వసారాలో మంచం మీద పడుకున్నాడు. పార్వతిని చూశాడు; కాని పలుకరించ లేదు. ఆమె లోనికి వెళ్లింది. అత్త ఎదురు చూస్తున్నది.

"ఏమయిందే?" అన్నది అన్నపూర్ణమ్మ ప్రశ్నార్థకంగా.

పార్వతి చాలాసేపు పలుకలేదు. అత్త మంచం మీద ఒకవైపుగా కూర్చుని పట్టుమీద వేలితో రాస్తూ కూర్చున్నది.

"ఏం జరిగిందే! ఎందుకట్లా ఉన్నావు" విసురుగా అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏమీ జరుగలేదు. నేనూ నీలాగే అయ్యాను" అన్నది చిన్నగా. ఆ సమయంలో ఆమెకు దుఃఖం వస్తున్నది. అయినా బిగించి కూర్చున్నది.

"అంటే?" ఆశ్చర్యంగా అడిగింది అన్నపూర్ణమ్మ.

ఎంత బిగించినా దుఃఖం ఆగలేదు. "అంటే ఏముందత్తమ్మా! నీ గతి ఏమయింది? ఆ ఇంటి నుండి ఈ ఇంటికి వచ్చి ఈ ముప్పై ఏండ్లలో ఎంత క్షోభ అనుభవించావో, నీ బదులు ఇప్పుడు నన్ను అనుభవించమని పంపారు" పార్వతి ఏడుస్తున్నది. ఆమె తలమీద చెయ్యి వేసి, అన్నపూర్ణమ్మ తానూ ఏడుస్తున్నది.

"వీరింక కలిసిపోరు. కలపాలని ప్రయత్నం చేయడం తప్పునాది. నా గతి తెలిసీ నిన్ను ఇరికించి నీ జీవితం కూడా బలి చేశాను. ఇప్పుడు ఆలోచిస్తే నేను చేసిన తప్పు ఎంత దారుణమయినదో అర్థమవుతున్నది."

"నువ్వేం చేస్తావ్ అత్తమ్మా! అందరమూ సుఖంగా ఉండాలని ఆశించావు; ప్రయత్నించావు. లోకం నిన్ను నీచంగా భావించినా, మామ చచ్చిన వెంటనే సంధి చేసుకున్నావు. వీరంతా ఈ విధంగా మారుతారని నీవు కలగన్నావా? ఈ మొగ జాతి అంతా నీచమయిందే అత్తమ్మా! మధ్యన మనల్ని ఏడ్పిస్తున్నారు" అన్నది రోషంగా.

అన్నపూర్ణమ్మ మాట్లాడలేదు. ఆమెకు ఇక మాట్లాడాలనిపించ లేదు. ఏ సంధి చేసుకుంటే అందరూ బాగుపడవచ్చునీ, ఊరంతా సుఖంగా ఉంటుందనీ ఆశించి; భర్త పోయిన దుఃఖం కూడా లెక్కచేయకుండా తను ప్రయత్నిస్తే, ఆ సంధి తనలాగే మరొక జీవితాన్ని కృశింపచేస్తున్నది ఇక వీరు కలిసిపోలేరు.

గడియారం నాలుగు గంటలు కొడుతున్నది. పార్వతి తలెత్తి గడియారం వైపు చూసింది. లేచి వంటింట్లోకి వెళ్ళింది. పాలు వేడిచేసి, రెండు గ్లాసులకు పోసి, కాఫీపొడి పంచదార కలిపి, గ్లాసులు తీసుకుని, అత్తవద్దకు వెళ్ళి గ్లాసు అందించి, తిన్నగా వసారాలోనికి నడిచింది. శ్రీరెడ్డి వాసాలవైపు చూస్తూ ఆలోచిస్తూ పడుకున్నాడు. పార్వతిని చూసి, లేచి కూర్చున్నాడు. గ్లాసు అతనికి అందించి, మంచం ప్రక్కనే క్రింద కూర్చున్నది. శ్రీరెడ్డి కాఫీ త్రాగి గ్లాసు క్రింద పెట్టి "ఇంతవరకూ ఎక్కడికి వెళ్ళావు?" అడిగాడు, తెలియక కాదు వివరాలు తెలుసుకొనుటకు.

"మా నాన్న గారింటికి వెళ్ళాను" అంది తల వంచుకుని వ్రేలితో క్రింద బండమీద రాస్తూ.

"ఎందుకూ?"

"ఎందు కేమిటి? పుట్టింటికి పోవడానికి కారణం కావాలా?"

"నీవు వెళ్ళింది కేవలం చూడడానికి కాదని నాకూ తెలుసు. అసలు ఏం జరిగిందో చెప్పు" అన్నాడు నవ్వుతూ. అతని ముఖంమీద నవ్వుచూసి ఆమెకు కొంత ధైర్యం వచ్చింది.

"మా నాన్నతో మాట్లాడడానికి వెళ్ళాను" అన్నది.

"ఏమన్నాడు?"

ఆమె ముఖంమీద విషాదం అలుముకుంది. ఏం చెబుతుంది? జరిగిందే చెప్పింది. ఆ తర్వాత కన్నీరు కార్చింది. శ్రీరెడ్డి ఆమె తలమీద ఒక చెయ్యి, వీపుమీద ఒక చెయ్యివేసి నిమిరాడు లాలనగా! శ్రీరెడ్డి మోకాలిమీద తల ఆన్చి వెక్కి వెక్కి ఏడ్చింది. "నా బ్రతుకు ఇక దుఃఖంతో గడువ వలసిందేనా బావా? మీ అందరికీ నేనేం అపకారం చేశానని బాధ పెడుతున్నారు?"

"పిచ్చిదానా! భార్యను ఏడ్పించాలని ఏ వెధవా అనుకోడు. భార్య కష్టాలు పడాలనీ ఆశించడు. విధి అటు ఈడుస్తున్నప్పుడు మనం చేసేదేమిటి? పరిస్థితులు ఈ విధంగా వస్తాయని ఆ రోజు ఎవరూ అనుకోలేదు" అన్నాడు బాధగా.

ఇద్దరూ మవునంగా ఉన్నారు. ప్రొద్దు నీరెండ పడుతున్నది. ఆరుబయట ఉన్న ఆవులు మోరలెత్తి దూడలవైపు చూస్తున్నవి. కోడె ఒకటి కాలు దువ్వి రంకె వేస్తున్నది. పక్షులు అరుచుకుంటూ ఎటో పరుగిడు తున్నవి. ఇంటి ఎదురుగా నున్న వేప చెట్టుమీద కాకులు అరుస్తున్నవి. చల్లటి పైరగాలికి వేప కొమ్మలు అటు ఇటు ఊగుతున్నవి. పొలాలకు వెళ్ళిన ఎద్దులూ, మనుషులూ ఇంటి ముందుగా పోతున్నారు. వారికివి కన్పించడం లేదు.




గోపిరెడ్డిని చంపడానికి కుట్ర పన్నడమయింది. ఇక అమలు జరుపడమే పని. గోపిరెడ్డిని చంపితే రాంరెడ్డి రంగంలో నిలబడలేడు. శ్రీరెడ్డి అటూ ఇటూ ఊగిసలాడుతున్నాడు. ఈ దావుతో అతనయినా రంగంలో నిలబడడం అసాధ్యం! గోపిరెడ్డి మనుషులు శ్రీరెడ్డికి సహకరిస్తారన్న నమ్మకంలేదు. గోపి చంప బడ్డాడన్న వార్త తెలిసిన వెంటనే హరిజనపేట, గొల్లపేటలోని అతని వర్గం పరారవుతారు. శ్రీరెడ్డి నిలబడడానికి వీరి సహాయం ముఖ్యం. వారే పరారీ అయితే అతని వెంట నిలిచేవారు తక్కువ. అదీగాక గోపిరెడ్డికున్నంత కక్ష గురివిరెడ్డి వర్గం మీద శ్రీరెడ్డికుండదు. పార్వతి అతన్ని అనునయించ గలుగుతుంది.

ఇటువంటివి వారు అనేకం ఆలోచించారు. ఆ తర్వాతనే రంగం సిద్ధం చేశారు. వారి దృష్టిలో గోపిరెడ్డి బ్రతికుండగా, గురివిరెడ్డి వర్గం ఆ గ్రామంలో నిలవడం సాధ్యంకాదు. కొంతకాలం నిలువగలిగినా, ఆ తర్వాతయినా పారి

పోవలసిన స్థితి ఏర్పడుతుంది. ప్రత్యే కించి గురివిరెడ్డిని చంపడానికే గోపిరెడ్డి ప్రయత్నిస్తున్నాడు. తన తండ్రిని చంపించిన వాణ్ని చంపడమే తన లక్ష్య మని గోపిరెడ్డి ఎన్నోసార్లు బహిరంగం గానే అన్నాడు. ఆ విధంగానే గురివిరెడ్డిని చంపించడానికి ప్రయత్నిస్తు న్నాడని వార్తలూ అందాయి. అందువల్ల గురివి రెడ్డి నిలవాలన్నా, ఆ వర్గం నిలవాలన్నా గోపిరెడ్డి తొలగింపు ముఖ్యమయింది. ఆ రోజు వాయిదా! గోపిరెడ్డి జీపు పని చేయటంలేదు. ఇరవై మంది మనుషలను వెంటబెట్టుకుని, వెల్లుట్ల వరకూ నడిచి వచ్చి, బస్సుఎక్కి కర్నూలు వెళ్ళారు. తిరిగి నడిచే వస్తారన్న విషయం తెలి సిందే! ఈ అదనునే శత్రువు వాడుకు న్నాడు. గోపిరెడ్డికి కుడిభుజం అని చెప్ప బడే హరిజన కోటిని లంచంతో ముందే ఆకట్టుకున్నారు. గోపిరెడ్డి వాడే ఆయు ధాలన్నీ కోటి చేత పట్టుకుని గోపిరెడ్డి వెంట వెళ్తుంటాడు. సమయానికి అవి అందకుండా తప్పించాలని ఆదేశించారు. అందుకు ప్రతిఫలం యాభై వేల రూపా యలు ఇస్తామని ఆశ చూపారు. యాభై వేలుకాదు. పనిలోపని; వాడిని కూడా పూర్తిగా నాశనం చేయవచ్చని వారి పథకం! ముందు ఆశచూపితే లొంగి ఆయు ధాలు గోపికి అందకుండా దూరం తీసు కెళ్తాడని ఎర చూపెట్టారు. ఐదువేలు లెక్కపెట్టి వాడికి ఇవ్వనూ ఇచ్చారు. పని జరిగిన వెంటనే మిగిలింది కూడా ఇస్తామని హామీ ఇచ్చారు.

కోర్టుకు హాజరయి, తిరిగి బస్సు ఎక్కి వెల్లుట్లకు వచ్చేసరికి దాదాపు మూడు గంటలకు పైగా అయింది. అక్కడినుండి నడక సాగిస్తే నాలుగన్న రకు పైడిపల్లె చేరవచ్చు. ఇరవై మంది వద్ద ఈటెలున్నాయి. మొలలో పిస్తో ళ్ళున్నాయి. ముగ్గురి టిఫిన్ గిన్నెలలో బాంబులూ ఉన్నాయి. గోపిరెడ్డి ఆయుధా లున్న సంచి కోటిగాడు చేతపట్టుకు న్నాడు.

జరిగిన సంగతులు చెప్పుకుంటూ జరుగబోవునవి చెప్పుకుంటూ నడుస్తు న్నారు. గోపిరెడ్డి ముందున్నాడు. అతని వెనుక కోటిగాడు. ఆ వెనుక సుంకడు. అతడి వెనుక ఇతరులు నడుస్తున్నారు. గ్రామంలో పోలీసు బందోబస్తు పూర్తిగా ఉండడంవల్లనూ, దాదాపు మూడు నెల లుగా పరిస్థితులు చల్లబడడంవల్లనూ ఏమైనా జరుగుతుందనే ఆలోచనే ఎవరి లోనూ లేదు. గోపిరెడ్డికి అనుమానాలున్నా అది బయట పెట్టడం అవివేకమూ, పిరికి తనమూ అవుతుంది. ఇరవై మంది మారణాయుధాలతో ఉండగా ఎవడూ ఎదిరించ లేడని కూడా అనుకున్నాడు. కానీ గోపి రెడ్డి అంచనా తప్పింది. వెల్లుట్ల దాటాక మూడు మైళ్ల దూరంలో, వెల్లుట్ల కొట్టాల ఉంది. కొట్టాలదాటితే చిన్న యేరుపారుతూ ఉంటుంది. ఇది మాగాణి ముగుగు నీరే! ఆ యేరుకుఅటు ఇటు ఒడ్లు గోడకట్టినట్లు నిటారుగాఉంటాయి. సాధారణంగా అక్కడ మాటు కాస్తారు శత్రువులు. అక్కడ అతి జాగ్రత్తగానే దిగారు. శత్రువులటుంచి, మనిషనే వాడెవడూ అక్కడ వారికి కన్పించలేదు. ఏరుదాటిన వెంటనే జొన్న పొలం ఆరంభమవుతుంది. బాటకు ఇరు వైపులా క్రిక్కిరిసి ఉంటాయి. కోతకు వచ్చిన కంకులతో, పైరగాలికి అటు ఇటూ ఊగుతున్నాయి. చిక్కటి ఆ జొన్న పొలంలో ఏమున్నదీ కన్పించడం లేదు.




పెడిపల్లె మరింక మైలు దూరంలో ఉంది. ఊరికి అటువైపున్న రైలుస్టేషన్ నుండి ఏదో బండి పోతున్నట్లు ఈల విన్పిస్తున్నది. హఠాత్తుగాజొన్నపొలంలో అలికిడి అయింది. కన్నుమూసి తెరచే లోగానే 'కోబలీ,' తేబలీ అంటూ మనుషులు పరుగెత్తుతూ వచ్చి మీదపడ్డారు. కనీసం యాభై మందికి పైగానే ఉన్నారు. ఆహఠాత్ పరిణామానికి వారు భయంతో, తత్తరపాటుతో తేరుకోలేక, పరుగెత్తడం సాగించారు.కోటిగాడుసంచితోసహాజొన్న చేలల్లో అడ్డంపడి పరుగెత్తాడు. మిగిలిన కొందరు పెడిపల్లె రోడ్డువెంట, కొందరు జొన్నచేలల్లో అడ్డంపడి పరుగెత్తారు. గోపిరెడ్డి పరుగెత్తింది వెనుకకు కొట్టాల వైపు. శత్రువుమీదికి రావడం పెడిపల్లె వైపునుండి. అందువల్ల గోపిరెడ్డి వెనుకకు ఉరికాడు. తన అనుచరులు నిలబడితే పోరాడదామనుకున్నాడు.కాని,వారెవ్వరూ నిలబడలేదు. కుక్క మొరిగితే పారే పిల్లుల్లా పారిపోతున్నారు. తాను కూడా పరుగెత్తుతూ నిలబడ్డాడు. ఇంత బ్రతుకు బ్రతికి పారిపోవడమా ? అనుకున్నాడు. పారిపోదలచుకున్నా వారు పోనివ్వరు. శత్రువు ఎవరిమీదికి వచ్చేదీ తేలినట్లే ఉంది. అనుచరుల జోలికిపోరు. గాడిదను చంపి, గల్లు (ఉరి)కు పోవాలని ఎవడూ అనుకోడు. తాము చంపదలచిన వాడిని చంపడం వారి లక్ష్యం ! కాబట్టి తనను చంపకుండా విడిచిపెట్టరు. విడిచిపెట్టారా? తిరిగి తను గ్రామంలోకి పోగలిగాడా ? వారి రక్తం త్రాగగలడని తెలుసు. కాబట్టి వారి లక్ష్యం ఒకటే ! అటువంటప్పుడు పారిపోతూ చంపించుకొనడం కంటే నిలబడి పోరాడదామనుకున్నాడు.

చేతిలో ఆయుధంలేదు. అయినా నిలిచాడు. రోడ్డుమీద సోలింగ్ పరచడానికి చిన్న చిన్న గుండ్రాళ్ళు తోలి గుట్టలు పోశారు. ఒక గుట్టను ఆపు చేసుకొని నిలబడ్డాడు. గోపిరెడ్డి నిలబడతాడని వారు అనుకోలేదు. పారిపోతుంటే మీదపడి నరుకుదామనుకున్నారు. అతడు హఠాత్తుగానిలబడేవరకు కొద్దిక్షణాలు స్తంభించి నిలిచారు. ఆ వెంటనే తేరుకున్నారు గాని, మీద పడడానికి ధైర్యం చాలడంలేదు. గోపిరెడ్డి మొలలో పిస్తోలు ఉంటే కాల్చి చంపగలడు. ఉందో లేదో వారికి తెలియదు. అందువల్ల తొందరపడి, మీదపడడానికి వారు సిద్ధంగా లేరు. దొరికితే చంపొచ్చు. లేకుంటే పారిపోవచ్చు. అదే వారి ఉద్దేశం. గోపిరెడ్డి వెంట వచ్చిన ఇరవైమందీ నిలబడితే, గోపిరెడ్డిని వీరు ఏమీ చేయలేరు. కాని, వారు పారిపోయారు.

గుట్ట ఆపుచేసుకొని రాళ్ళు విసరడానికి సిద్ధపడ్డాడు. గోపిరెడ్డి గుట్టఎక్కి, రెండు చేతులా రాళ్ళు తీసుకుని విసరుతున్నాడు. వాళ్ళు కూడా రాళ్లు వి స రు తు న్నా రు. ఇద్దరి మధ్యా ముప్పై గజాల దూరం ఉంది. త్రాగి తూలుతున్న వారిలో కొందరు రాళ్ళు విసిరే స్థితిలో లేరు.చేతిలో రాయి పట్టుకుని తూగుతున్నారు. మరి కొందరు, గోపిరెడ్డిది పైచెయ్యి అయితే, జొన్న చేలలో అడ్డంపడి పరుగు లంకించుకొనుటకు సిద్ధంగా వున్నారు. అందరూ అలాగే లేరు. గోపిరెడ్డి వల్లా, అతని మనుషుల వల్లా గతంలో దెబ్బతిన్నవారి కుటుంబాలకు చెందినవారు కొందరున్నారు. ఎట్టి పరిస్థితిలో అయినా గోపిరెడ్డిని చంపడానికి వారు సిద్ధంగా ఉన్నారు.

అందరి మధ్య గోపిరెడ్డి పోరాడడం

సాధ్యం కాదు. వాదాపు పది నిముషాలు రాళ్ళతోనే పోరాడాడు. చివరకు అలుపు వచ్చింది. నీరు దప్పిక అవుతున్నది. ఆయాసపడుతూ, ఊపిరి పీలుస్తూ నిల బడ్డాడు. శత్రువులందరు కూడా నిల బడ్డారు.

"ఒరే నా కొడుకుల్లారా! ఇంతమంది కలిసి ఒక్కని చంపడం గొప్ప విషయం కాదురా! మీరు మొగాళ్ళయితే ఒక కర్ర ఇచ్చి నిలబడండ్రా! చూద్దాం! పిరికి నా కొడుకుల్లారా!" ఆయాసపడుతున్నాడు. వారిలో ఒకడు గోపిరెడ్డి వెనుక వైపుకి నక్కి నక్కి వచ్చాడు. గోపిరెడ్డి ముందున్నవారిని చూస్తున్నాడు. వెనుక వైపు మనిషిని చూడలేదు. వెనుక వచ్చిన వాడు గొడ్డలి పైకెత్తి, రాళ్ళ గుట్ట దగ్గ రగా వచ్చాడు. గోపిరెడ్డి వైపు పైకి చూస్తూ, క్రింద చూడకుండా నడవడం వల్ల, కాలికి రాయి తగిలి శబ్దమయింది. గోపిరెడ్డి హఠాత్తుగా వెనుకకు తిరిగి చూశాడు. గోపిరెడ్డి వెనుకకు తిరుగు తాడని వాడు ఊహించక పోవడంతో, తత్తరబాటుతో భయకంపితు డయ్యాడు. అయినా ధైర్యం కూడదీసుకుని గొడ్డలి విసిరాడు. దెబ్బ గోపిరెడ్డికి తగల్లేదు. వాడి మీదపడి గొడ్డలి లాక్కున్నాడు. అదే గొడ్డలితో వాడిని నరికాడు. తల తెగి ప్రక్కన పడింది. రక్తం జివ్వున నరాల నుండి లేచి ధార జిమ్ముతున్నది. ఆయుధం చేతికి దొరకడంతో, గోపిరెడ్డికి ధైర్యం కలిగింది. కనీసం పది నిమిషాలయినా పోరాడగలిగితే, ప్రాణాలు నిలుపుకోగలి గితే, గ్రామం లోనికి వెళ్ళిన వారిలో ఎవడో ఒకడు పోలీసులతో చెప్పి తీసుకు వస్తాడని అనుకుంటున్నాడు. తమ వాడు ఒకడు నాశనం కావడం; ఆయుధం గోపి రెడ్డి చేతికి దొరకడంతో మిగిలిన వారు భయకంపితులయి నిలిచారు. వారిలో ఉన్న సారాయి కైపు దిగిపోతున్నది.

"మీదపడి నరకండ్రా!" అంటూ నారాయణరెడ్డి, బలరాంరెడ్డి హుంకరిస్తు న్నారు. మీదపడే తెగింపు వారిలో లేదు. ఒకడిని చంపడానికి యాభై మంది.

తిరిగి రాళ్ళు విసరసాగారు. గోపిరెడ్డి కూడా రాళ్లు విసర సాగాడు. ఆయాసం వస్తున్నది. తను ఒకటి విసరితే, వారు యాభై విసురుతున్నారు. అందువల్ల రాళ్ళతో సాధ్యం కాదు. ఏమవుతే అది అవుతుంది. మీద పడాలని నిర్ణయించుకుని గొడ్డలి పైకెత్తి వారి మీదకు ఉరికాడు. మృత్యువు వారి మీద పడినట్లే భావించారు. రాళ్లు వేయడం మాని పరుగెత్తడం మొద లెట్టారు. తిరిగి గోపిరెడ్డి ఊరిలో పడితే తాము గ్రామంలో కాపురం చేయలేమని అందరికీ తెలుసు. అందువల్ల ఎలాగయినా చంపాలి. చుట్టూ చుట్టుకొమ్మన్నాడు బల రాంరెడ్డి. అతని ఆదేశం అందరూ పాటిం చారు. చేలల్లో అడ్డంపడి తనను చుట్టుకుం టున్న విషయం గ్రహించాడు గోపిరెడ్డి. చుట్టూవారు ఉంటే మధ్యన తాను దెబ్బతిన వలసి వస్తుంది. ఒకవైపు తప్పుకొనుటకు అవకాశం కొరకు ఎదురు చూస్తున్నాడు. అవకాశం వారివ్వదలుచుకోలేదు. చంపి తీరాలని నిశ్చయించుకొని చుట్టుముట్ట డించి, రాళ్లు విసురుతూ ముందుకు కదలి వస్తున్నారు. ఎటువైపుకదలినావెనుకవైపు నుండి మీదకు వస్తున్నారు. ఆ విధంగా వాళ్ళు చేరువవుతూ రాళ్ళు విసరడంవల్ల రాతి దెబ్బలు శరీరాన్ని గాయపరుస్తు న్నాయి. ఇక నిలువలేక పోయాడు గోపి రెడ్డి. రాతి దెబ్బలతో నేల కొరిగాడు.




నేల కొరిగిన వాడిమీద పడ్డారు. కోబలీ అంటు గొడ్డళ్లతో కొడుతున్నారు; ఈటెలతో పొడుస్తున్నారు. గోపిరెడ్డి ప్రాణం అనంత వాయువుల్లో కలిసింది. అతని శరీరం ఖండికలుగా తెగి భూమిపై బడింది. వారికి కక్ష తీరలేదు. రక్తం కారి క్రింద తడిసిన మట్టిని దోసిళ్లతో తీసుకొని, జొన్న చేలమీద చల్లుతూ, 'కోబలీ తేబలీ' అంటూ కేకలేస్తూ, పొలంలో అడ్డంపడి పరుగెత్తారు. అంత వరకూ రణగొణ ధ్వనిగా తయారయిన ఆ ప్రాంతం, నిశ్శబ్దంగా అయింది.

పది గజాల ఎడంలో రెండు జీవంలేని శరీరాలు నేలమీద పడున్నాయి, మొండెముల నుండి రక్తం ప్రవహిస్తున్నది. ఆ ప్రాంత భూమి ఎర్రగా మారింది. కాలి క్రింద నలిగిన జొన్న కర్రలు, ప్రక్కకు విరిగి పడి ఉన్నాయి. అంతవరకూ వెలుగు వెలిసిన గోపిరెడ్డి శరీరం అక్కడ తుండేల్లాగా నరకబడి నిశ్శబ్దంగా పడి ఉంది. సంవత్సరం పాటు పైడిపల్లెకు సింహం లాగ తయారయ్యాడు. సింహం కూడా అదునుతప్పితే కుక్కల చేతుల్లో ఛస్తుంది. గోపిరెడ్డి పనీ అంతే అయింది.




గోపిరెడ్డిని చంపిరి...

గోపిరెడ్డిని చంపిరి...

వార్త క్షణాల్లో తరంగాల్లా ఇంటింటా మార్మోగింది. గురివిరెడ్డి నమ్మలేక పోయాడు. జనం తల్లడిల్లారు; వడ వడ వణికారు.

గోపిరెడ్డిమీద ఎంతో అభిమానం పెంచుకున్న కొందరు నిలబడలేక నేల కొరిగారు.

ఆడవారు, పిల్లలు గోలు గోలున ఏడుస్తున్నారు. శ్రీరెడ్డి గుండె నీరయింది. అతడి నోటివెంట మాట రాలేదు.

గోపిరెడ్డి హత్యా వార్త వింటూనే అన్నపూర్ణమ్మ మంచం మీదనే ఒరిగి పోయింది. ఆమె ప్రాణం విశ్వంలో కలిసి పోయింది. ఆమెకు అత్యంత ప్రేమ పాత్రుడు గోపిరెడ్డి. అతడు భాగ పరిష్కారం చేసుకుని వెళ్ళి కాపురం పెట్టినప్పటి నుండి, ఆమె సరిగా అన్నం కూడా తినక కుమిలి పోతున్నది. నేటికి కొడుకుతోబాటు తాను కూడా ఈ కష్టాలనుండి విముక్తి పొందింది.

ఆమె శవంమీద పడి పార్వతి రోదిస్తున్నది. ఆమె రోదనవినే వారెవ్వరూ అక్కడ లేరు. పోలీసులు కదిలారు. అక్కడికి చేరాలంటే పావుగంట పడుతుంది. ఇన్‌స్పెక్టర్ లేడు. వ్యాను తీసుకుని టౌన్‌కు వెళ్ళాడు. వైర్‌లెస్‌లో వార్త తెల్పారు. సూపరింటెండెంట్ వస్తున్నట్లు తెల్పారు.

శ్రీరెడ్డి, రాంరెడ్డి కదిలారు. వారి వెనుక జనం! ఆడవాళ్ళు గోసిచెక్కి నడిచారు. మొగవారు కర్రలు చేతపట్టి, కండ్ల నీరు కారుస్తూ కదిలారు. గోపిరెడ్డి వెంట ఉండి వచ్చిన వాళ్ళను బండ బూతులు తిడుతున్నారు. పరారయి వచ్చి వీరితో కలిసి నడుస్తున్నవారు, వీరి తిట్లకు తల వంచుకున్నారు.

గోపిరెడ్డి హత్యా వార్త చుట్టూ అన్ని గ్రామాల్లోనూ వెంట వెంటనే వ్యాపించింది.

వేల సంఖ్యలో జనం తండోప తండాలుగా వస్తున్నారు. నిండా పదహారేండ్లు లేకున్నా; పెడిపల్లెను సంవత్సరం ఊపి, విశ్రాంతి తీసుకున్న ఆ వ్యక్తిని చూడడానికి జనం ఎగబడు తున్నారు. తునా తునకలుగా





పడి ఉన్న ఆ శరీరాన్ని చూసి విస్తుపోయే వారు కొందరు; ఏడ్చేవారు కొందరు; నిలువెల్లా వణికి పోవువారు కొందరు; స్పృహతప్పి పడిపోవు వారు కొందరు ఆ జనాన్ని ఆపడం ఇరవై మంది పోలీసులకు సాధ్యంకాదు. ఐదు గంటలకు పోలీసు వ్యానులు వచ్చాయి. అంబులెన్స్ వచ్చింది. పరివారం తమ పని కానిస్తున్నారు. సూపరింటెంట్ శ్రీ రెడ్డి వడ్డకు వచ్చాడు. శ్రీ రెడ్డి రాళ్ళగుట్టను ఆపుచేసుకుని చేరగిలబడ్డాడు. అతని ప్రక్క రాంరెడ్డి ఉన్నాడు. మనుషులు వందల సంఖ్యలో అతని చుట్టూ వున్నారు. సూపరింటెండెంట్ శ్రీ రెడ్డి వద్దకు వచ్చాడు. ఈ సంవత్సరం నుండీ ఎందరు ఎన్ని విధాల తిరుగుతున్నా, తొణకకుండా

శాంతి ప్రయత్నాలు చేశాడు. చిరునవ్వుతో తిరిగాడు. నేడు-అతనిముఖంలో ప్రేతకళ పడింది. ఆ ప్రేతకళలోనే ఏదో పట్టుదల-ఆవేశం గోచరిస్తున్నది.

"రెడ్డిగారూ!" తలఎత్తి చూశాడు. శ్రీరెడ్డి, ఎదురుగా సూపరిండెంట్. ఆయన రాళ్ళగుట్టమీద కూర్చున్నాడు.

"ఇంత ఘోరం జరుగుతుందనుకోలేదు మేము. గ్రామంలో అయితే మా సిబ్బంది అటకాయించగలిగేవారే! వెలుపల కావడంవల్లనూ, మా పోలీసులకు తెలియకపోవడంవల్లనూ ఏమీచేయలేకపోయాము" శ్రీరెడ్డి ఏమీ మాట్లాడలేదు. తలవంచుకొని వింటున్నాడు.

"గోపిరెడ్డి మరణానికి ముందు, అతని వెంట ఎవరెవరున్నారో తెల్పండి. సాక్ష్యాల్ని నమోదు చేసుకుంటాం!" అన్నాడు సూపరిండెంట్. శ్రీరెడ్డి తల విదలించాడు. అతని కంఠం దుఃఖంతో పూడుకుని ఉంది, కంఠం పెగుల్చుకుని అన్నాడు. "వద్దు; వద్దు సార్! కేసు పెట్టాలనే తలంపు మాకులేదు. ఇంతలావు మనిషే మా కండ్లముందు నెత్తురులో పడి ఉంటే, ఇంకా ఈ కేసులూ, తతంగమెందుకూ?"

మాట్లాడుతున్నది శ్రీరెడ్డేనా? అనుకున్నాడు సూపర్నెంటు. కేసు వద్దనడమేమిటి? ఇంకా మామగారి మీద జాలి చూపిస్తున్నాడా? అనుకున్నారు కొందరు. రాంరెడ్డి అన్నను తదేకంగాచూస్తున్నాడు.

"కేసు నమోదు చేసుకోవడం మా ప్రథమ కర్తవ్యం. ఇంత జరిగితే కేసు వద్దంటావేమయ్యా" అన్నాడు సూపరిండెంట్.

"కేసులవల్ల వచ్చే లాభమేమీలేదనీ, పైగా కోర్టుల చుట్టూ తిరుగుతూ డబ్బు ఖర్చుపెట్టుకోవడమేననీ నాకు మొదటి నుండీ విదితమే సార్! అందువల్ల మాకు నష్టం. లాయర్లూ కోర్టుపక్షులు మమ్మల్ని దోచి బ్రతుకుతారు. మా కడుపులు మండుతున్నాయి. ఈ మంటను కేసులు ఆర్పలేవు. ఈ మంట ఆర్పాలంటే మా శత్రువులను నరకడం ఒక్కటే మార్గం. నా తమ్ముడిని నరికిన వారిని పెడిపల్లెలో నిలువునా నరికి వేయకుండా నేను నిద్రపోలేను" అన్నాడు శాంతంగానే! అతని కండ్లవెంట నీరు కారుతున్నది.

అతని మాటకు సూపర్నెంటు ఒక్కడే కాదు, చుట్టూ నిలిచినజనంకూడా ఆశ్చర్యపోయారు. గోపిరెడ్డి కంటే ముందు ఈ రంగంలో నిలబడవలసినవాడు, గోపిరెడ్డి తర్వాత నిలబడుతున్నాడు. అందుకు సంతోషించేవారు కొందరయితే: ఇక గురివిరెడ్డితో కయ్యం తప్ప, నెయ్యం ఉండదని ఆలోచిస్తున్నవారు కొందరు!

శ్రీరెడ్డి ఒక నిర్ణయానికి వచ్చాడు. ఇక మార్చుకొనడం ప్రసక్తిలేదు. శరీరాలను రెంటినీ అంబులెన్స్‌లో చేర్చి కర్నూలుకు తీసుకెళ్ళారు. శ్రీరెడ్డి ఇంటికి తిరిగి వచ్చాడు. రాంరెడ్డి, మరి కొందరిని తీసుకుని కర్నూలు వెళ్ళాడు. శ్రీరెడ్డి ఇంటికి వచ్చి, తల్లికీ, తమ్ముడికీ అంత్యక్రియలకు ఏర్పాటు చేస్తున్నాడు.

అతనిప్పుడు

ఏడవడం లేదు; బాధ పడడమూ లేదు. ఆవేశంతో, ప్రతీకారంతో కృతనిశ్చయంతో ఉన్నాడు. రాత్రి ఎనిమిది గంటలకు విషాదాలాపాలతో,ఏడ్పులతో,రోదనలతో అన్నపూర్ణమ్మ శవం శ్మశానానికి సాగింది. కట్టెలపై శవాన్ని ఉంచి, చితికి నిప్పు అంటించేందుకు శ్రీరెడ్డి తల వద్దకు




వచ్చాడు. ఆఖరిసారి తల్లి ముఖం చూసి ఏడ్చాడు.

"అమ్మా ! నీ ఆశ విఫలమయింది. నా తండ్రిని చంపినా, గ్రామం బాగు కొరకు నా కుటుంబం, వారి కుటుంబం బాగు కొరకు నేను నెయ్యానికి ఇష్ట పడ్డాను. ఈ నెయ్యంలో నా తమ్ముని పోగొట్టుకుంటానని నేను భావించ లేదు. నా తమ్ముని మరణం నన్ను మార్చింది. నాకూ, నా కుటుంబానికీ కావలసినది వారితో నెయ్యం కాదు; కయ్యమేనని అర్థం చేసుకున్నాను. నా తండ్రినీ, తమ్మునీ చంపిన వారిని చంపకుండా, నేను నిద్రపోలేను. నీ ఆశ తీర్చలేకపోయి నందుకు నన్ను క్షమించు, నా లక్ష్యాన్ని దీవించు" అనుకుని నమస్కరించాడు.

చితికి నిప్పంటించాడు. కాలిపోతున్న ఆ కాయాన్ని చూసి, ఏడ్చేవారు ఏడుస్తు న్నారు.

చితి పూర్తిగా కాలిపోవు సమయానికి మూడవ తమ్ముడు సురేంద్ర రెడ్డి వచ్చాడు. అన్నదమ్ములిద్దరూ ఒకరి నొకరు కౌగి లించుకుని ఏడ్చారు.

రాత్రి పది గంటలయింది. అందరూ ఇంటికి చేరేటప్పటికి, వ్యానులో గోపిరెడ్డి శవాన్ని తీసుకుని రాంరెడ్డి వచ్చాడు. ఆ శవాన్ని చూసి సురేంద్రరెడ్డి విలపిం చాడు. అతన్ని దూరం చేసుకున్నందుకు అన్నను నిందించాడు. రాత్రంతా ఆ గ్రామానికి శివరాత్రి జాగరణే అయింది.

పార్వతి పడకగది నుండి బయటకు రాలేదు. జరిగిన సంఘటనలతో ఆమె దిమ్మెరపోయింది. ఏడ్చే ఓపిక కూడా ఆమెకు ఇకలేదు. నిరాలోచనలతో పడు కున్నది. ఆమెకు తోడు ఇద్దరు ఆడవారు అక్కడే ఉన్నారు.

రాత్రంతా త్రాగి తిడుతున్నారు కొందరు; గురివిరెడ్డి వర్గానికి చెందిన పురుషులెవరూ గ్రామంలో లేరు. మిగిలింది ఆడవారే ! వారిని ఏమీ చేయవద్దని శ్రీరెడ్డి ముందుగానే ఆదేశించాడు లేకుంటే నానా ఘోరం చేసేవారు త్రాగుబోతులు. గురివి రెడ్డి కూడా మిగిలిన వారిలాగే ఊరు విడిచి వెళ్ళాడు.

మరుసటి రోజు ఉదయం ఆరు గంటల నుండి ఊరేగింపు ఆరంభమయింది. వ్యాను మీద శవాన్ని ఉంచి పూలతో నింపారు. భళ్ళున తెల్లవారు నప్పటికే, వివిధ గ్రామాల నుండి వేల సంఖ్యలో తరలి వచ్చారు జనం ! సమితి మాజీ అధ్యక్షుడు నారాయణ కూడా వచ్చాడు. కేకలతో, అరుపులతో, తిట్లతో, విషాదా లాపనలతో, బ్యాండు వాయిద్యాలతో, తప్పెటల మోతలతో, ఆ గ్రామం మార్మోగింది. శత్రుపక్షాల ఇంటి తలుపుల సంగతటుంచి, కిటికీలు కూడా తెరవలేదె వ్వరూ! లోపల కూర్చున్న వారు వణుకు తూనే ఉన్నారు - ఏ సమయంలో మీద పడతారోనన్న భయంతో సురేంద్రరెడ్డి, రాంరెడ్డి, కరణం వ్యాను ముందు నడుస్తు న్నారు. శ్రీరెడ్డి ఆ ఊరేగింపు ప్రారంభా నికి రాలేదు. వారిని వెళ్ళమని చెప్పాడు.

శ్మశానానికి చేరుసరికి పదిగంటల యింది. గంధపు కట్టెలు పేర్చబడ్డ చితి మీద శవం ఉంచారు. డబ్బాలతో నెయ్యి ఆ చితిమీద పోశారు. చితికి రాంరెడ్డి నిప్పు ముట్టించాడు. ఆకాశానికి మంటలు లేచాయి. మంటలతో పాటు ఆక్రందనలూ మిన్ను ముట్టాయి. సురేంద్రరెడ్డి వల వల ఏడుస్తు న్నాడు. రాంరెడ్డి కన్నీరు కారుస్తున్నాడు. త్రాగి తూలుతున్నవారు శత్రువును తిడు తున్నారు. వస్తే నరికి చంపుతామని ప్రగ

ల్ళాలు కొడుతున్నారు. గోపిరెడ్డి భౌతిక కాయం కూడా అతని శక్తితో పాటు నశించింది. కాని, సంవత్సర కాలం ఆ గ్రామంలో వెలిగించిన వెలుగును, చూపించిన పటుత్వాన్ని, ప్రజలు మరచిపోవడం సాధ్యం కాదు.




పైడి పల్లెలో 'గంగజాతర' ఉత్సవం దగ్గిర పడింది. ఆ గ్రామంలో ప్రతి సంవత్సరం విధిగా ఆ ఉత్సవం జరుగుతుంది. గ్రామంలో ఎంత దౌర్జన్య పరిస్థితి ఉన్నా ఆ ఉత్సవం జరుపుతారు. జరిగిన ప్రతి సంవత్సరం ఏదో ఒక గొడవ జరుగక తప్పదు.

వరి కోతలు తెగాయి. పొలాలలో గూళ్లు వేశారు. కొన్ని ప్రాంతాలలో కొంతమంది వరిగూళ్లు నిప్పులో భస్మమయ్యాయి. అటు వర్గానివి కొన్ని, ఇటు వర్గానివి కొన్ని కాల్చి వేసుకున్నారు. గ్రామంలో కూడా ఆ మంటలు ఆరంభమయ్యాయి. ఏ సమయంలో ఏమి జరుగుతుందో అర్థంకానట్టి పరిస్థితిలో ప్రజలున్నారు? పోలీసు గస్తీ పూర్తిగా ఉంది గ్రామ మంతటా! అయినా దొమ్మీలు జరుగుతూనే ఉన్నాయి. తన్నుకొనడం, కొట్టుకోవడం మామూలే! ఆపుటకు పోలీసులకు కూడా సాధ్యం కావడం లేదు. గురివిరెడ్డి కూడా ఇక అన్ని రాజీ ప్రతిపాదనల్ని విడిచిపెట్టాడు. శ్రీరెడ్డి వాటిని గోపిరెడ్డి శవంతోనే వదులుకున్నాడు. పార్వతి ఇద్దరి మధ్యా నలిగిపోతున్నది. పుట్టింటివైపు వెళ్ళడమటుంచి, ఆ ప్రస్తావనే ఈ ఇంట్లో మాట్లాడడంలేదు. మాట్లాడితే ఏం జరుగుతుందోనని ఆమె భయం.

జాతరలో హరికథా కాలక్షేపం, నాటకం, బుర్ర కథ—మూడురోజులు, మూడురకాల కాలక్షేపం ఏర్పాటు చేశారు. జాతర పెద్దలు గ్రామమంతా తిరిగి చందాలు వసూలుచేశారు. మొదటిరోజు జాతరఆరంభమయింది. తప్పెటలతో, మేల తాళాలతో రణ గొణ ధ్వనిగా ఉంది. ముందే శృతిమించిన గ్రామం. ఇటువంటి సమయాలలో మరీ ఘోరంగా ఉంటుంది. ఎక్కడ చూసినా తప్పత్రాగుడు, బూతు కూతలు, కేకలు ... సూపరిండెంట్ స్వయంగా క్యాంపువేశాడు. మొదటిరోజు హరికథా, రెండవరోజు నాటకం అయిపోయినవి.

మూడవరోజు కొలుపుకుండ (బోణం) సాగాలి అమ్మవారికి! అక్కడే తగవు ఆరంభమయింది. ముందు గోవిందరెడ్డి బోణం కుండ సాగిపోవాలి. ఆ తర్వాత నారాయణరెడ్డి ఇంటినుండి... కాని, నారాయణరెడ్డి తగవు పెట్టుకున్నాడు. ముందు తానే తీసుకెళ్ళాలన్నాడు. ఒకరిద్దరు పెద్దమనుషులు చెప్ప ప్రయత్నించినా, నోరు మూసుకొని పడి ఉండమని హెచ్చరించాడు. గోవిందరెడ్డి కూడా తన బోణం కుండ ముందు పోవాలని చెప్పాడు. ఇద్దరూ పోటీపడ్డారు. ఇద్దరి కుండలూ ఒకేసారి అమ్మవారి వద్దకు సాగాయి. రెండూ ఎదురెదురు ఇళ్లు. ఆ రెంటిముందు




వాయిద్యాల మోత. అందుకు లయగా సాము గరిడీలు, సింధు నాట్యాలు, హూంకరింపులు, మీసాలు పెరికేసుకోవడాలు శృతిమించి పోతున్నాయి. అంతకంటే శృతిమించి సారాయి త్రాగారు. ఎప్పుడు అవకాశం దొరుకుతుందోనని ఎదురుచూసే వారికి ఇటువంటివి అవకాశం. నాయకులు మాటలతో పోట్లాడుకుంటూంటే, వీరు మధ్యన దూరి కర్రలతో పోట్లాడుతారు. ఫలితం-నాయకులు కూడా రంగంలో దిగకతప్పదు. వచ్చే కేసులు నాయకులు అనుభవించడమేగాక, వీరందరినీ ప్రాణ భయంతో వెంటబెట్టుకొని మేపాలి.

ఒకరి నొకరు కవ్వించుకోవడంతో వాతావరణం భయానకంగా తయారయింది. ఒక ఇన్‌స్పెక్టర్ వచ్చి నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. ఇద్దరూ వినలేదు. ఎవరి బోణం ముందు సాగినా, రెండవ వ్యక్తికి వచ్చే నష్టం ఏమీలేదు. కాని, అక్కడ నష్టాల ప్రసక్తిలేదు; ఎవరు ముందు తీసుకెళ్తే వారు మొనగాళ్ళ క్రిందలెక్క! తన పోటుతనం చూపించాలంటే ముందు తీసుకెళ్ళాలి. ఒకవైపు ఇన్‌స్పెక్టర్ సర్దిచెబుతుండగానే మరోవైపు కలబడ్డారు. కొట్టుకోవడం ఆరంభమయింది. పోలీసులు లాఠీలు తీసుకొని రంగంలో దిగారు. గొడ్లను బాదినట్లు బాదారు. ఎవరంతకు వారు పరుగెత్తారు. బోణంలేదూ, మట్టీలేదు. వాతావరణం సద్దుమణిగింది. ఇద్దరి బోణంకుండలూ ఎవరిండ్లలో వారివి నిలిచాయి.

వార్త తెలిసిన శ్రీరెడ్డి ఇంటినుండి సూపర్నెంటు వద్దకువచ్చాడు. లాఠీఛార్జీలో దెబ్బతిన్నవారిలో శ్రీరెడ్డివర్గం ఎక్కువ! లాఠీ ఛార్జీ చేయడం అవివేక చర్య అన్నాడు. అక్కడ లాఠీఛార్జీ చేయడం పక్షపాత బుద్ధితోనే జరిగిందన్నాడు. అటువైపు వర్గం వారిని ఒక్కరిని కూడా కొట్టలేదన్నాడు. సూపరింటెండెంట్ సావధానంగా విన్నాడు.

"శ్రీరెడ్డీ! మా కెవరిమీదా పక్షపాతం లేదు. ఎవరు దొమ్మీకి దిగితే వారిని బాదడం మా పని. మీ మనుషులే ఎక్కువ దెబ్బ తిన్నారంటున్నావు; గనుక నీ ముఠావాళ్ళే దొమ్మీకి దిగారని మేము భావించాల్సి వస్తుంది" అన్నాడు.

"మీరు చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారు. గురివిరెడ్డికి పై ఆఫీసర్లలో ఉన్న బలాన్ని చూసి, మీరు అతనికి సపోర్ట్ చేస్తున్నారు. మేము కూడా దీనికి ప్రతిక్రియ చేయవలసి వస్తుంది. మీ విధి ఏమిటో, అధికారమెంతో మాకూ తెలుసు. చట్టాన్ని మీ చేతిలోనికి తీసుకుని, గురివిరెడ్డికి సాయం చేయదలుచుకుంటే నేనేమీ భయపడను; జరిగేదేదో జరిగి తీరుతుంది" అంటూ లేచి బయటకు వచ్చాడు.

శ్రీరెడ్డి వెంట వంద మందికి పైగా ఉన్నారు. వారి వద్ద కర్రలున్నాయి. సూపరింటెండెంట్ చూసి కూడా వారిని ఆపలేదు. శ్రీరెడ్డి ఇంటికి వచ్చేటప్పటికి ప్రొద్దు పూర్తిగా వాలిపోయింది. జాతర పెద్దలు చేయవలసిందేదో చేసుకుంటున్నారు. శ్రీరెడ్డి మాటలకు తికమక పడ్డ సూపరింటెండెంట్ ముందు పరిస్థితి గురించి సమీక్షిస్తున్నాడు.

అందరూ శ్రీరెడ్డి ఇంట చేరారు. ఆవేశాలతో ఉన్నారు. ఇంతవరకూ చెంచురెడ్డి హయాంలో అతని వర్గం ఎన్నడూ క్రిందుగా కాలేదు. గోపిరెడ్డి నడిపిన సంవత్సరంలో కూడా క్రింద గాకుండా

తనమాట నెగ్గించుకోడానికే పోరాడి జయిస్తూ వచ్చాడు. శ్రీరెడ్డి హయాంలో పోలీసు వర్గం కూడా వ్యతిరేకమయింది. ఇది శ్రీరెడ్డికి భరింపరాని పరాజయంగా పరిణమించింది. నాయకత్వంలోనికి రావడమే పరాజయంతో రావడం తలకొట్టేసినట్లయింది. వసారాలో మంచం మీద కూర్చున్నాడు. మంచాల మీదా, క్రిందా, తిన్నెలమీదా అందరూ చతికిల బడ్డారు. మరికొందరు ఆవరణలో అటుఇటు తిరుగుతున్నారు.

చాలా సేపు శ్రీరెడ్డి మాట్లాడలేదు. ఉన్నట్లుండి అడిగాడు. "ఒరేయ్! ఈ రోజు జాతర ప్రోగ్రాం ఏమిటి?" అని.

ఒకడుచెప్పాడు. ఈరోజు 'బుర్ర కథ' అని. శ్రీరెడ్డి లేచి లోనికి వెళ్ళాడు. అతన్ని అనుసరించాడు రాంరెడ్డి; ఆ తర్వాత ఏసుదాసు! శ్రీరెడ్డికి కుడిభుజం ఏసుదాసు. శ్రీరెడ్డి కొరకు తన ప్రాణమయినా అర్పించగలడు. వారిద్దరూ చిన్ననాటి స్నేహితులు. జరిగిపోయిన పంచాయతీ ఎన్నికలలో మాలలు ఎక్కువమంది పాల్గొనక పోవడం కూడా అతని వల్లనే! శ్రీరెడ్డి ఎటూ తేల్చుకోక పోవడంతో, దాసు వర్గం కూడా ఒక్క ఓటు పోల్ చేయలేదు. అయినా వారి పేరుతో దొంగ ఓట్లు పోలయ్యాయి. అది వేరేకథ! ప్రతి ఎలెక్షన్‌లోనూ దొంగ ఓట్లే అసలు ఓట్ల కంటె ఎక్కువ పడుతూ ఉంటాయి.

"ఏం చేద్దామంటారు రాంరెడ్డీ?" అన్నాడు శ్రీరెడ్డి. రాంరెడ్డికి ఏమిటో అర్థం కాలేదు. కాలేదన్నట్లు ప్రశ్నార్థకంగా చూశాడు.



"ఈ రోజు రాత్రి గురివిరెడ్డి ఇంటి మీద పడదామని నా ఉద్దేశం! మనం వెనుకకు తగ్గే కొద్దీ, పరాజయాలే ఎదురవుతాయి. గురివిరెడ్డి పడిపోతే ఆ వర్గం పూర్తిగా నాశనంగాకున్నా బాగా దెబ్బ తింటుంది"

గురివిరెడ్డిని దెబ్బతీయాలని శ్రీరెడ్డి నోటి వెంట వస్తుందని వారిద్దరూ ఊహించి ఉండరు. అందుకే కొద్దిసేపు నిర్వాణులయ్యారు.

"తొందర పడవద్దు రెడ్డీ! ఉద్రేకం మీద ఆలోచించవద్దు. కాదూ, దిగాలంటే మేమందరం మీ మాట ప్రకారం గంగలోనయినా దిగుతాం. అయినా మీరు ఆలోచించండి" ఏసుదాసు అన్నాడు.

"ఆలోచించేదేమీలేదురా! నేను పూర్తి నిర్ణయానికి వచ్చిన తరవాతే మాట్లాడుతున్నాను. గురివిరెడ్డి ఉండటమే మనకు ముప్పు గురివిరెడ్డి మా నాన్నను చంపించాడో, లేదో నాకు తెలియదు. అయినా అతని అలుసు లేకుండా, కొడుకులు ఇంత తెగించ గలరని నేను అనుకోడంలేదు. అలాగే గోపి హత్యలో ఎంత బాధ్యుడో నాకు తెలియదు. అదీగాక వారు గురివిరెడ్డి వల్లనే పైస్థాయిలో బలం సంపాదించుకుంటున్నారు. గురివిరెడ్డి పడిపోతే ఆ వర్గం నిలబడే స్థితిలో ఉండదు"

"నీ యిష్టంరెడ్డీ! నీవు చెప్పింది చేయడానికి మేము సిద్ధమే!" అన్నాడు ఏసుదాసు.

"బుర్రకథ వద్ద పోలీసులు ఎక్కువగా ఉంటారు. జనంకూడా ఎక్కువగా బుర్ర కథ వద్దనే ఉంటారు. గ్రామంలో ఇద్దరు, ముగ్గురు కానిస్టేబుల్స్ బీటు తిరిగినా వారు మనల్ని ఏమీ చేయలేరు. అందరూ అవసరం లేదు. మెరికల్లాంటి యువకులు ఇరవై మంది చాలు"

అర్థమయినట్లు తలూపాడు రాంరెడ్డి. ఎవరంతకు వారు సర్దుకున్నారు. శ్రీరెడ్డి ఇంటి వద్దనే వందమందికి పైగా పడు కున్నారు. గోపిరెడ్డి వెంట తిరిగినవారు శ్రీరెడ్డికి సహాయం చేయరని భావించారు. కాని అందరూ కలిశారు. చెంచురెడ్డి ఉన్న ప్పటి బలం తిరిగి ఏర్పడింది.

శ్రీరెడ్డికి రాత్రి అన్నం తినడానికి సహించలేదు. గురివిరెడ్డితో కలిసి ఈ గ్రామం బాగుచేద్దామని ప్రయత్నించాడు. అది సాధ్యం కాదనీ, ఇక ఏ మాత్రం జాప్యం జరిగినా గోపిలాగే తన్నుకూడా చేస్తారనీ తెలుసుకోగలిగిన శ్రీరెడ్డి, గురివి రెడ్డిని చంపడం ఒక్కటే మార్గంగా భావించాడు.

పార్వతి పాల గ్లాసు తీసుక వచ్చి ఇచ్చింది పాలయినా తాగమని. వారిద్దరి మధ్యా కలిసి మాట్లాడే తీరిక తక్కు వయింది. శ్రీరెడ్డికి పని ఎక్కువయింది. పార్వతి కుమిలిపోతున్నది తనకు తానే!

"కూర్చో!" అన్నాడు శ్రీరెడ్డి. అతని ప్రక్కనే మంచంమీద కూర్చుంది.

"నీ ఉద్దేశమేమిటో తెలుసుకుందామను కుంటున్నాను. కాని అడిగే దానికి అవ కాశం కలిసి రావడంలేదు. ఇప్పుడు చెప్పు ఎవరు కావాలి? నేనా? మీ పుట్టిల్లా?"

ఆ సూటి ప్రశ్నకు పార్వతి బిత్తర పోయింది. అంత సూటిగా ఒకనాడు తన అత్తను చెంచురెడ్డి అడిగాడని ఆమె చెప్పింది. అదే ప్రశ్న నేడు తనను అడుగుతున్నాడు. చెంచురెడ్డికీ, శ్రీరెడ్డికీ ఉన్న తేడా ఏమిటో ఆమెకు అర్థం కాలేదు.

"జవాబు చెప్పు!" అన్నాడు తిరిగి. ఆమె పరధ్యానం విడిచి అతని ముఖంలోకి చూసింది. ఆ ముఖంలో ఎలాంటి భావాలు లేవు. నిరాసక్తంగా ఉంది.

"ఏమని చెప్పాలి బావా! నీవు నా మెడలో తాళికట్టావు. వాళ్ళు పదిహేనేండ్లు పెంచారు. నుయ్యిలో చూకాలో, గొయ్యిలో దూకాలో నాకు తెలియడం లేదు."

"మరేం ఫర్వాలేదు. నీ మనస్సులో ఉన్నది నిష్కల్మషంగా చెప్పు! నీవు ఎటు ఉండదలచుకున్నా ఒక్కటే! నీవు నా భార్యవుగనుక అడుగడం నా విధి"

"నేనేమీ చెప్పలేను" అంది ఏడుస్తూ. "నాకు అందరూ కావాలి" అంది రోదిస్తూ "నాకు అందరూ ఒక్కటే! తేడా ఏమీలేదు"

ఈ ఆడవారితో వచ్చే బాధ ఇది ఒక్కటే! కదిలిస్తే ఏడ్పులే అనుకున్నాడు.

"పారూ! ఇక నీ పుట్టింటి వారితో నేను కలవలేను. ఆనాటి పరిస్థితుల్లో నిన్ను పెళ్ళాడాను. ఈ రకం పెండ్లి భవిష్య తులో ఆ కుటుంబం-ఈ కుటుంబం మధ్య ఎన్నడూ జరుగకుండా చూస్తాను. అది తర్వాత ప్రశ్న! ఇప్పుడు నిన్నేం చెయ్యాలి? ప్రస్తుతం ఇదే నా బాధ. నీ అభిమానం ఎక్కువగా పుట్టింటి వైపే ఉంటుందని నాకు తెలుసు. మా అమ్మ పుట్టింటి సంబంధం త్రెంచుకునేటప్పటికి నేను పుట్టాను. నా కొరకు ఆమె పుట్టిం టితో సంబంధం త్రెంచుకుంది. నీవు అట్లా కాదు. మనకు వివాహం జరిగి సంవత్సరం పూర్తికాలేదు. ప్రస్తుతం నీవు గర్భవతివే అయినా, గ్యారంటీగా పిల్లలు కలుగుతా రనే నమ్మకంలేదు. పిల్లలు కలుగకుంటే నీ అభిమానం అటూ ఇటూ ఉంటుంది. మరి ఆత్మను చంపుకొని నన్నే అభిమా నించమని చెప్పలేను. నిర్ణయించుకో! నీకు టయమిస్తున్నాను" అంటూ లేచివెళ్ళాడు. పార్వతి ఏడ్వడం లేదు. ఏడ్చి ఏడ్చి

విసుగు పుట్టింది. కండ్లల్లో నీరు కూడా లేదు. తను ఏకాకి. ఓదార్చడానికి కనీసం అత్తకూడాలేదు. నిజమే! తనకు పుట్టింటి మీద అభిమానముంది. అభిమానం భర్తను దూరం చేసుకోవడానికి కాదు. తను భారత స్త్రీ! ఈ భారత స్త్రీ ఎంత హీనంగా అయినా, భర్తతోనే కాపురం చేయాల్సిన స్థితిలో ఉంది. ప్రక్కకు వైదొలిగితే కుక్కకంటే హీనంగా అవుతుంది. ఈ దేశపు స్త్రీ దాస్యానికి ప్రతిరూపం ఈ సంఘటన కూడా! తనకు ఇష్టంలేకున్నా పడి ఉండాలి.

నిజానికి భర్తంటే తనకు ఇష్టం లేక కాదు; ప్రేమ లేకా కాదు, అతని కొరకు తానేమీ త్యాగం చేయలేననీకాదు. అటు పుట్టింటితో పాటు ఇటు భర్తనూ గాఢంగా ప్రేమిస్తున్నది. కాని ఒక ఒరలో రెండు కత్తులిమడవు. ఒకటే ఇముడుతుంది. తన పరిస్థితీ అంతే! ఇద్దరినీ అభిమానిస్తున్నది.



అయితే ఇప్పుడు ఒకరినే ఎన్నుకోవాలి. రెండవ వ్యక్తిని విడువడం అంత సులభం కాదు. విడువదలచుకున్నా తండ్రిని విడువవలసిందే కాని భర్తను కాదు. ఆమె ఆలోచిస్తూనే పడుకున్నది.

బయట కావలసిన సరంజామాలు తయారుచేసుకుంటున్నారు. బాంబులు, డైనమైట్లు, పిస్తోళ్ళు తీసుకున్నారు. ఈటెలు, కట్టెలు ఎవ్వరూ తీసుకోలేదు. ప్రతి వ్యక్తికీ పిస్తోలుంది. నడుముకు కట్టుకున్న బెల్టులో తూటాలసంచి ఉంది. పిడికత్తులున్నాయి. ఐదు గురి వద్ద బాంబు సంచులున్నాయి. ఒకడు డైనమైట్లు తీసుకున్నాడు. గోపిరెడ్డి చచ్చి నెల కూడా పూర్తి కాలేదు. గ్రామంనిండా పోలీసు బలగాలే! తెగించి ఈ విధంగా సాగుతారనే భయం గురివిరెడ్డికీ ఉండదు. క్యాంపు వేసిన సూపరింటెండెంట్ కూ ఉండదు.

రాత్రి ఒంటి గంటయింది. అమావాస్య గాడాంధకారం. ఆకాశంలో చుక్కలు కన్పించడం లేదు. చలి బాగా వీస్తున్నది. బుర్ర కథవద్ద జనం గుమిగూడి ఉన్నారు. వారి హాస్యానికి పోలీసులు పగలబడి నవ్వు కుంటున్నారు-సిద్ధంగా ఉన్న ఇరవై మంది గుంపుగాకాక ఒకొరొకరుగా కదిలారు. ముందు ఏసుదాసు, అతని వెంట మరి నలుగురు, ఆ వెంట రాంరెడ్డి, ఆ వెనుక శ్రీరెడ్డి. శ్రీరెడ్డి వెనుక మిగిలినవారు నడుస్తున్నారు. వారి దగ్గర కర్రలు లేవుగనుక, మనిషిని గుర్తుపడితే కష్టం గానీ, లేకుంటే బుర్ర కథ విని వెళ్తున్న పరాయి గ్రామస్థులుగా భావిస్తారు.

గురివిరెడ్డి పడుకునే ఇంటి వద్దకు చేరారు. సంక్రాంతి మబ్బులు దోబూచు లాడుతున్నాయి. ఎటు చూసినా చిమ్మ చీకటి. ఏమీ కన్పించడం లేదు. గురివిరెడ్డి సంసారం ఉన్న ఇల్లు అక్కడికి యాభై గజాల దూరంలో ఉంది. గురివిరెడ్డి పడుకొనుటకు ప్రత్యేకంగా చిన్న గది ఉంది. అతడేకాక, అతనికి తోడు మరికొంత మంది అక్కడ పండుకుంటారు. అది ఉక్కులాంటి రూం! ఉక్కు తలుపుల్తో ప్రత్యేకంగా అమర్చ బడింది. ఆ యింటిని డైనమెట్లతో ప్రేల్చి, కూల్చి పడవేయ వలసిందే గానీ, తలుపులు పగుల గొట్టడం, తీయడం సాధ్యం కాదు. అంత బలంగా కట్టు దిట్టంగా నిర్మించారు. ఇంటి చుట్టూ డైనమైట్లు పేర్చారు. మొత్తం పది డైనమైట్లు. అందరి చేతులలోనూ తూటాలు నింపిన పిస్తోళ్లున్నాయి.

అన్నీ పేర్చిన తరువాత శ్రీరెడ్డి వద్దకు వచ్చాడు ఏసుదాసు. "రెడ్డీ! నీవూ రాంరెడ్డి వెళ్ళండి. మేము చేయవలసింది చేస్తాం! ఇక ఈనాటితో గురివిరెడ్డి పని అయి పోతుంది. మీరు ఉన్నట్లు అనుమానం ఉండ కూడదు."

శ్రీరెడ్డి అక్కడే ఉందామనుకున్నాడు. ఆలోచిస్తే తాను దూరంగా ఉండడమే మంచిదని నిర్ణయించుకున్నాడు; పది మంది అక్కడే ఉన్నారు. పదిమందితో రాంరెడ్డి, శ్రీరెడ్డి ఇంటికి వచ్చారు. ఇంటి వద్ద మనుషులు చాలామంది నిద్రపోతు న్నారు. కొందరు మేలుకొని ఆరు బయట పహరా కాస్తున్నారు. శ్రీరెడ్డిని చూసి అతని దగ్గరగా వచ్చారు. వారితో శ్రీరెడ్డి ఏమీ మాట్లాడలేదు. బయట వేసిన మంచం వద్దకు వెళ్ళి నిలబడ్డాడు. అంతలోనే ఆకాశం దద్దరిల్లింది. ధాం, ధాం అంటూ మార్మోగింది. చెవులు చిల్లులు పడ్డాయి. కేకలు, అరుపులు విన్పిస్తున్నాయి. శ్రీరెడ్డి ఇంటిముందు పడుకున్న వారం దరూ ఉలిక్కిపడి తత్తరపాటుతో లేచి,




కత్తులు వెతుక్కుంటున్నారు. గ్రామం రణగొణ ధ్వనిగా తయారయింది. పోలీసుల విజిల్స్, బూట్ల చప్పుడు విని పిస్తున్నాయి.

శ్రీరెడ్డి తల పట్టుకొని మంచంమీద కూలబడ్డాడు. అతని చుట్టూ మనుష లందరూ చేరారు. వారందరినీ శ్రీరెడ్డి పిచ్చిగా చూస్తున్నాడు. తాను ఏం చేశాడో అర్థమవుతూనే ఉంది. తన మామను తానే చంపానని ఇప్పుడు ఆలోచిస్తున్నాడు. పాత పగలు, గోపిరెడ్డి చనిపోవడం ఇప్పు డతనికి జ్ఞాపకం రావడం లేదు. మామను నాశనం చేశానే అన్న పశ్చాత్తాపం అతనిలో పుట్టింది.

మరికొంచెం సేపటిలో సూపరింటెండెంట్ శ్రీరెడ్డి ఇంటి వద్దకు వచ్చాడు. గురివిరెడ్డి ఇల్లు డైనమెట్లతో కూలడం; అందులో నున్న గురివిరెడ్డి చావడం వివరంగా చెప్పాడు. 'ఆ పని చేయించిందినువ్వేనా ?' అని సూటిగా ప్రశ్నించాడు. తనకేమీ తెలియదన్నాడు శ్రీరెడ్డి. అక్క డున్న వారిని పరకాయించి చూసి, తల పంకించి వెళ్ళి పోయాడు సూపరింటెండెంట్. ఈ రణగొణ ధ్వనులతో పార్వతి దద్దరిల్లి లేచింది. ఆమె తలుపు దగ్గరకు రావడం చూసి శ్రీరెడ్డి లేచి లోనికి వెళ్ళాడు.

"ఏమయింది బావా ? ఆ శబ్దాలేమిటి?" అడిగింది. శ్రీరెడ్డి ఆమెతో నిజం చెప్పడా నికి అప్పుడు నిజంగానే జంకాడు. "ఏమిటి ? ఏమయింది ?'' తిరిగి ఆత్రు తతో ప్రశ్నించింది.

చాలా నిదానంగానే చెప్పాడు శ్రీరెడ్డి. "మీ నాన్న చంపబడ్డాడు" వార్త విన్న పార్వతి తూలి క్రింద పడింది. నిశ్చేష్ట అయింది. ఐదు నిమిషాలు పిచ్చిగా చుట్టూ కలయ చూసింది. ఆమె ఏడవడం లేదు. ఆవేశ పడుతున్నది.

"నువ్వే... నువ్వే చేశావు." ఆమె పిడికిలి బిగుసుకుంటున్నది. ఆవేశంలో బుసకొడుతున్నది. శ్రీరెడ్డి మాట్లాడ లేదు. ఆ సమయంలో మాట్లాడడం, ఊరడించ డం అవివేకమని తెలుసు. కొంచెం సేప టిలో ఆమె పౌరుషం, దిమ్మెరపాటు తగ్గి పోయింది. ఘొలు ఘొలున రోదించ సాగింది. శ్రీరెడ్డి ఆమె తల నిమురు తున్నాడు. ఆమె కన్నుల ముందు శ్రీరెడ్డి కన్పించడం లేదు. చనిపోయిన గురివిరెడ్డి కన్పిస్తున్నాడు. అల్లారు ముద్దుగా పది హేనేండ్లు పెంచి, పెద్దచేసిన వ్యక్తి అవు పిస్తున్నాడు. ఆమె నెమ్మదిపడువరకూ మాట్లాడడం మంచిది కాదని, పని మనిషిని అక్కడే ఉండమని చెప్పి బయటకు వెళ్ళాడు శ్రీరెడ్డి.




కేసు నమోదయింది. విచిత్రమేమిటంటే ఆ కేసులో శ్రీరెడ్డి ముద్దాయి కాడు. శ్రీరెడ్డిని విడిచి ప్రథమ ముద్దాయిగా రాం రెడ్డిని ఇరికించారు. చంపించిన వాడు శ్రీరెడ్డి అని అందరికీ తెలుసు. సర్వ బాధ్యుడూ అతనేనని పోలీసు ఆఫీసర్లకూ తెలుసు. అయినా బలరాంరెడ్డి శ్రీరెడ్డికి ఎట్టి సంబంధం లేదనీ, అతను ముద్దాయి కాడనీ చెప్పడంతో; హతుడి కుమారుడే

ఆ విధంగా సాక్ష్యమిచ్చినపుడు పోలీసులు చేసేదేమిటి ?

బలరాంరెడ్డి ఆలోచనలు వేరు. అందరినీ జైల్లో పారేస్తే బయటతిరిగే శ్రీరెడ్డిని సులభంగా చంప వచ్చని అతని ఉద్దేశం. శ్రీరెడ్డిని చంపి తీరాలని వారి పట్టుదల. ఆ నాడు అన్నపూర్ణమ్మ రెండు కుటుంబాల మధ్య ఏ విధంగా కన్పించలేదో, నేడు పార్వతీ అలాగే అయింది. తండ్రిని చూడటానికి పార్వతి రాలేదు; రాదని వారికీ తెలుసు. పోకూడదని పార్వతికీ తెలుసు. ఈ ఇల్లు విడిచి బయటికి పోవడమంటే, తిరిగి ఈ ఇంటికి రావడం అసంభవమనీ తెలుసు. ఆమె సాంప్రదాయ కుటుంబం నుండి వచ్చింది. ఆ సంప్రదాయం నాశనం చేసుకోగల శక్తి లేదు. ఆమె ఎంత క్షోభించినా, గుండెలు పగిలేలా రోదించినా, వినే నాథుడు లేడు. జాలి తలచేవారు లేరు.

పరిస్థితి కొంత సద్దు మణిగింది. గురివిరెడ్డి పోవడం ఆ వర్గానికి తీరని లోటే ! అయినా ఆ లోటు పూడ్చుకోగలమని బలరాంరెడ్డి భావించాడు. ఇప్పుడు ఆ వర్గ నాయకుడు బలరాంరెడ్డి. శ్రీరెడ్డిని నాశనం చేయడం అతని ప్రధాన కర్తవ్యాల్లో ముఖ్యం. ఒక్క శ్రీ రెడ్డినే కాదు; ఆ కుటుంబంలోని మిగిలిన వారినికూడా పూర్తిగా నాశనంచేయాలి! ఆకుటుంబంఇక బ్రతికి ఉండకూడదన్నమాట! ఆ గ్రామం బాగుపడాలంటే, ఈ రెండు కుటుంబాల్లో ఒకటి మాత్రమే భూమిమీద ఉండాలి. రెండూ ఉండకూడదు. అంత సులభంగా శ్రీరెడ్డి చిక్కడని అతనికి తెలుసు. డెబ్బైమంది కేసులో అరెస్ట్ చేయబడ్డారు. వందమంది ఇంటిచుట్టూ కాపలా ఉన్నారు. వీరికితోడు పోలీసుగ స్తీ మరింత ఎక్కువ చేశారు. శ్రీరెడ్డికి అపాయం కలిగించగలరనే పోలీసు ఆఫీసర్లు భావించి, ఆ ఇంటి మీద పోలీసు రక్షణ ఉంచారు. అప్పటికప్పుడే ! అక్కడికక్కడే పరిస్థితిని పరిశీలించి, అవసరమైతే కాల్పులకు ఆర్డరివ్వగల మేజిస్ట్రేటు హోదాగల వ్యక్తిని అక్కడ నియమించారు. ఇంత కట్టుదిట్టాల మధ్యనున్న శ్రీరెడ్డిని, తాము ఏమీ చేయలేమని వారికి తెలుసు. అయినా అవకాశం దొరకకపోదు. గోపిరెడ్డిని చంపగలరని ఎవరూ ఊహించలేదు.చచ్చాడు. ఇదీ అంతే! వారి ఉద్దేశం అది.

పార్వతి బలహీనంగా తయారయింది. అయినా మనస్సు గట్టి చేసుకున్నది. నేడో, రేపో ప్రసవించబోతున్నది. మగవాడే పుడితే ఈ గ్రామానికి మరొక యముడే అవుతాడు. ఈ ఆలోచన ఆమె మనసు లో మెదిలినప్పుడు, అంతబాధలోనూ నవ్వు వస్తూంది. తాను కనబోతున్నది బలిపశువునే! మొగవాడే కలిగితే, పదిహేనేండ్లనుండే, కర్రపట్టి తిరుగుతాడు. తానూ, తన తండ్రులకేమీ తగ్గనని తెలియచేయగలడు. అత్త నలుగురిని కని తయారుచేసింది. ఇక తన వంతు ఎందరో! శ్రీరెడ్డిమీద ఆమెకు ద్వేషం లేదు. కాని, మునుపటిలాగ మాట్లాడాలంటే విరక్తి కలుగుతున్నది. శ్రీరెడ్డి, పార్వతిని తనంతకు తానుగా పలుకరించడమేలేదు. అవసరమైతే పార్వతే పలుకరించాలి.

మరొక నెలకు ఆమె ప్రసవించింది. మొగవాడే పుట్టాడు. పుట్టింటితో సరి అయిన సంబంధాలుంటే ఈ పాటికి ఎందరో వచ్చివెళ్ళేవారు. ముఖ్యంగా తన తల్లి ఎంతో ఉత్సాహంతో వచ్చేది. ఆ

ఇంటి కాకి, ఈ ఇంటిమీద వాలడంలేదు. ఇంకెవరు వస్తారు? అయినా వచ్చేవారు ఇతరత్రా వస్తున్నారు. ఆ గ్రామంలోని వందలాది ఆడవారు, ఆ తల్లీ బిడ్డను చూస్తూనే ఉన్నారు.

రాంరెడ్డిని బెయిల్ మీద తీసుకరావడానికి శ్రీరెడ్డి తిరుగుతున్నాడు. మిగిలినవారిని విడిపించడం పెద్దపనికాదు. మొదటి ముద్దాయిని విడిపించడమే కష్టం! అంతేగాక—రాంరెడ్డి ఇంటికి తిరిగి వస్తే దౌర్జన్యాలకు దిగుతారనీ, కొందరు సంసారాలు విడిచిపోవలసి వసుందనీ, అటువర్గంవారు పిటిషన్‌లు పెట్టారు. ఆ పరిస్థితిలో బెయిల్ పుట్టడం అసంభవంగా ఉంది. అయినా ఆశ చావదు; పోరాడుతున్నాడు. కొడుకుపుట్టిన సమయానికి అతడు సంద్యాలలో ఉన్నాడు. వార్త మరుసటిరోజు అందింది వెంటనే రావడానికి ఆరోజు పాతకేసు వాయిదా ఉంది. మరుసటి రోజు వచ్చాడు; వచ్చి పుత్రుని చూశాడు. భర్తను చూసి పార్వతి నిరాసక్తంగా నవ్వింది. ఆమె నవ్వు శ్రీరెడ్డికి సంతోషం కల్పించింది. "పారూ! నేననుకున్నట్లే బాబు పుట్టాడు" అన్నాడు.

ఆమె కూడా నవ్వింది. "నీవు మా అత్తకు పుట్టినట్లే వీడు నాకు పుట్టాడు" అంది. ఆ మాటకు అర్థమేమిటో శ్రీరెడ్డికి తెలియకున్నా, ఆ సమయంలో ఆమెను బాధ పెట్టడమెందుకని ఊరుకున్నాడు. అక్కడే కుర్చీ వేసుకొని కూర్చున్నాడు. ఇంకా ప్రొద్దు ఉన్నా లైటు వెలుగుతోంది గదిలో!

"రాంరెడ్డి కొద్దిరోజులలో వస్తాడు; బెయిల్ పుడుతుంది" చెప్పాడు.

తల త్రిప్పి అతని వైపు చూసింది. ఆమె కను కొనుకుల్లో నీరు నిలిచింది. తన తండ్రిని చంపిన నేరం మీద రాంరెడ్డి జైలుకు వెళ్ళి, తిరిగి వస్తున్నాడు. నిజంగానే చంపిన వ్యక్తి తన ముందున్నాడు.

"ఏడుస్తున్నావా?" ఆమెను చూసి కలవరపడుతూ అన్నాడు. తల అడ్డంగా తిప్పింది.

"ఈ కక్షలూ, పగలూ ఇక మీరు మానుకోలేరు. వారూ మానుకొనరు. మీ మధ్య నలగడం నావంతయింది. జరిగింది జరిగిపోయింది. జరిగిందాన్ని గురించి నేను విచారించడం లేదు. మా అన్నగారు ఊరకుండరు. వారు కూడా ఏదో ఒకటి చేయడానికి పూనుకుంటారు. నా బాధ ఒక్కటే! నీవు సుఖంగా వుండాలని భార్యగా నేను కోరుతున్నాను. ఇప్పట్లో నాకు ఇంతకంటే వేరే ఆలోచన లేదు. నీవు జాగ్రత్తగా ఉండడం ముఖ్యం! అనవసరంగా బయట తిరగవద్దు. నిన్ను నమ్ముకొని నేను బతుకుతున్నాను. ఈ లోకంలో ఇప్పుడు 'నా' అనే వ్యక్తి నీవే! నాకు కావలసింది నీవు సంతోషంగా, సలక్షణంగా ఉండడం!" కన్నీరు తుడుచుకుంటూ అన్నది. "నా పుట్టింటిని గురించి ఆలోచించ కూడదని వీడు పుట్టాడు. వారి సుఖం నేనిప్పుడు ఆలోచించడం లేదు. ఇంతవరకూ నాకు భర్త ఒకడితోనే సంసారబంధం ఉంది. ఇప్పుడు పిల్లలతో కూడా ఏర్పడింది. ఈ బంధాలు త్రెంచుకోలేను; అది సాధ్యం కూడా కాదు. నేను మనస్ఫూర్తిగా, మనస్ఫూర్తిగా కోరేది ఒక్కటే! అది నా కుటుంబంలో ఏ వ్యక్తీ దెబ్బ తినకూడదని!"

శ్రీరెడ్డి ఆమె వైపు తలెత్తి చూశాడు. ఆమె పిల్లవాడి వైపు చూస్తున్నది. ఇంతవరకూ ఆమె భార్యగా అటు ఇటు ఊగిసలాడుతున్నది. ఇక పుట్టినింటితో తన

కెలాంటి బాంధవ్యం ఉండదు. ఒక బిడ్డ తల్లిగా స్థిర నిర్ణయానికి వస్తున్నది. తన కుటుంబం తనకు ఏర్పడింది.




ఇరు వర్గాలకు తిరిగి రాజీ చేయాలని పోలీసు అధికారులు విఫల ప్రయత్నం చేశారు. సాధ్యం కాలేదు; ఇద్దరూ కూడా అందుకు ఒప్పుకోలేదు. శృతిమించబడ్డ ఆవేశాలు, పగలు, కక్షలు వీరిని ఏకం చేయలేక పోయ్యాయి.

ఎలాగయినా శ్రీరెడ్డిని చంపడమే వారి లక్ష్యం! బలరాంరెడ్డి అందుకే తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాడు. గ్రామంలో వారికి పెద్ద బలం లేదు. కొంతవరకూ ఉన్నా, శ్రీరెడ్డి బలం ముందు అల్ప సంఖ్యా మాత్రమే! శ్రీరెడ్డి ఇప్పట్లో బయట ఒంటరిగా దొరకడం అసాధ్యం! అతన్ని చంపాలంటే ఇంటి మీదనే పడాలి. శత్రువు ఇంటి మీద దాడి ఎలా చేయాలో తెలిసిన వాడు; ఆ దాడి తనమీద జరుగకుండా బలమైన కట్టుదిట్టం చేసుకోగలడు. కాబట్టి శ్రీరెడ్డిని తూ తూ మంత్రాలతో ఏమీ చేయలేమని బలరాంరెడ్డికి తెలుసు. అంతేగాక గ్రామంలో పోలీసు బలగం బలంగా ఉంది. ఈ పరిస్థితిలో చేయి చేసుకోవడం మంచిదిగా అగుపించడం లేదు. దెబ్బ్య చేసుకోవడమంటే విజయం సాధించ గలగాలి. లేని పక్షంలో అన్ని విధాలా అభాసుపాలవ వలసి వస్తుంది. తీవ్రంగా ఆలోచించారు బలరాంరెడ్డి, నాగిరెడ్డి. క్రింద తమ అనుచర వర్గంతోనూ; పైన పెత్తండ్రి, పిన తండ్రులతోనూ ఆలోచించిన తరువాత ఒక పథకం నిర్మించారు. ఆ పథకం ప్రకారం శ్రీరెడ్డి ఇంటి మీద మెరుపు దాడి చేయాలి. ఆ దాడిలో ఒకరో ఇద్దరో కాదు, వందల సంఖ్యలో సాయుధులుండాలి. వారిని వివిధ గ్రామాల నుండి సమీకరించాలి. పగలు గ్రామంలో ఎలాంటి సంచలనం లేకుండా ఉంది; అర్ధరాత్రి హఠాత్తుగా గ్రామాన్ని చుట్టుముట్టి, శత్రువుల కొంపలకు నిప్పు పెట్టాలి. శత్రువు అనుచరులు తమ ఇళ్లు ఆర్పుకొనుటకు ప్రయత్నిస్తారు; వస్తువుల్ని బయటకు లాగుటకు ప్రయత్నిస్తారు. అందువల్ల శ్రీరెడ్డికి వారు అందుబాటులో ఉండరు. ఒకరిద్దరు అతడి వద్ద ఉన్నా నాశనం చేయవచ్చు. మనిషికో రాయి చొప్పున తీస్తే ఆ యింటినే పెరికి వేయవచ్చు. శ్రీరెడ్డితో సహా అతని తమ్ముడు, అతని కొడుకు, అతని పినతండ్రి, పిన తండ్రి కొడుకులు మొత్తం అందరినీ నాశనం చేయాలి. టౌను లో చదువుకుంటున్న సురేంద్రరెడ్డిని చంపడం పెద్ద కష్టమేమీ కాదు. ఆ వంశం అంతటితో నశిస్తేనే, గ్రామంలో ఇక తమకు ఎదురు లేకుండా నిలబడవచ్చు.

ఇదీ వారి పథకం! పథకానికి కావలసిన డబ్బు తమ బంధువుల నుండి, వివిధ గ్రామాల నుండి చందాలు ప్రోగుచేసి తెచ్చారు. ఆశ్చర్యమేమంటే, శత్రువుల ప్రతి ప్లానూ సునాయాసంగా ఎప్పటి కప్పుడు తెలుసుకో గలుగుతున్న శ్రీరెడ్డికి ఈ పథకం గురించి ఏమీ తెలియక పోవడం. ఈ పథకం పన్నింది కేవలం గురివిరెడ్డి




కుటుంబ సభ్యులే! పథకాన్ని రచ్చకు తీసుకరాలేదు. గతంలో ఏ ప్లాను వేసినా అనుచరులతో కలిసి చర్చించి నిర్ణయించే వారు. అందులోనున్న ఎవడో ఒకడు డబ్బుకు ఆశపడి ఇటు చేరవేసేవాడు. శ్రీరెడ్డి వర్గం జాగ్రత్త పడేది. ఆ విధంగా జరుగుతుందనే బలరాంరెడ్డి ఊహించి తమ కుటుంబ సభ్యులకు తప్ప మిగిలిన వారికి తెలియకుండా ఆలోచించారు. అనుచరులకు చెప్పకున్నా వచ్చే నష్టమేమీ లేదు. నిద్ర పోవు వారిని లేపి, గొడ్డండ్లను తీసుకుని కదలమంటే కదులుతారు.

హత్యలకు సాధారణంగా చీకటి రాత్రుల్నే ఎంచుకుంటారు. అది అందరికీ అలవాటు. వెలుతురులో శత్రువు మీదికి ఎవడూ పోడు. పోవడం వల్ల శత్రువు తప్పించుకోవచ్చు; లేదా తమనే దెబ్బ తీయవచ్చు. బలరాంరెడ్డి కూడా చీకటి రాత్రినే యెంచుకున్నాడు. అమావాస్య రోజుగా నిర్ణయమయింది.

చుట్టూ గ్రామాలలోని తమ సహచర వర్గంనుండి మదతుగా ఎనిమిదివందలమంది గూండాలను సేకరించారు. రాత్రి తొమ్మిది గంటల వరకూ ఏ గ్రామంలోనూ అలికిడి లేదు. బలరాంరెడ్డికి ఏఏ గ్రామాల్లో సహచరులున్నారో, అక్కడ శ్రీరెడ్డికీ ఉన్నారు. ఒక వర్గంవారు కర్రలు తీసు కుంటే, రెండో వర్గం, అన్ని గ్రామాల్లోని తమ సహచరులకు వివరాలు అందచేస్తారు. అందువల్ల సాధారణంగా అందరూపడుకునే వేళ వరకు అలికిడి లేకుండా చేశారు. పది గంటల వేళ ప్రతి గ్రామానికీ లారీ పంపారు. మొత్తం ఇరవై లారీలు. ప్రతి వ్యక్తికి టార్చి, కర్ర, కత్తి ఇచ్చారు. ముఖ్యమయిన వంద మంది వద్ద పిస్తోళ్లు, మరి కొందరి వద్ద బాంబులున్నాయి. ఇద్దరు మెషిన్‌గన్‌లు తీసుకున్నారు.

ఒక్కొక్క గ్రామ యూనిట్‌కు ఒక డిని నాయకుడిగా నియమించారు. ఎవరి పని వారికి వివరించారు. ఒక యూనిట్ కొంపకు నిప్పు పెట్టడం, ఒక యూనిట్ బయటకు వచ్చేవారి తలలు పగుల గొట్టడం, ఒక యూనిట్ పైన గస్తీ, ఇంకో యూనిట్ పోలీసుల మీద నిఘా!

అది మహాయుద్ధ పథకమే! ఒక కుటుంబాన్ని నాశనం చేయడానికి కొన్ని లక్షల రూపాయలు ఖర్చు; పైగా ఎంతో మంది ప్రాణాలతో చెలగాటం. పెడి పల్లెకు కొంచెం దూరంలో ఉన్న నల్ల వాగు వద్ద కొన్ని లారీలు, ఉత్తరంవైపు కుందునది వద్ద కొన్ని లారీలు ఆగాయి. ఎనిమిది వందల మంది పెడిపల్లెను చుట్టు ముట్టారు. గ్రామం చుట్టూ జనం! దివిటీలు పట్టుకున్నారు ముట్టించకుండా! కిరోసిన్ డబ్బాలు సిద్ధంగా ఉంచారు. ఇంతకులోపలే కరెంటు ట్రాన్స్‌ఫారం ఆపుచేయడానికి నియమించినవారు అక్కడికి చేరారు. టెలిఫోన్ లైన్లు త్రెంచేశారు. ప్రాణాల కయినా తెగించే అనుచరవర్గం పోలీసు స్టేషన్ చుట్టుముట్టి వైర్‌లెస్ త్రెంచడానికి సిద్ధపడ్డారు. తలుపులు బిగించారు. డాబా పైకి ఎక్కి తీగలు త్రెంచేశారు. పోలీ సులు నిర్వీణ్ణులైపోయారు. బయట తుపా కులతో సిద్ధంగా ఉన్నవారు హెచ్చరిం చారు. "మీరు బయటకు రావడానికి ప్రయత్నించకండి. ఏ మాత్రం ప్రయత్నం చేసినా డైనమెట్లతో ఈ భవనాన్ని కూడా నాశనం చేస్తాం. చుట్టూ డైనమెట్లు సిద్ధం చేయబడ్డాయి." గత అనుభవం తెలిసిన పోలీసులు ఇది బెదరింపుగాదనీ, నిజంగానే డైనమెట్లు పేర్చి ఉంటారనీ నిశ్చయించుకున్నారు.

అందువల్ల సాహసించ దలచలేదు. తల చినా చావడం తప్ప లాభంలేదని వారికి తెలుసు.

విద్యుత్ దీపాలు గుప్పున ఆరి పోయాయి. శ్రీరెడ్డి మేడ మీద గదిలో పడు న్నాడు. ప్రక్క మంచంమీద భార్య, కొడుకు ఉన్నారు. ప్రక్కరూంలో రాం రెడ్డి, ఏసుదాసు ఉన్నారు. క్రింద చాలా మంది పడుకున్నారు. బయట ఇంటి చుట్టూ గస్తీ తిరుగుతున్నారు కొందరు. హఠాత్తుగా లైట్లు ఆరిపోవడంతో, ఆలో చనలతో ఇంకామేలుకొని ఉన్న రాంరెడ్డి లేచాడు. గదినుండి బయటకు వచ్చి మేడ పైనుండి క్రిందికి టార్చి వేశాడు. క్రింద నున్న వారు టార్చిలు పైకి వేశారు గుర్తింపు కొరకు! తలెత్తి చుట్టూచూశాడు. ఊరికి కొద్ది దూరంలో మిణుకు మిణుకు మంటూ కాగడాలు కన్పించాయి. అవి కాగడాలుగా అతడు భావించడంలేదు. అవి ఊరికి సమీపంలోనే ఉన్నాయని కూడా అతడు భావించడంలేదు. అయినా అనుమానం! ఏసుదాసును లేపి పైకి తీసుకవచ్చి చూపించాడు. దాసు చూసే సమయానికి ఆ దీపాలు కదులుతున్నాయి; ఊగుతున్నాయి. దాసు గుండెలు గుబ గుబలాడాయి.

"మోసం జరిగింది రాంరెడ్డీ!" అంటూ క్రిందకు ఉరికాడు. శ్రీరెడ్డి గది దగ్గరకు వచ్చి తలుపులు దబదబ బాదాడు. శ్రీరెడ్డి లేచి తలుపు తీశాడు.

ఆ పాటికే కొందరు ఈ శబ్దానికి కలవర పడి క్రింద నుండి పైకి వచ్చారు. అందరూ తిరిగి మేడ పైకి వెళ్ళి చూసేటప్పటికి, కొరివి దెయ్యాల్లా మండుతున్న కాగడాలు ఊరును సమీపించాయి. మాదిగ గూడెం మీద అవి వ్రాలాయి. గూడెం మంటలకు ఆహుతి అవుతున్నది.

"అయిపోయింది; సర్వనాశన మయింది" అన్నాడు ఒకడు వణికి పోతూ! శ్రీరెడ్డి చుట్టూ ఉన్నవారిని తేరి పార చూశాడు. వారు వణకుతున్నారు భీతితో! ధైర్యంగా ఉన్నవారు కొందరే!

"ఏం చేయాలి? సరే! ఆయుధాలు తీసుకోండి" అరిచాడు శ్రీరెడ్డి.

ఏసుదాసు వారించాడు. "వద్దు రెడ్డి గారూ! వారు చాలా పెద్ద పథకంతో మనమీదకు వస్తున్నట్లు అర్థమవుతున్నది. ఈ సమయంలో ఎదిరించడం సాధ్యం కాదు. పారిపోవడం తప్ప గత్యంతరం లేదు" అన్నాడు.

"ఇంత బ్రతుకు బ్రతికి పారిపోవ డమా? చచ్చినాసరే! ఆ పని చేయను." ఈ గడబిడకు పార్వతి లేచి బయటకు వచ్చింది. ఎర్రగా కాలుతున్న గ్రామం ఆమెకు దర్శనమిచ్చింది.

"బ్రతికుంటే తర్వాత కలుద్దాం! పారి పోకతప్పదు" అంటున్న రాంరెడ్డి మాటలూ విన్నది.

ఇక ఆలోచించలేదు ఏసుదాసు. గ్రామంలో కేకలు, అరుపులు, ఈలలు విన్పిస్తున్నవి. రోదనలు ఆరంభ మయ్యాయి. ఆలస్యం చేస్తే ఏమవుతుందో అందరికీ అర్థమవుతూనే ఉంది. పారిపోవ డానికి సిద్ధపడుతున్నారు. "ఉండు రాం రెడ్డీ" అంటూ పార్వతి క్రిందికి ఉరికింది. ఒక నిమిషంలో పిల్లవాణ్ని తీసుకొని పైకి వచ్చి, రాంరెడ్డి చేతికి అందించింది. ఆమె భావం అందరికీ అర్థమవుతూనే ఉంది. పిల్లవాడితో సహా రాంరెడ్డి భవనం ప్రక్కనే ఉన్న పెంటకుప్ప మీదకు దుమికాడు. ఒకరి వెంట ఒకరు కొందరు దుమికారు. దాదాపు యాభై మంది దాకా వున్నారు.

శ్రీరెడ్డి రూపం తెలియకుండా తలకు పెద్ద గుడ్డ పాగాలాగా చుట్టాడు. కట్టెలకు గుడ్డలు చుట్టి, వాటి మీద కిరసనాయిల్ పోసి, దివిటీలు పట్టుకున్నారు. వారిలాగే వీరూ కేకలేస్తూ సాగిపోతున్నారు. ఆ చీకటిలో ఎవరు ఎవరో ఎవరికీ తెలియడం లేదు. ఆ వచ్చిన వారందరూ ఒక గ్రామస్థులు కాదు. శ్రీరెడ్డి ఎట్లా ఉంటాడో, అతని మనుషులు ఏ విధంగా ఉంటారో ఇతర గ్రామాల వారికి తెలియదు. అదే వీరికి మంచి అవకాశమిచ్చింది. కేకలేసుకుంటూ, ముందుకు చూసుకుంటూ వెళ్తున్నారు. వారు తమ మనుషులేనని శత్రువర్గంవారు భావించారు. అటు మాదిగపల్లె మీదుగా వారు వస్తుంటే ఇటు కుమ్మరిపేట మీదుగా వీరు జారుకున్నారు. కాని, ఊరి వెలుపల చుట్టూ కాపలా ఉందని వీరికి తెలియదు. మనుషుల అలికిడి కావడంతో కాపలా ఉన్నవారు టార్చీలు వేసుకుంటూ ఎదురు వచ్చారు. ఏసుదాసుకు పరిస్థితి అర్థమయింది. కాపలాదారుల్ని గుర్తించ గలవారినే నియమించి ఉంటారు. శ్రీరెడ్డి హఠాత్ పరిణామం వల్ల స్తబ్ధతలో పడ్డాడు. రాంరెడ్డి చతురుడు కాడు. తాను ముందు నిలువకుంటే వారి ప్రాణాలు రక్షించడం సాధ్యం కాదు. అందువల్ల తానే ఆదేశించాడు వారికి!

"వచ్చేవారు కొందరే ఉంటారు. అందరూ ఊరిమీద పడ్డారు. వీరిని నాశనం చేయాలి. లేదా, కొంతసేపు అడ్డుకోవాలి. రెండుమైళ్ళ దూరంలోని డొక్కాపాడుకు వీరిని చేర్చి తీరాలి" అన్నాడు ఏసుదాసు.

"టార్చీలు వేసుకుంటూ వచ్చిన వారు పైడిపల్లె గ్రామస్థులే. వీరిని గుర్తుపట్టారు. గుర్తుపట్టిన వెంటనే ఈలవేశారు. ఈలమీద ఈల వేస్తూ అరుస్తున్నారు. ఈలకు ప్రతిగా ఈలలు వినిపించాయి. కేకలు, ఆ తర్వాత పరుగెత్తుతున్నట్లు శబ్దం.

"నాగడూ! మీద పడండి." అని అరచి శ్రీరెడ్డి చెయ్యి ఒకచేత, రాంరెడ్డి చెయ్యి ఒకచేత పట్టుకొని ముందుకు కదిలాడు ఏసుదాసు. వారి వెంట ఇంకా ఐదుగురు కదిలారు. పరుగు తీసుకున్నారు. మిగిలిన నలభై మంది వారితో ఢీకొన్నారు. ఆ వచ్చినవారు - పారిపోతున్నది వీరేనని నాగడి వర్గంమీద కలియబడ్డారు. అప్పటికీ శ్రీరెడ్డి తప్పించుక పోయినట్లు వీరు అర్థం చేసుకోలేదు. చూసినవారు చెప్పడానికి ఇంకా కొంత సమయం తీసుకుంది. ఆ చీకటిలో ఉన్నాడో, పారిపోయాడో తెలియదు. శ్రీరెడ్డి పారిపోయాడని తెలిసే వరకూ వారు శ్రీరెడ్డిని గురించి మాట్లాడలేదు. అక్కడికి తెచ్చిన దివిటీల వెలుగులో ఉన్నవారిని గుర్తించి "శ్రీరెడ్డి పారిపోయాడు. వెంట పడండ్రా!" అంటూ అరచారు. అప్పటికే పది నిమిషాలు ఈ యుద్ధం జరిగింది. శ్రీరెడ్డి ఎటు పారిపోతున్నాడో ఎవరికీ తెలియదు. అయినా అన్ని వైపులా పరుగిడుతున్నారు. గ్రామంలోఉన్న వారికీ వివరాలు తెలిశాయి. శ్రీరెడ్డి ఇంటిమీద పడడానికి వెళ్తున్న ముఠా తిరిగివచ్చి, చుట్టూ అన్ని గ్రామాల రహదారుల వెంటా, రేచు కుక్కల్లా పరుగిడుతున్నారు.

అక్కడినుండి బాగా పరుగెత్తగలిగితే డొక్కాపాడుకు ఇరవై నిమిషాలలో పోవచ్చు. మామూలు పరుగు కాదు; ప్రాణాలకు తెగించి పరుగెత్తడం. శ్రీరెడ్డికి పారిపోవడం ఇష్టం లేకున్నా అందరి

బలవంతం మీదా పరుగెత్తక తప్పింది కాదు. మొత్తం ఎనిమిది మంది ఉరికారు. ఇరవై నిమిషాలలోపే డొక్కా పాడు శివార్లలో పడ్డారు. అప్పటికే ఆ గ్రామం లోని వందలాది ప్రజలు డాబాలు ఎక్కి, కాలిపోతున్న పైడి పల్లెను చూస్తున్నారు. డొక్కా పాడు లో శ్రీరెడ్డిని ఎవరైనా గుర్తించ గలరు. ఆ గ్రామంలోనూ రెండు వర్గాలున్నాయి. అందువల్ల శ్రీరెడ్డిని ఊరి వెలుపల గడ్డివాముల మధ్య విడిచి, ఏసు దాసు, రాంరెడ్డి గ్రామం లోనికి వెళ్ళారు. వారిని ఎవరూ గుర్తు పట్టలేదు. ఆ సమ యంలో క్రొత్తవారిని చూసి ఆశ్చర్య పడే వారు ఎవ్వరూ ఉండరు. ఎవరింటికో వచ్చిన బంధువులయి ఉండ వచ్చుననీ, పైడిపల్లె కాలిపోతుంటే అందరి లాగే చూడడానికి వీరుకూడా బయటకు వచ్చి; తిరిగి ఇంటికి పోతూ ఉండ వచ్చని భావిసారు.

కేశవరెడ్డి ఇంటిముందుకు వెళ్ళి తలుపు తట్టారు. తలుపు తెరువ బడింది. తెరిచిన వ్యక్తి ప్రశ్నార్థకంగా చూశాడు.

"కేశవరెడ్డి ఉన్నాడా ?" అడిగాడు ఏసుదాసు.

"అసలు మీరెవరు ?"

ఆ సమయంలో రావడమే అనుమానం! కేశవరెడ్డిని గురించి అడగడం మరీ అను మానం!

రాంరెడ్డి ముందుకు వచ్చాడు. "నేను చెంచురెడ్డి రెండో కొడుకును. నేను వచ్చా నని ఆయనకు వెంటనే చెప్పాలి" ఆ మనిషి లోనికి పరుగెత్తాడు క్షణాలలో ఇంటినిండా లైట్లు వెలిగాయి. కేశవరెడ్డి మేడ దిగి వచ్చాడు.

"ఏం రాంరెడ్డీ ! ఈ సమయంలో వచ్చారేమిటి! ఊరు కాలిపోతున్నట్లుంది!" అతని మాటలకు జవాబివ్వలేదు రాంరెడ్డి. ప్రక్కనున్న మనిషిని చూసి "ఇత నెవరు ?'' అన్నాడు రాంరెడ్డి. కేశవరెడ్డికి అర్థమయింది, రాంరెడ్డి అనుమానపడు తున్నాడని.

''వాడు మనవాడే ! మీకు ఏసుదాసు ఎంతో మాకు వాడు అంతే !" అన్నాడు కేశవరెడ్డి. రాంరెడ్డి అంత వరకూ జరిగిన వివరాలు తెల్పాడు. శ్రీరెడ్డిని ఊరిలోనికి తీసుకువచ్చే మార్గం చూడమని చెప్పాడు. అంతా విన్న కేశవరెడ్డి నోరు తెరిచాడు ఆశ్చర్యంతో.

''మీరు లోపలకు వెళ్ళండి. మా మను షుల వెంట ఉంటే అనుమాన పడతారు. మా మనుషులతో శ్రీరెడ్డిని చేర్చే ఏర్పాటు చేస్తాను ''

ఏసుదాసు తల విదిలించాడు. ''మీ మీద మాకు అనుమానం లేదు. ఉంటే ఇక్కడికి వచ్చేవారమే కాదు. అయినా శ్రీరెడ్డి వెంట మేముండాలి. మేము ఇక్కడ కూర్చోవడం వీలుకాదు "

"సరే ! అయినా ఇతరులు అనుమాన పడితే, వారేమయినా ఈ విషయం బయ టకు పొక్కితే, పైడిపల్లె మీద పడ్డ జనం ఇక్కడ పడతారు. ఈ గ్రామం నుండి కూడా కొందరు వెళ్ళినట్లు ఇంతకుముందు గానే తెలిసింది" అని "మన వాళ్ళను పదిమందిని తీసుకురారా !" అంటూ ఆ వ్యక్తిని పంపాడు. రాంరెడ్డి చేతిలో ఉన్న పిల్లవాడిని ఇంటిలో ఆడవారికి అప్పగించి, అందరూ శ్రీరెడ్డిని వుంచిన చోటుకు వచ్చారు. అందరూ గుంపుగా రాకుండా ఒకరొకరుగా సాగివచ్చారు. గ్రామానికి అటువైపే కేశవరెడ్డి పొలం ఉంది. ఆ పొలం వద్ద, బావికి బిగించబడ్డ మోటారు షెడ్డు ఉంది. ఆ చీకటిలో తిరిగి ఊరిలోనికి

రాకుండా, అటు నుండి అటే ఆ రూం దగ్గరికి దారితీశారు. వీరిని ఎవరూ చూడటం తటస్థించలేదు. ఆ రాత్రి ఆ రూంలో కటిక బండలమీద మేను వాల్చినవారు వాల్చగా, మిగిలినవారు ప్రాణాలు అరచేత పట్టుకొని కూర్చున్నారు. దా దా పు అందరూ ఇరవైమంది దాకా ఉన్నారు.

అక్కడ శ్రీరెడ్డి తప్పించుక వెళ్ళిన విషయం శత్రువులకు, ముఖ్యంగా బలరాం రెడ్డికి వెంటనే తెలిసింది. బలరాంరెడ్డి ముఖంలో నెతురు చుక్క లేదు. ఎవరి కొరకు ఇంత పథకం వేశారో, ఎవరి కొరకు ఈ గ్రామాన్ని అగ్నిలో మాడ్చి వేస్తున్నారో, ఎవరి కొరకు శత్రువనుకున్న ప్రతివాడినీ కొడుతున్నారో, ఆ వ్యక్తే తప్పించుకుంటే, ఇదంతా ఇంకా ఎందుకు ? ఆలస్యం చేస్తే పైనుండి పోలీసు బలగం దిగుతుంది. ఇక్కడున్న వారిని, ఇంటి చుట్టూ మూగి తలుపులు బిగించి, బంధించ గలిగారు. పై నుండి వచ్చేవారిని ఎదిరించడం సాధ్యం కాదు. తప్పించుక పోయినవారు మరొక చోటు నుండి టెలిఫోను చేసి పోలీసు బలగాన్ని దించవచ్చు. అందువల్ల వెళ్ళిపోవడం మంచిదని నిర్ణయించి, వెనక్కి తిరుగ వలసిందిగా ఆదేశించాడు.

నాయకుడు చెప్పిన తరువాత సైన్యాలు వెనుతిరుగడమెంత సేపు? వచ్చిన లారీలలోనే వెనుతిరిగారు. పైడిపల్లెలో మాత్రం దెబ్బలు తిన్నవారూ; ఇండ్లు కాలిపోతున్నవారూ; రోదనలు, హాహాకారాలు చేస్తుంటే, అగ్ని దేవుడు ఇంకా మారణహోమం గావిస్తున్నాడు. వారి ఆక్రందనలు వినే నాయకులు రెండు వైపులా ఎవరూ లేరు.




జిల్లా కేంద్రానికి వార్త తెలిసి అక్కడి నుండి బలాలు, అంబులెన్స్‌లు, ఫైర్ టాంకులు కదిలేటప్పటికి ఉదయం ఆరు గంటలయింది. ఆపాటికి శ్రీరెడ్డి ఇంకా గ్రామంలోనికి రాలేదు. పోలీసులు వచ్చు వరకూ వారు రాదలచుకో లేదు. కడప నుండి కూడా మరికొంత రిజర్వ్ దళాలను పంపమని తెల్పి, పైడిపల్లె చేరువరకు ఏడున్నర గంటలయింది. గ్రామం పోలీసు బలగాలతో కిట కిట లాడుతున్నది. అగ్ని మాపకదళంవారు మంటలను ఆర్పుతున్నారు. కాలి బూడిద అయిన పీనుగుల సంగతటుంచి, ఒళ్లు కాలి చనిపోయిన వారూ; బాంబులు వేయబడి, కర్రలతో కొట్టబడి చంపబడిన వారు ఇరవై ముగ్గురు; కాగా, వారిలో ఐదుమంది పసిపిల్లలు. నిద్రపోతుంటే ఇళ్లు కాలడంతో వారు బయటకు రాలేక మంటలలో చిక్కారు. కాలిన మాంసం ముద్దలు మి గి లా యి. ఎనభై పశువులు కాలి చచ్చాయి. వందకు పైగా ఇళ్ళు కాలిపోయాయి. కోళ్ళు, కుక్కలు ఎన్నో ఇంకా లెక్కించబడలేదు. ఇప్పుడు ప్రజలు చెప్పే స్థితిలోనూ లేరు. ఆ పీనుగులను చూసి విలపించేవారు నిల పిస్తుంటే, అనేకమంది స్పృహ తప్పి పడు

తున్నారు. కలెక్టరు ఆ మాంసం ముద్దలను చూసి వల వలా ఏడ్చాడు. "దానవుడంటే పురాణాలలోనే నేను విన్నానుగాని, ఈ రోజు జీవితంలో దానవత్వాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నాను" అన్నాడు. మానవత్వం మచ్చుకయినా అక్కడ కన్పించ లేదు. కాళ్ళు, చేతులు విరిగిన వారు ఇంకా లెక్కలోనికి రాలేదు. శ్రీరెడ్డి డొక్కపాడులో ఉన్నాడన్న వార్త తెలిసిన వెంటనే సూపరింటెండెంట్ జీపు తీసుకుని, పోలీసు వ్యానుతో వెళ్ళి అందరినీ పైడిపల్లెకు చేర్చారు.

శ్రీరెడ్డిని చూసిన కలెక్టరు ఆశ్చర్యపడ్డాడు. అంతవరకూ శ్రీరెడ్డిని కలెక్టరు చూడలేదు. బక్కచిక్కిన ఈ ఒక్క వ్యక్తిని నాశనం చేయడానికా ఇంత మారణ హోమం? అనుకున్నాడు. శ్రీరెడ్డి పరిస్థితి చూశాడు. అతడు ఏడవటం లేదు– గుండె రాయిలాగ తయారయిన వాడు ఇంకా ఏం ఏడుస్తాడు? చావగా మిగిలిన అతని అనుచరులు అతన్ని చుట్టుముట్టి, విలపిస్తున్నారు. వారి ఆడవారు నెత్తి నోరు కొట్టుకుంటూ రోదిస్తున్నారు. వారిని శాంతింప చేయు శక్తి ఎవరికీ లేదు. వారిని శాంతింప చేయుటకు మాటలు పనికిరావు. శ్రీరెడ్డి నోరెత్తలేదు. ఎత్తడానికి పెగలడం లేదు.

సూపరింటెండెంట్ అంతా చెక్ చేస్తున్నాడు. పీనుగులను ఒకవైపు వరుసగా పెడుతున్నారు. చచ్చిన పశువులను ఒక వైపు చేరుస్తున్నారు. కాలిన ఇండ్ల వివరాలు, అందులో ఆస్తి వివరాలు చెప్పగలిగేవారు చెబుతుంటే రాసుకుంటున్నారు.

శ్రీరెడ్డి అక్కడినుండి ఇంటికి వెళ్ళాడు.



పార్వతి పడక గదిలో పిల్లవాడిని ఒడిలో పెట్టుకొని, వాడి పొట్టమీద తల ఆన్చి దిగులుగా కూర్చున్నది. అలికిడి విని తలెత్తింది. ఆమె ఏడవడం లేదు. కాని, ప్రేత కళతో ఉంది ముఖం.

"రాత్రి ఇంటి మీదికి వచ్చారా?" అడిగాడు శ్రీరెడ్డి.

"వచ్చారు; అంతా వెతికి వెళ్ళారు."

"నిన్నేమీ అనలేదా?"

అంత విషాదంలోనూ ఆమె నవ్వింది.

"నేనెవరో వారికి తెలుసు! ఇక్కడకు వారు వచ్చింది నా కొరకు గాదు. మరి నన్నేమంటారు?"

ఇంటిలోని వస్తువులన్నీ చిందర వందరగా పడి ఉన్నాయి. పూరి కొంప కాక పోవడం వల్ల అగ్ని భయం లేదు. కాని శత్రువులు కసి కొద్దీ ఎద్దులూ, బర్రెలూ ఆవులనూ కట్టెలతో ఇష్టం వచ్చినట్లు బాదారు. కొన్నింటికి కాళ్ళు విరుగగొట్టారు. తాగిన వాడికి ఏది ఏమిటో అర్థం కాదు. మనిషి దొరకలేదు గనుక, ఆ మనిషి ఆస్తి అయినా నాశనం చేయాలన్న పిచ్చి పుడుతుంది. అదే వారూ చేశారు.

ఆఫీసర్లు అందరూ శ్రీరెడ్డి ఇంటి వద్దకు వచ్చారు. అన్నం వడ్డిస్తానన్నాడు శ్రీరెడ్డి. ఆ సమయంలో వండేదానికి ఎవరూ సిద్ధంగా లేరని శ్రీరెడ్డికి తెలుసు. అయినా మర్యాద పూర్వకంగా అడగాలని అడిగాడు. అవసరం లేదన్నారు. ఆ భయానక దృశ్యం చూసి, తిరిగి ఆ ప్రాంతంలోనే అన్నం తింటూ కూర్చోనడమంటే వాడు నిజంగానే దానవుడయి వుండాలని కలెక్టరు భావన! సాయంత్రం రెండు గంటలకు ఆ

గ్రామం నుండి కదిలాడు. అక్కడున్న ఆరు గంటలూ, ఆరు చుక్కల నీరు కూడా ఆయన ముట్టలేదు. బలిపశువును నరుక్కున్నట్లు, మనుష్యులను - తోటి మానవులు చంపుకుంటున్న ఆ గ్రామంలోని ప్రజల మీదనే అతనికి అసహ్యమేసింది. వెళ్తూ అడిగాడు-

"నీకేమైనా రక్షణకావాలా శ్రీరెడ్డీ ?''

శ్రీరెడ్డి నవ్వాడు. "నా రక్షణ నేను చూసుకోగలను. రాత్రి నాకై నేను పారిపోలేదు. నా చుట్టూ ఉన్నవారు బలవంతంగా తీసుకవెళ్ళారు. నాకు చావు గురించి భయం లేదు. అందువల్ల నాకు మీ రక్షణ అవసరం లేదు'' కలెక్టరు అతని వైపు తదేకంగా చూశాడు. పల్లెటూరి అనాగరికులు ఒకరి నొకరు చంపుకుంటారంటే విన్నాడు. వాళ్ళకు నాగరికత తెలియక పోవడం వల్లనే మనుషులను పశువుల్లాగా చంపుతారని భావించాడు. తీరా ఇక్కడ చూస్తే ఏమిటి ? చదువులేని మూర్ఖులు కాదు. గురివిరెడ్డి లాయరు. అతని పెద్ద కొడుకు లాయరు. శ్రీరెడ్డి యం. ఏ. పట్టభద్రుడు. ఆ గ్రామంలో డెబ్బై శాతం అక్షరాస్యులే. లోకజ్ఞానం తెలుసు. అయినా మొండిగా హత్యలకు తలపడ్డారంటే వారికి విజ్ఞానమూ, తెలివితేటలు లేక కాదు. కక్ష, పగ, ద్వేషం, రోషం వారిని నాశనం చేస్తున్నాయి. రాయలసీమ కక్షల గురించి తాను ఇంతకు ముందు చెవులతోనే విన్నాడు. ఇప్పుడు వారి నగ్న స్వరూపం కండ్లతో చూస్తున్నాడు.

కలెక్టరు వెళ్ళాడు.

"ఎంత పనిచేశారు శ్రీరెడ్డీ!" అన్నాడు సూపరిడెంట్ అతనిని చూసి. శ్రీరెడ్డి మాట్లాడలేదు.

అక్కడ పోలీసు బలం ఇంకా పెంచారు. ప్రారంభంలో ఇద్దరు కానిస్టేబుల్స్, ఒక హెడ్ కానిస్టేబుల్‌తో ఆరంభమయిన ఆ ఠాణా, నేడు నలభై మంది పోలీసులు, ఇద్దరు యస్. ఐ. లు, సర్కిల్‌తో నింపబడింది. శవాలను అంబులెన్స్‌లో వేసుకొని సూపరిండెంట్ వెళ్ళాడు. చచ్చిన గొడ్లను మనుషుల చేత లాగించాడు శ్రీరెడ్డి. ఆ గ్రామంలో శ్రీరెడ్డి ఈరోజు నిర్భయంగా తిరిగాడు. శత్రువు అనేవాడు గ్రామంలో ఒక్కడూ లేడు. ఆడవారు ఇండ్ల నుండి కదలడం లేదు. బయట తిరిగే ఆడ-మగవారు శ్రీరెడ్డి మనుషులే! వీరుగాక యాభై మంది పోలీసులు అదనంగా ఉన్నారు. అందువల్ల శ్రీరెడ్డి స్వయంగా అన్ని పనులూ చేయించాడు. ఇంటిలోని వడ్ల పుట్లు పగులగొట్టి అందరికీ వడ్లు పంచి పెట్టాడు. పాతరలు తవ్వి జొన్నలు పంచాడు. ఇండ్లు బాగు చేసుకొనుటకు కావలసిన డబ్బు ఎంతయినా సాయం చేస్తానని హామీ ఇచ్చాడు. తన కొరకే వారి మనుషులు చావడం; ఇల్లు కాల్చబడడం జరిగింది కనుక-వారికి సహాయం ఏ రూపేణ కావలసినా తను సహాయం చేయదలచాడు.

శ్రీరెడ్డి ఇంటికి కట్టుదిట్టంగా పోలీసుల కాపలా ఏర్పాటయింది. శ్రీరెడ్డి అవసరం లేదన్నా సూపరిండెంట్ ఏర్పాటు చేశాడు. ఇప్పట్లో తిరిగి శత్రువు ఆ గ్రామంమీద పడడం సాధ్యం కాదని అందరికీ తెలుసు. ఆస్తి రూపేణా విపరీతంగా ఖర్చు పెట్టాడు బలరాంరెడ్డి. పైగా ఈ ఘోర హత్యాకాండ వారిమీదే మోపబడింది. దొరికితే ఈ కేసులో పడే శిక్ష మరణశిక్ష



ఒక్కడే! ఆ విషయం బలరాంరెడ్డికి తెలుసు. రహస్యంగా తిరుగుతూ శ్రీరెడ్డి మీద దాడిచేయడం సులభం కాదు. ఇవన్నీ శ్రీరెడ్డికీ, సూపరింటెండెంట్ కూ తెలుసు. అయినా ముందు జాగ్రత్తగా కాపలా ఏర్పాటు చేశాడు. బలరాంరెడ్డి ఇప్పుడు అన్ని విధాలా చెడినవాడు. చావడలుచు కున్నవాడికి చంపడం ఒక లెక్క కాదు. అన్నింటికీ తెగించినవాడు ఇంకేంతైనా చేయవచ్చునని సూపరింటెండెంట్ భావం!

ఆ రాత్రి ఎవరి ఇంటిలోను అన్నం వండలేదు. ఎవరూ ఏమీ తినలేదు. శ్రీరెడ్డి ఇంటిలోనూ అంతే! పస్తులతోనే అందరూ పడుకున్నారు. పిల్లవాడికి పాలు తాపి, నిద్రపుచ్చి శ్రీరెడ్డి వద్దకు వచ్చింది పార్వతి. ఆ గ్రామానికి కరెంటు లేదు ఇప్పుడు. చిన్న దీపం మాత్రం మినుకు మినుకు మంటూ వెలుగుతున్నది. ఆ వెలుగులో ఆమె కన్నుల నుండి జలజల నీళ్ల



రాలుతున్నాయి. శ్రీరెడ్డి చూశాడు. ఆమెను దగ్గరగా తీసుకున్నాడు. అతని మీదపడి పార్వతి వెక్కి వెక్కి ఏడ్చింది. ఇద్దరి మధ్యా కొంతసేపు మాటలు లేవు. మాట్లాడేదానికి నోరు పెగలడం లేదు.

"భయపడ్డావా పారూ ?" గొంతు పెగిల్చుకుని అన్నాడు శ్రీరెడ్డి. ఆమె తల త్రిప్పింది. "నా భయం నన్ను గురించి కాదు. నిన్ను గురించి ! నీవు వారికి చిక్కిపోతావేమోనని నా గుండె కొట్టుకుంటూనే ఉంది. ఇంటి మీదకు యాభై మందికి పైగానే వచ్చారు. 'నీ వెక్కడున్నావని' అడిగారు. పారిపోయా

వని చెప్పాను; నమ్మలేదు. ఇల్లంతా తిరుగుతున్నట్లు, ఏమిటేమిటో కొడుతున్నట్లు శబ్దాలు వినిపిస్తున్నాయి. నేను క్రిందికి దిగిపోలేదు. రాత్రంతా ఏ విధంగా ఈ గదిలో కాలం గడిపానో నాకే తెలియదు. తెల్లవారి పనిమనిషి రంగమ్మ వచ్చి, ఊరిలో జరిగిన సంగతులు వివరిస్తుంటే నా గుండె నీరయింది"

"నిన్ను చంపుతారని నేను భయపడ్డాను" అన్నాడు శ్రీరెడ్డి.

"నన్ను గురించి నేను ఆలోచించలేదు. నన్నేమీ చేయలేరని నాకు తెలుసు. నా బాధ నిన్ను గురించి! నీ కొరకే రాత్రి ఆ విధంగా గ్రామాన్ని బీభత్సం చేశారు. నిన్నేమయినా చేస్తే...! భగవంతుడా! నేను ఒక్కక్షణం బ్రతుకగలనా? ఈ విధంగా కత్తుల దోబూచులాడుటకు నేను అలవాటు పడిపోక తప్పనిస్థితి ఏర్పడింది. ఎప్పుడు ఏమవుతుందోనని అనుక్షణం భయంతో గుండె చేతబట్టుకొని కాలం గడుపవలసి వచ్చింది. ఇక ఈ అగ్ని ఆరదు; నా గుండె కుదుట పడదు."

విలపిస్తున్నది పార్వతి.

ఆమెను ఏ విధంగా ఊరడించాలో శ్రీరెడ్డికి అర్థం కాలేదు. ఆమె అన్ని విధాలా దెబ్బ తిన్న వ్యక్తి. పుట్టినింటివారి ప్రేమాభిమానాలు ఆమెకు ఇప్పుడందవు. అత్తింటి వారి ప్రేమాభిమానాలు కూడా ఆమెకు పూర్తిగా లేవు. ఆ గ్రామంలో ఆమెను నాయకురాలిగా, నాయకుడి భార్యగా పరిగణించవచ్చు. ఆమెకు కావలసినది ఆ హోదా కాదు. ప్రతి స్త్రీ కోరే పసుపు కుంకుమ. అవి ఉండాలంటే భర్త బ్రతికి ఉండాలి. తాను భర్తను రక్షించుకోవాలి. తనకా శక్తి లేదు. తన పుట్టినింటివారే తన భర్తను చంపడానికి అన్ని ప్రయత్నాలు చేస్తున్నారు. మరి భర్త చుట్టూ చేరిన వారందరూ, భర్త కొరకు నిలిచేవారేనా? అనేది ఆమె అనుమానం. నిజం కూడా అంతేమరి. వెంట ఉండి శత్రువుల డబ్బులకు లొంగి, హత్య చేయించిన వారిని గురించి విన్నది. నిన్నగాక మొన్న గోపిరెడ్డి ఏ విధంగా హత్య చేయబడినదీ తనకు తెలుసు.

పార్వతిని ఇప్పుడు అందరూ పార్వతమ్మగా గౌరవిస్తున్నారు. కాని, పార్వతి మనస్సు పార్వతమ్మలాగ పెరగడం లేదు. దిన దినానికీ కృశించి పోతున్నది. ఆమె ఆరాటం భర్త, కొడుకు కొరకే! ఈ ప్రపంచమంతా నాశనమయినా వారిద్దరూ తన కళ్ళెదుట బతికి ఉండాలనుకుంటున్నది.




బలరాంరెడ్డి, నాగిరెడ్డి పరారీలో ఉన్నారు. ప్రభుత్వానికి దొరికితే తమకు పడే శిక్షమరణశిక్ష ఒక్కటేనని వారికి తెలుసు. జరిగిన ఘోరం సాధారణ మయినది కాదు. ఒక చిన్న సంగ్రామం. అంత చేసినా, అసలు వ్యక్తి తప్పించుకో గలిగాడు. ఏ వ్యక్తి కొరకు తాము అన్నింటికీ తెగించి రంగంలోనికి దిగారో, ఆ వ్యక్తిని చంపడానికి బదులు గ్రామం మొత్తమే సర్వ నాశనం చేయవలసి వచ్చింది.

ఎటూ శిక్ష పడే పక్షంలో, తాము నిష్కారణంగా చావాలని వారు అనుకోవడం లేదు. శ్రీరెడ్డిని చంపిన తరువాతనే కోర్టుకు హాజరు కావాలని వారి ఉద్దేశం! అదృష్టం కలిసివచ్చి కేసు ఫెయిలయితే మంచిదే! లేకుంటే శ్రీరెడ్డిని చంపి, చచ్చామనే తృప్తి అయినా వుంటుంది.

ఈ ఆలోచనతోనే మరొక పథకం వేశారు. మునుపులాగా ఎక్కువ సైన్యంతో గానీ, అధిక పెట్టుబడితో గానీ ఈ పథకం రూపొందించ లేదు. కిరాయి సైన్యాలను నమ్మడానికి వారు సిద్ధంగా లేరు. సారాయి పోయించి, ఒకపూట కూడు పెడితే కర్ర చేతపట్టి ఎగుర గలరేగానీ, సమయం వచ్చినప్పుడు చిక్కకుండా పారిపోగలరు. ఫలితం; దెబ్బ తినవలసింది తామే! కాబట్టి తమ వర్గంలో తమను నమ్ముకున్న ముఖ్యులను ఏరుకున్నారు. వారు మొత్తం పదిహేను మంది. వారందరూ శ్రీరెడ్డి కుటుంబం వల్ల దెబ్బ తిన్నవారే! చెంచురెడ్డి, గోపిరెడ్డి, శ్రీరెడ్డి వర్గంచే వారి ఆత్మీయులు చంపబడిన వారే! వారందరికీ సహజంగానే కసి ఉంటుంది. అటువంటి వ్యక్తులనే కూర్చుకున్నారు. డబ్బయినా ఈ కొద్ది మందికి పెద్ద ఖర్చుండదు. వారికి చందా లిచ్చేవారు కూడా పెద్దగాలేరిప్పుడు. బలరాంరెడ్డి భార్య తండ్రినుండి వస్తున్న కొంచెం మొత్తంతో వారు రహస్యంగా తిరుగుతున్నారు.

శ్రీరెడ్డి పైన పాత కేసులు కొన్ని ఉన్నాయి. వాటికి వాయిదాలకు తిరుగుతున్నాడు. ఇటువంటి సమయం ఎంచుకోదలిచాడు బలరాంరెడ్డి. శ్రీరెడ్డి వెంట ఎప్పుడు కదిలినా వెంట యాభై అరవై మంది దాకా ఉంటారు. అయినా వారందరూ అవసరం వస్తే, నిలువకుండా ఫరారయ్యేవారే! గట్టిగా నిలిచేవారు ఏ పది మందో ఉంటారు. వారయినా ప్రాణానికి తెగించి నిలబడరు. సాధ్యం కాని పక్షంలో పారిపోతారు. శ్రీరెడ్డిని చంపదలిస్తే ఇది చివరి పథకమే! ఇకముందు సాధ్యం కాకపోవచ్చు. తాము కూడా ప్రభుత్వానికి గ్రామ దహనం కేసులో దొరకక తప్పదు. గనుక ఈ పథకం కట్టుదిట్టంగానే అమలు చేయదలచుకున్నారు. వారి ఉద్దేశం ఒకటే! చంపాహూ— శ్రీరెడ్డిని చంపడం! లేదా చావడం!

ఆ రోజు శ్రీరెడ్డికి 'డకాయిట్' కేసు ఉంది. అరవై మంది దాకా కదిలారు. మల్లారెడ్డి కొడుకు నాగిరెడ్డికూడా అందులో ఉన్నాడు. గురివిరెడ్డి ఇంటి మీద దాడి చేసిన కేసు అది. గురివిరెడ్డిని చంపిన కేసులో శ్రీరెడ్డి ముద్దాయి కాడు.

అరవైమంది నడిచి వెల్లుట్ల చేరారు. అక్కడ బస్సులు ఆపడానికి ప్రయత్నిస్తే ఆపడం లేదు. అరవైమంది, అందులో తగాదా పార్టీవారు. వారిని చూసే భయపడుతుంటే ఇహ బస్సు నిలిపి ఎలా ఎక్కించుకోగలరు.? చివరకు విసుగు పుట్టింది శ్రీరెడ్డికి!

"రాళ్లు అడ్డం వేయండ్రా రోడ్డుకు!" అంటూ ఆదేశించాడు. రాళ్ళు అడ్డం వేశారు. బస్సు వచ్చింది; నిలిచిపోయింది. వీరందరిని చూడ్డంతోనే కండక్టరు, డ్రైవరు వణుకుతున్నారు.

"నా కొడుకుల్లారా! పాసింజర్లను రోడ్ల మీద నిలిపి, మీరు నిటారుగా పోదామనుకున్నారా ?" అన్నాడు శ్రీరెడ్డి కోపంగా! కండక్టరు వణుకుతూనే జవాబిచ్చాడు.

"బాబూ! బండి ఇప్పటికే ఓవర్‌లోడ్

అయింది. అసలు ఓవర్‌లోడ్ వేయ కూడదని మా మేనేజరుగారి ఆదేశం. ఇందరిని బండి ఎక్కించడమంటే నా ఉద్యోగం పోతుంది"

"ఎవడ్రా వాడు నీ ఉద్యోగం తీయ డానికి ? బండ్లు నడిపేది ప్రయాణికుల్ని చేరవేయుటకే! ప్రయాణీకులు ఎక్కువయి నప్పుడు, ఓవర్‌లోడ్ వేయకుంటే ఎట్లా ? మీరు ఎప్పుడో ఖాళీ బస్సు పంపిస్తారని మా పనులు పోగొట్టుకొని ఎదురుచూస్తూ కూర్చోవాలా ? మెట్టల మీద జపంచేస్తూ కూర్చోవడానికి కాదు ఇక్కడికి మేము వచ్చింది ? మీ మేనేజరుకు నేను చెబు తాను; పద !"

అంటూ శ్రీరెడ్డి బస్సు ఎక్కాడు. అందరూ వరుసగా ఎక్కారు. జనం పట్టక పైన కొందరిని ఎక్కించ వలసివచ్చింది. బస్సు కదిలింది; పావు గంటలో స్టేషన్‌వద్ద ఆగింది. శ్రీరెడ్డి లోనికివెళ్ళి మేనేజరుకు బండి ఓవర్‌లోడ్ వేయుటకు కారణం, తాము నిలిపి ఎక్కవలసిన కారణం వివ రంగా చెప్పి, కండక్టరు దానికి బాధ్యుడు కాదుగనుక, అతనిమీద చర్య తీసుకో వద్దని చెప్పి రోడ్డు ఎక్కాడు. అక్కడికి కోర్టు మైలు దూరంలో ఉంది. ఒకరిద్దరు అవుతే రిక్షా ఎక్కవచ్చు. అరవైమంది; సాధ్యం కాదు. నడక మొదలు పెట్టారు. భైరమల్ వీధి, మెయిన్ బజార్లలో రద్దీ ఎక్కువ! అందువల్ల సంజీవనగర్ మీదుగా సాగారు. అటే వస్తారన్న సంగతి బలరాంరెడ్డి వర్గానికి తెలుసు. గతంలో కూడా శ్రీరెడ్డి ఏ వాయిదాకు వచ్చినా అదే త్రోవన వచ్చేవాడు. సంజీవనగర్‌లో రామాలయం వద్ద ఉన్న ఇల్లు బలరాం రెడ్డికి దగ్గర బంధువుదే! ఆ యింటిలోనే వీరందరూ సిద్ధంగా ఉన్నారు. కర్రలు పట్టుకొని తిరుగ వద్దని సర్కిల్ అంతకు ముందే ఆజ్ఞాపించిన కారణంగా ఎవరివద్దా కర్రలులేవు. మొలలో పిడిబాకులున్నాయి. రెండు టిఫిన్ గిన్నెలలో బాంబులున్నాయి. ముందు నలుగురు నడుస్తున్నారు. ఆ తర్వాత ఏసుదాసు నడుస్తున్నాడు. ఆ తర్వాత రాంరెడ్డి, నాగిరెడ్డి, మల్లారెడ్డి నడుస్తున్నారు. వారి వెనుక శ్రీరెడ్డి, శ్రీరెడ్డి వెనుక దాదాపు యాభైమంది నడుస్తు న్నారు.

ఆ ప్రాంతంలో జనసంచారం పెద్దగా లేదు. ఆ సమయంలో ఇంటిలోనుండి హఠాత్తుగా గండ్ర గొడ్డండ్లతో ఉరుకుతూ, ఎదురు వచ్చారు. ముందు వచ్చిన ఇద్దరు పొగ బాంబులు విసిరారు. ఆ ప్రాంత మంతా పొగతో నిండిపోయింది. వీరందరూ చెల్లా చెదరయ్యారు. ఆ పొగలోనే వారు గండ్ర గొడ్డండ్లు ఎత్తి వీరిమీద పడ్డారు. పూర్వంలాగా కేకలు వేయడం, త్రాగి తూలడం లేదు. ఈ అదును తప్పితే శ్రీరెడ్డిని ఒక జీవితంలో చంపలేమని నిర్ణ యించుకున్నారు. అన్నింటికీ తెగించి మీద పడ్డారు. పారిపోతున్న వారిని హెచ్చరిస్తూ శ్రీరెడ్డి "పారిపోకండి. నిల బడండి. రాళ్లు విసరండి" అంటున్నాడు. కొందరు వంగి రోడ్డు ప్రక్కనున్న రాళ్లు తీసుకున్నారు. అసలే ఆయుధాలు లేవు; రాళ్ళతో వారిని ఎదిరించడం ఇక సాధ్యం కాలేదు. ఒకడు పొగ బాంబులు విసరు తూనే ఉన్నాడు. ఆ పొగలో వీరికి దిక్కు తెలియడం లేదు. వారేమో గొడ్డండ్లతో నరుకుతూ వస్తున్నారు. అప్పటికే ఒకడికి రెండు చేతులు తెగాయి వాడి చేతిలో ఉన్న బాంబుల గిన్నె క్రింద పడింది. గిన్నె చేతిలో ఉన్న మరొకడి వెంట

పడితే వాడు దొరకకుండా పారిపోయాడు. వీరి లక్ష్యం శ్రీరెడ్డి గనుక, మిగిలిన వారిని ఆశించడం లేదు. సరాసరి శ్రీరెడ్డి మీదకే వస్తున్నారు. శ్రీరెడ్డిని బ్రతికించాలని విశ్వాసం గలవారు అడ్డుపడుతున్నారు. వారిని నరుకుతూ ముందుకు వస్తున్నారు.

"పరుగెత్తండి; పారిపోండి" అరిచాడు శ్రీరెడ్డి తానుకూడా ఒకవైపు పరుగెడుతూ! శ్రీరెడ్డి వెనుక ఏసుదాసు, ఆ వెనుకరాంరెడ్డి నాగిరెడ్డి పరుగెత్తుతున్నారు. వారు వెంట పడ్డారు. రోడ్డుకు ప్రక్కనున్న ఇంటిలో దూరడానికి వసారాలోకి ఉరికారు. ఈ బీభత్సం చూసిన ఇంటి యజమాని తలుపులు మూసి ఉన్నాడు. శత్రువులు మీద పడ్డారు. తప్పుకొనుటకు అవకాశం లేదు. మూడు వైపులా గోడలు; నాల్గవవైపు శత్రువు. వెనుకనున్న నాగిరెడ్డినీ, రాంరెడ్డినీ నరికారు. తన పని అయిపోయిందని శ్రీరెడ్డి నిర్ణయించుకున్నాడు. ఆ తోపుడులో ఒక మూలన పడ్డాడు. బలరాంరెడ్డి, నాగిరెడ్డి గొడ్డండ్లు పైకెత్తి వచ్చారు. ఏసుదాసు వారిని రానివ్వకుండా అడ్డు పడ్డాడు. మొలలోనున్న రెండు పిడిబాకులూ తీసుకున్నాడు. "ఒరేయ్! నా కొడుకుల్లారా! నేను చచ్చే వరకూ నా రెడ్డి చావడానికి వీలులేదు" అంటూ రెడ్డికి అడ్డం నిలిచాడు. వాడిని నరకడానికి బలరాంరెడ్డి గండ్రగొడ్డలి ఎత్తాడు. పిడికత్తితో బలరాంరెడ్డిరొమ్మున గుద్దాడు ఏసుదాసు. అరుస్తూ పడ్డాడు క్రింద బలరాంరెడ్డి. మిగిలిన వారికి తత్తర పుట్టింది అయినా ఆ సమయంలో శ్రీరెడ్డిని విడిస్తే తమకు పుట్టగతులుండవు పూర్తి చేయాలని, నిశ్చయించుకున్నారు. అందరూ ఒక్కుమ్మడిగా గొడ్డళ్లు ఎత్తి విసిరారు. ఆ దెబ్బలకు ఏసుదాసు తట్టుకోలేక ఒరిగాడు, ఒరిగిపోతూ, కసికొద్దీ దగ్గరలోనున్న నాగిరెడ్డిని పొడిచాడు. దెబ్బతిన్న నాగిరెడ్డి తిరిగి గొడ్డలి ఎత్తి విసిరాడు. ఏసుధాసు తల తెగి పడింది. వాణ్ణి ప్రక్కకు నెట్టి శ్రీరెడ్డి మీదపడ్డారు. తమ కసిఅంతా తీర్చుకొనుటకు, ఒక్కొక్కరు పది సార్లు నరికారు. ఆ తర్వాత మిగిలిన వారు పారిపోయారు. ఈ వార్త తెలిసిన పోలీసులు, సర్కిల్ పరుగున వచ్చారు. వారు వచ్చుసరికి కనీసం పది శవాలు రక్తంలో కన్పిస్తున్నాయి. మొత్తం ఆ ప్రాంతమంతా వెతికితేపధ్నాలుగు శవాలు కన్పించాయి. ఒకరి నొకరు చంపుకోడానికి ఘోరంగా సిద్ధపడ్డ శ్రీరెడ్డి, బలరాంరెడ్డి, వారి తమ్ముండ్లు నెత్తురులో నిర్జీవంగా పడి ఉన్నారు. పైడిపల్లె నాయకత్వం నంద్యాల నడిబజారులో నెత్తుర్లో మునిగింది.

వార్త పైడిపల్లె ప్రాకింది. రెండువర్గాల నాయకులు చచ్చారని తెలిసింది. నీలమ్మ స్పృహ తప్పి పడిపోయింది. పార్వతి ఇటు భర్త అటు అన్నల చావు విని గుండె ఆగిపోయింది. పైడిపల్లెలో ఈసారి అన్ని కుటుంబాలలోనూ విషాదం చిందింది. ఇరువర్గాలలో ఏడ్పులూ, రోదనలూ విన్పిస్తున్నాయి. ఈ వార్త తెలిసి శ్రీరెడ్డి రెండవ తమ్ముడు సురేంద్రరెడ్డి కర్నూలు నుండి వచ్చాడు.

పోస్టు మార్టం అయిన తరువాత శవాలను వారి బంధువులకు అప్పగించడానికి సూపరింటెండెంట్ స్వయంగా వచ్చాడు. అతడు గురివిరెడ్డికి ప్రత్యేకంగా నీలమ్మ తరపున బంధువు. చనిపోయిన వారు ఇరు వర్గాల నాయకులు. గ్రామంలో ప్రశాంత పరిస్థితి ఏర్పరచాలి. ఈ కారణా

లతో ఆ గ్రామానికి వచ్చాడు. పోలీసు బలగం గ్రామం నిండా మొహరించి ఉంది. శ్రీరెడ్డి వర్గంలో మిగిలిన సురేంద్రరెడ్డి వారి అంత్యక్రియలు జరిపాడు. గురివిరెడ్డి వర్గంలో అంత్యక్రియలు జరపడానికి కూడా ఎవరూ మిగలలేదు. వారి ముఠాకు చెందినవారే కొందరు వారికి దహన క్రియలు జరిపారు. ఊరేగింపులు లేవు.

తర్వాత నీలమ్మతో మాట్లాడి సురేంద్ర రెడ్డి వద్దకు వచ్చాడు సూపరిండెంట్ !

సురేంద్రరెడ్డి ఆ సమయానికి మంచంలో పడుకుని పై కప్పు చూస్తున్నాడు. ప్రక్కన ఉయ్యాలలో పిల్లవాడు ఊగుతున్నాడు. ఉయ్యాల ఊపుతూ ఒక ముసలమ్మ అక్కడ కూర్చుని ఉంది.

సూపరిండెంట్ వచ్చి అతని ప్రక్కన కూర్చున్నాడు. సురేంద్రరెడ్డి లేచి కూర్చోలేదు; లేచే ఓపిక కూడా అతనికి లేదు. సూపరిండెంట్ అతని భుజం మీద చెయ్యి వేశాడు. "ధైర్యం తెచ్చుకో సురేంద్ర రెడ్డి! మిగిలింది నీవు ఒక్కడివే! ఈ గ్రామం బాగు పడవలసింది ఇక నీ వల్లనే !" అన్నాడు.

సురేంద్రరెడ్డి సూపరిండెంట్ కళ్ళలోకి చూశాడు. అతని కళ్ళలో నీరు తిరుగుతున్నది. "అంతా అయిపోయింది. ఇంకేం ధైర్యం సార్ ? నేను కూడా చావక ఎందుకు మిగిలానా అని మాత్రమే ఏడుస్తున్నాను."

సూపరిండెంట్ బాధగా నవ్వాడు.

"పల్లెటూరి మోతుబరుల గురించి నేను ప్రత్యేకించి చెప్పదలచుకోలేదు. నీకు ఆ వివరాలు బాగా తెలుసు- వారి పగ, కక్ష, ఆవేశాలు ఎలాంటివో. వాటికి బలి అయ్యారు ఇక్కడి రెండు వర్గాలవారూ వారి నాయకులూ. ఆలోచించు సురేంద్ర రెడ్డీ ! మిగిలింది శ్రీరెడ్డి వైపు నీవూ, ఈ పసి పిల్లవాడు కాగా, గురివిరెడ్డి వైపు బలరాం కుమారుడు. వీరిద్దరూ చిన్న పిల్లలే ! మీదు మిక్కిలి తల్లి తండ్రులు లేని పిల్లలే ! ఈ గ్రామం ఏ పగలతో నాశనమయిందో, పెరిగి పెద్దయిన తరువాత తెలుసుకుంటే, వీరూ అదే త్రోవ తొక్కడానికి వెనుదీయరు. అయితే ఈ గ్రంథం వారికి తెలియకుండా చేయడానికి సాధ్యం కాదు. వారు యుక్త వయస్సుకు వచ్చిన తరువాత దానంతటదే తెలిసి పోతుంది. అది వేరు సంగతి. వీరిద్దరికి భవిష్యత్తులో పగ, కక్షలు పెరుగకుండా ఉండాలంటే, ఇద్దరూ ఒకచోట పెరగడం ముఖ్యం! ఇద్దరూ స్నేహితులై మెలగాలి. అప్పుడే- వారు పెద్ద వారయినా గతాన్ని తలచరు. దాన్ని విస్మరిస్తారు; అది పీడ కలగా భావిస్తారు. వారిద్దరినీ పెద్ద చేయడానికి మిగిలినది ఒకవైపు నీవు కాగా, ఆవైపు నీలమ్మా, ఆమె కుమారై నాగ మణి ! వారిని మీరు విడివిడిగా పెంచితే, వారు కూడా రేపు ముఠా నాయకులే అవుతారు. కాబట్టి నేను చెప్పేదేమంటే వారూ, నీవూ కలిసి, సమిష్టిగా వీరిద్దరిని పెంచాలి."

అర్థం కానట్లు చూశాడు సురేంద్రరెడ్డి లేచి కూర్చుంటూ !

"అర్థం కాలేదా ? ఈ గ్రామంలో పోట్లాటకు దిగే వారెవరూ ప్రస్తుతం లేరు. మిగిలిన ఒకరిద్దరు రౌడీలను అరెస్టు చేస్తాం. వారికి పడేది ఉరిశిక్షలే ! అది వారికీ తెలుసు. తప్పించుకు తిరుగుతున్నారు. నేడు కాకుంటే రేపయినా వారు దొరికి తీరుతారు. ఇక మీరు ఎవరినీ పోషించకుంటే భవిష్యత్తులోనయినా ఎవరూ కర్రలు పట్టి తిరగరు. మీరు వారికి

సాయం చేయకుంటే వారు ముందుకురారు. అటువంటప్పుడు ఊళ్ళో పార్టీలుండవు; తగాదాలూ ఉండవు. అందువల్లనే నేను ఇంత వివరంగా చెప్పవలసి వచ్చింది. నీలమ్మకు ఇద్దరూ మనుమలే! ఒకరు కూతురి కొడుకయితే, ఇంకొకరు కొడుకు కొడుకే! అందువల్ల ఆమె దృష్టిలో వీరిద్ద రికీ తేడా ఉండదు. ఒకరి మీద ద్వేషమూ ఉండదు. అలాగే నాగమణికి ఒకరు అక్క కొడుకయితే, మరొకరు అన్న కొడుకు! ఆ అమ్మాయికీ వీరిలో ఒకరి మీద ద్వేషం ఏర్పడడానికి ఆస్కారం లేదు. పోతే నువ్వు! ఒకరు నీకు అన్న కొడుకు! మరొకరు నీ మేనమామ మను మడు. నీకు ఒకరి మీద కసి ఉండవచ్చు. దాన్ని అణచుకుని ఇద్దరినీ సమానంగా చూడడం నీ బాధ్యత! ఈ గ్రామం బాగు పడేదానికి వారిద్దరినీ ఒకలాగే, ఒకేచోట కలిసి మెలిసి తిరిగేలా పెంచాలి. అంతే అర్థమయిందా? నాగమణిని నీవు పెళ్ళా డాలి. నాగమణి నీకు వైరి పుత్రిక కావచ్చు; ఆ వైరి ఎవరోకాదు. స్వయంగా నీమేనమామే కదా? ఈ విరోధం పోగొట్టు కొనుటకే గదా, నాడు మీఅన్న పార్వతిని వివాహమాడింది! గతం విడిచి, భవి ష్యత్ ఆలోచించడానికి ఇంతకు మించి మార్గం లేదు" అన్నాడు సూపరింటెండెంట్.

"నేను కూడా గ్రామ నాశనాన్ని కోరడం లేదు. ఈ రెండు కుటుం బాలు, ఏ విధంగా కలుసుకున్నా గ్రామం బాగుపడుతుందనే నేనూ ఆలోచిస్తున్నాను. అయినా మా అత్త ఈ వివాహానికి అంగీక రిస్తుందా?"

"ఆమె వేసిన పథకమే ఇది! అంతా అయిపోయింది. నేను ఒక దిక్కు, నాగ మణి ఒక దిక్కు పోవడం; సురేంద్రరెడ్డి ఒక వైపు ఉండడం, మధ్యన పిల్లలు ఏకాకులై పోతారని ఆమె వాపోతున్నది. ఈ విధంగా మీరు కలిసి పోవడం వల్ల, గ్రామంలో కలతలూ ఉండవు. పిల్లలు కలిసి బ్రతుకుతారు. నీలమ్మ నాగమణి భవిష్యత్తు గురించి ఆలోచించ వలసిన అవసరముండదు. వీరిద్దరికీ పిల్లలు ఒకటే గనుక పెంపకంలో కూడా తేడా లుండవు. ఇదంతా ఆలోచించిన తరువాతే నీలమ్మ, నిన్ను సంప్రదించమని చెప్పింది"

సురేంద్రరెడ్డి కొంచెం సేపు మాట్లాడ లేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు. చివరకు తల ఎత్తి "ఆ విధంగానే చేద్దాం సార్!" అన్నాడు నెమ్మదిగా.

సురేంద్రరెడ్డి ఈ పథకానికి ఒప్పు కున్నందుకు నీలమ్మ సంతోషించింది. పార్వతిని ఆ యింటికి ఇవ్వడానికి నీలమ్మ ఆ రోజు వ్యతిరేకించింది. ఈ రోజు నాగ మణిని ఇవ్వడానికి సిద్ధపడింది. కొద్ది రోజులలోనే నాగమణి, సురేంద్రరెడ్డిల వివాహం జరిగింది. వివాహంతోపాటు రెండు కుటుంబాలు ఒకే కుటుంబంగా కలి శాయి. రెండు ఆస్తులు సురేంద్రరెడ్డి అజమాయిషి లోనికే వచ్చాయి. ఇద్దరు పిల్లల బాధ్యత అతనిమీదే పడింది. ఆ గ్రామంలో మిగిలినవారు ఎవరంతకు వారు సర్దుకున్నారు. దౌర్జన్యాలు, పోట్లాటలూ లేవు. వాటికి సహకరించేవారు ఇప్పుడు లేరు. నిప్పుకు కట్టె దొరికితే కాల్చుతుంది. కట్టె దొరకని నిప్పు ఆరినట్లే ఆ పోరాటం కూడా ఆగిపోయింది. ఆ గ్రామం అంతటితో నయినా బాగుపడితే చాలని చుట్టుప్రక్కల గ్రామాలవారు ఆశించారు; పోలీసులూ ఆశించారు - కోడి పెట్టలకు వెతికే పోలీసులు తప్ప!. ★

# దంత వేదాంతం

రాంబాబు పుప్పి పన్నుతో రోజూ యమబాధ అనుభవిస్తున్నాడు. డాక్టరు దగ్గరికెళ్ళడానికి భయం. కానీ బాధ తీవ్రమై, నిద్రాహారాలు కరువై భరించ లేక పోతున్నాడు.

"పంటి నొప్పిని ప్రశాంతిగా భరించ గలిగే వేదాంతి ఎక్కడా వుండడన్న" షేక్స్పియర్ సూక్తిని గుర్తు తెచ్చుకొని మరింక లాభం లేదని డాక్టర్ దగ్గర కెళదామని నిశ్చయించుకొన్నాడోరోజు.

ఆఫీసు నుంచి ఆరుగంటల ప్రాంతంలో బయల్దేరి డెంటిస్టు శాంతమూర్తి దగ్గర కొచ్చాడు.

డాక్టర్ శాంతమూర్తి నిజంగానే చాలా సౌమ్యుడు. పేరులోని సౌమ్యత అతని ప్రవర్తనలో కనిపిస్తుంది. భయంగా, బెదురుగా లోనికెళ్ళిన ప్రతివాడు నవ్వుతూ తిరిగొస్తాడు ఆ రూంలోంచి. రకరకాల జోకుల్తో పేషెంట్లని నవ్వించి, వాళ్ళ బాధని నివారించడంలో అతని కతనే సాటి. దానికి తోడు మరేదో 'మందు' కూడా వాడతాడని ప్రసిద్ధి.

గంటసేపు కూచున్నాక రాంబాబు వంతు వచ్చింది. లోనికెళ్లేడు.

డాక్టర్ శాంతమూర్తి చిరుదరహాసా లొలికిస్తూ, రాంబాబు వేపు చూసి కళ్లెగ రేశాడు సంగతేవిటన్నట్లు. బాధంతా విపులంగా మొదట్నుంచీ, కొస వరకూ వర్ణించి మరీ చెప్పాడు రాంబాబు. సంగతంతా విన్నాక రాంబాబుని ఓ గదిలోకి తీసుకుపోయి అక్కడవున్న ఓ సింహాసనం లాంటి కుర్చీలో కూర్చోమన్నాడు.

ఆ పరికరాలు, యంత్రాలు చూశాక రాంబాబుకి దడ పుట్టుకొచ్చింది. డాక్టర్ వంక జాలిగా చూసి, నెర్వస్‌గా తల ఇటూ అటూ ఆడించేడు.

కానీ డాక్టరు రాంబాబుకి ధైర్యం చెప్పి, భయం లేదని కాస్త హుషా



రిచ్చేందుకు బ్రాండీ అని చెప్పకుండా ఓ పెగ్ ఇచ్చేరు.

ఒక్క గుక్కలో దాన్ని తాగి-

"బాగుందండీ మీ కూల్ డ్రింక్" అని మరో గ్లాసు కావాలన్నట్టు చూశాడు రాంబాబు.

మళ్ళీ నింపేరు. తాగేశాడు.

మళ్ళీ నింపేరు. తాగేశాడు.

"ఏవయ్యా! ఇహనేనా కుర్చీలో కూచుంటావా?" అన్నారు డాక్టరుగారు.

"ఏంటి! కూషోవాలా! కూషంటే నా పళ్ళు పీకుదావనా! పళ్లు రాలగొట్టేస్తానోయ్? నా షంగ తెలీదు నీకు. నా పంటిమీద షెయ్యివెయ్యి షూద్దాం—" అని మత్తుగా లేచి డాక్టర్‌గారి కాలర్ పుచ్చుకున్నాడు రాంబాబు.

—భాగవతుల





# కేరక్టర్ ఏక్టర్

పేపర్లో ప్రకటన చూశాడు అప్పారావు.

ఉగ్ర నరసింహా ప్రొడక్షన్స్ నిర్మించ బోయే గొప్ప పౌరాణిక, జానపద, సాంఘిక, క్రైం అండ్ థ్రిల్లర్ రెండవ చిత్రానికి పదేళ్ళ నాటక రంగ అనుభవ ముండి, ఉత్సాహంగల నూతన నటీ నటులు కావలెనని వుంది.

కోరిక తీరిందనుకున్నాడతను. ఎన్నో ఏళ్ళుగా కేరక్టర్ ఏక్టర్ అన్పించుకోవా లని వుందతనికి. పోషించిన పాత్రని పోషించకూడదని నిష్టగా పెట్టుకొన్నాడు కూడా! అందుకే గత అయిదేళ్లుగా ప్రతి సినిమాలోను వేర్వేరు పాత్రలు ధరిస్తూ వచ్చాడు. వచ్చాడు అనేకన్నా అవకా శాలు తీసుకొచ్చేయి అనడం సబబు!

ఊర్లోనే ఆ సినిమా కంపెనీ ఉంది కాబట్టి కాలినడకనే వెళ్ళాడక్కడికి. రూంలో నిర్మాతలు కమ్‌టూ హీరోలు కమ్‌టూ స్టంట్ మాష్టర్లు కమ్‌టూ దర్శ కులు కమ్‌టూ...అందరూ చిత్ర కథా చర్చమీద కూర్చుని సీరియస్‌గా సిగరెట్లు కాలుస్తున్నారు.

ఎవరో వచ్చారన్నది గమనించి అప్పారావుని వాళ్ళు చూశారు. చూపులకే అప్పారావు వణికిపోతూ తొంభై నాలుగు భంగిమలు ప్రదర్శించాడు. వాళ్ళంతా 'భేష్' అనుకొన్నారు.

"నా పేరు అప్పారావు. రంగస్థల నటుణ్ని. ఇంకా శతచిత్ర నటుణ్ని. వేసిన పాత్ర వేయకుండా నూరు భిన్న పాత్రలని అవలీలగా పోషించాను. నిమిషం కన్పించినా క్లోజప్ షాట్‌లో కుప్పలుగా ఫీలింగ్స్ ఒలకబోసిన అనుభవాలు న్నాయి. కేరక్టర్ ఏక్టర్ అన్పించుకోవా లని నా తాపత్రయం. మీ చిత్రంలో మంచి కేరక్టర్ రోల్ నాకిప్పించండి. యాక్షన్ మీరే చూద్దురుగాని" సన్నాయి నొక్కులు నొక్కుతూ స్వీయకథ విన్పించాడప్పారావు.

వాళ్ళంతా ఆలోచిస్తున్నారు. పెళ్ళిళ్లు



కాని బీదమ్మాయిలకు తండ్రిగా విధవ అప్పచెల్లెలున్న అన్నగా, పిచ్చి భార్యతో వేగలేని భర్తగా, విలన్‌గా... రకరకాలుగా వాళ్ళివ్వబోయే పాత్రల గురించి అప్పారావూ ఆలోచిస్తున్నాడు.

హఠాత్తుగా వాళ్ళంతా అప్పారావుని నఖశిఖ పర్యంతం చూశారు. క్లయిమాక్స్ సీనులో ప్రత్యక్షమయ్యే వినాయకుడిగా పని కొస్తాడని డిక్లేర్ చేశారు. ఎన్నుకొన్నారు.

తెలిసి బాధపడ్డాడు అప్పారావు.

అక్కడక్కడా ఎక్‌స్ట్రాగా కన్పించిన వాటికి మలమాచేసుకొని చెప్పినా లాభం లేకపోయిందనుకొన్నాడు.

ఏడ్చాడు. వెంటనే ఎందుకో నవ్వు తోసుకొచ్చింది. విరగబడి నవ్వాడు.

నవ్వుతూంటే ఈ బక శరీరం తనది తంగా. గమ్మత్తుగా కదలడం గ్రహించి "ఎస్. ఐయామ్ కేరక్టర్ ఏక్టర్" అనుకొన్నాడు.

—త్రినేత్రి

# పీడ

పరంధామయ్యగారు మా యింటికి వచ్చి ఇరవై రోజులు పైగా అయింది.

అసలే నెలాఖర్రోజులు.

ఏం చేయాలో తోచట్లేదు. దొరికినంత వరకు అప్పులు ప్రతిచోటా వాడేశాను. ఇహ మరి ఎక్కడా దమ్మిడీ కూడా పుట్టదు. మా ఆవిడ కూడా వీలైనంత వరకూ యధాశక్తి అప్పులు చేసేసింది.

'ఏం దార్రా భగవంతుడా ?' అని బుర్ర పగలగొట్టుకుంటున్నాం.

'కరువులో అధిక మాసం' అన్నట్లు ఈ సమయంలో చుట్టాలొకరు ప్రాణం మీదికి.

డబ్బు సంగతలా వుంచినా ముఖ్యమైన సమస్య ఇల్లు. ఆరు వాటాలకి కలిపి ఒకే ఒక కామన్ బాత్‌రూం అండ్ లెట్రిన్.

ఇలాంటప్పుడు ఇంటికొచ్చిన చుట్టాలు ఏదో ఒకటి, రెండ్రోజులు ఉండి పోతే యిబ్బంది లేదుగాని నెలల తరబడి మమ్మల్ని ఇరకాటంలో పెట్టేస్తే మేమేం కావాలి.

లాభం లేదు.

ఈ పీడ విరగడవ్వాలి.

కృతనిశ్చయుడనై భార్యామణితో సంప్రదింపులు జరిపేను ఓ రోజు ఏకాంతంగా.

మా ఆవిడక్కూడా అనకూడదు గాని ఒళ్ళు మండిపోతోంది ముసలాడి ప్రవర్తన చూస్తుంటే.

'కింకర్తవ్యం' అన్నట్లు కూచున్న మా ఆవిడ బుర్రలో ఏదో ఫ్లాష్ వెలిగి నట్లయింది.

"ఏమండీ! రేపొక పని చేద్దాం. రేపు చారులో నేను ఉప్పు ఎక్కువ వేస్తాను.



ఆయనతో భోజనం చేస్తూ మీరు నాతో దెబ్బలాట పెట్టుకోండి. అప్పుడు నేను కూడా రెచ్చిపోయి మీతో దెబ్బలాడతాను. ఇద్దరంకలిసి ఆయన్ని తీర్పుచెప్పమందాం. ఆయన మీవేపు చెప్తే నేను చూసుకుంటాను. నా వేపు చెప్తే మీరు చూసుకోండి. ఇహ ఈ బాధ భరించలేక అయన సాయంకాలానికల్లా బండెక్కేస్తాడు" అంది.

"ఆఁ వెరీగుడ్ అలానే చేద్దాం" అన్నాను. మర్నాడు అంతా అనుకున్నట్టే అమలు జరిపేం. భోజనం చేస్తూ చారులో ఉప్పు ఎక్కువైందని పోట్లాట వేసుకున్నాను సావిత్రితో.

జుమ్మని తారాజువ్వలా లేచింది సావిత్రి ఒంటికాలి మీద.





నేను కూడా తక్కువ తినకుండా తకతై తకతై మంటూ డాన్సాదేశాను. చివరికి ఇద్దరం కలిసి ఆయన్నే తీర్పు చెప్పమని అడిగేం.

"అమ్మా! ఆలు మగలమధ్య ఎవరూ జోక్యం కలిగించుకోకూడదు. నాకెందుకు చెప్పు ఇరకాటం? ఏదో ఓ రెండు నెల్లు చూసిపోదామనొచ్చినవాణ్ని" అంటూ యధావిధి భోజన కార్యక్రమంలో పడ్డాడు. చేసేదిలేక గుడ్లు తేలేసాం ఇద్దరం జాయింట్ గా.

—నటరాజ్

# వేచియుండుగది

లంకవరం నాయుడుగారు చిర్రుబుర్రు లాడుతున్నారు. అప్పటికే ప్లాట్ ఫారం మొత్తం రెండుమూడు సార్లు కొలిచేశారు అసహనంతో.

అక్కడో విన్నపాలబోర్డు రైల్వేవారు తగిలించారు.

"అనివార్య కారణాలవల్ల రైళ్లలేటుగా వస్తున్నాయి. హైద్రాబాద్ పోయే కోణార్క రాకడ నిశ్చయంగా చెప్పలేం".

స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళయినా ఇంకా రైళ్లెందుకు ఆలస్యంగావస్తున్నాయో యీసారి తమ నియోజక వర్గంలో తన మద్దతుతో గెలిచిన తన కులం వాడైన ఎమ్మెల్యేని పట్టుకొని అతని కుమ్మక్కుతో ఎమ్. పి. గార్ని కూడా పట్టుకొని పార్లమెంటులో అడిగించాలని, అందుకు కావలసిన ఖర్చుల్ని చందాల రూపంలో గ్రామస్థుల దగ్గర వసూలు చేయాలని మనసులో గట్టి నిర్ణయానికొచ్చారు.

స్టేషన్ మాష్టర్ సీర్సంగా ప్లాట్ ఫారం మీద పచార్లు చేస్తున్నాడు.

"కోణార్క ఎంతలేటు మాష్టారూ?" - అడిగారు నాయుడుగారు మరో చుట్ట వెలిగించుకుంటూ.

"ఎంతో సరిగా చెప్పలేమండీ! ఎగువ నుంచి రావాలి" సమాధాన మిచ్చారు మాష్టరు గారు.

"ఇంత ఆలస్యంగా రైలు బళ్లు పరుగెడుతుంటే టైం టేబిళ్లు ఎందుకండి అచ్చు వేయించడం, ప్రకటించడం. ఒట్టి దండగ..." ఇంకా ఏదో మాట్లాడబోతున్న నాయుడుగార్ని వారించాడు స్టేషన్ మాష్టరు.




"కోపం చేయకండి నాయుడుగారూ! రైళ్లు టైం ప్రకారం వస్తే, ఈ స్టేషనుతో పాటు ప్రభుత్వంవారు 'వేచియుండు గదులు' ఎందుకు కట్టిస్తారండి?" అని చక్కాపోయాడు తనదార్న.

లంకవరం నాయుడుగారి నోట్లో వెలిగించిన చుట్ట అలాగే ఉండిపోయింది పొగ పైకి రాకుండా.

—వేమకోటి

Statement about ownership and other particulars of CHATURA

FORM IV [See Rule 8]

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India | : Yes |
| | If Foreigner, state the country of origin | : —— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 4. | Publisher's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India | : Yes |
| | If foreigner, state the country of origin | : —— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 5. | Editor's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India ? | : Yes |
| | If foreigner, state the country of origin | : —— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 6. | Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one per cent of the total capital. | : VASUNDHARA PUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.

Date :
March 1, 1980.

Sd/- RAMOJI RAO
Publisher.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

# నిబ్బరంగా ఉండాలనుకుంటే...

## ...అందుకు తోడ్పడే సంస్థ మీకు తోడుగానే ఉండా

## మార్గదర్శి దానికొక మార్గం చూపిస్తుంది...

ప్రతి వ్యక్తి జీవితంలోనూ కొన్ని బరువూ బాధ్యతలూ ఉంటాయి. అవి తీరాలంటే అందుకు తగిన సాధన సంపత్తి చాలా అవసరం. కుమారుని విద్య, అమ్మాయి వివాహం, సుఖజీవనానికో ఇల్లు వ్యాపార ప్రారంభానికి మదుపు ... ఇలా బాధ్యతలు ఎన్నో రూపాల్లో ఉంటాయి. వీటికి సరైన పరిష్కారమార్గం – తగిన పథకం మార్గదర్శి చూపిస్తుంది.

క్లుప్తంగా కొన్ని ప్రధాన అంశాలు:

* రూ. 10,000 నుంచీ రూ. 1,00,000 వరకూ మీ శక్తికీ, అవసరాలకూ సరితూగే వివిధ చిట్‌లు. రూ. 200 నుంచీ, రూ. 2000 వరకూ నెలసరి వాయిదాల్లో చెల్లించే అవకాశంతో.

* సత్వర చెల్లింపులు. ఏ చిట్‌ఫండ్ సంస్థలోనూ కానరాని రీతిలో పాడుకొన్న రెండు వారాల్లో మొత్తం లభిస్తుంది.

* ఎంత మొత్తం ఏ తేదీలోగా చెల్లించాలో స్పష్టంగా తెలియజేస్తూ ప్రతి నెలా ప్రతి సభ్యునికీ పోస్టు ద్వారా ఇంటిమేషన్ కార్డు అందుతుంది.

* డబ్బు నష్టపోయే ప్రమాదం లేదు. పదహారేళ్ళకు పైగా ఈ రంగంలో నిలదొక్కుకుని ఉన్న సంస్థ చరిత్రే అందుకు తార్కాణం.

డబ్బుకోసమేనా మీ చింత?
మార్గదర్శి ఉన్నది మీ చెంత!



**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్
మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.